
The Largest Circulated
Telugu Monthly
చతుర
నవంబరు 1988
రూ.3/-
మద్దంశెట్టి హనుమంతరావు
కక్ష


రెండులో ఒకటిని
ఈ రోజే ఎన్నుకోండి
మా CAT 1000 సిరీస్. అవి కంప్యూటర్ సాంకేతిక సహకారంతో తయారుచేయబడినవి. ప్రతిసారి మీరు టి.వి. చూసే సమయంలో మీకు దీని విశేష ఉపయోగాలు తెలుస్తుంది. చక్కటి, సున్నితమైన, నిజజీవితంలోలా రంగుల దృశ్యం. ఇవన్నీ కంప్యూటర్ సహకార డిసైను, కంప్యూటర్ సహకార ఉత్పత్తి విధానం, పూర్తిగా కొరత నిషేధించబడిన ఎల్‌టిటి, ఎస్ఎమ్‌పిఎస్, ఎమ్‌టిఎస్ఎఫ్ఐటి, ఎలక్ట్రానిక్ ట్యూనర్, కలర్ ఐసిలు అన్నియు ప్రపంచ ఖ్యాతిగాంచినవారిచే ఉత్పత్తి చేయబడినవి వాడటం.
◄CAT 1000 SE
అతి అందమైన హుందాగా అగుపించే రంగుల టి.వి.
CAT 1000 DX ►
(రిమోట్ మోడల్)
డిజిటల్ సింతసైజర్ ట్యూనింగ్ మరియు 39 ప్రోగ్రాం జ్ఞాపకశక్తి
వేరుగా అమర్చిన CAT 1000 DX చేతి స్విచ్ సెట్టుకు ప్రోగ్రాం, బ్యాండు, చానలు, శబ్దం, రంగుల విచక్షణ, పరిశుభ్రత, మీకు ఏది కావలిస్తే అది మీరు ఉన్న చోటునుంచే సరిచేసుకునేందుకు మైక్రో ప్రాసెసరు కంట్రోల్ కలదు.
Solidaire
10
A DECADE IN CONSUMER ELECTRONICS
సాలిడేర్
Insight-DE-780




సెప్టెంబర్ నెల 'చతుర'లో ప్రచురితమైన వినయ్ నవల 'దుప్పటి'పై మాకు అందిన 'చతుర' సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.

## ఇది జీవితం...నిజం!

(ప్రథమబహుమతి రు. 100/- పొందిన సమీక్ష)

మధ్యతరగతి జీవితాలకు అద్దంపట్టిన నవల 'దుప్పటి' చదువుతూన్నంతసేపూ చలికాలంలో దుప్పటి కప్పుకున్నంత వెచ్చగానూ, హాయిగానూ వుంది. 'ఇది కథకాదు...జీవితం' అన్న రచయిత పలుకులు అక్షరాలా నిజం! ఈకథలోని సన్నివేశాలు, పాత్రలు, వాటి అనుభవాలు, అనుభూతులూ అన్నీ నిత్యమూ మనం అనుభవించేవే, మనచుట్టూ చూస్తున్నవే.

ముఖ్యంగా విజయపాత్ర వున్నతంగా మలచబడింది. మగపిల్లలకంటే ఆడపిల్లలకే జీవితంపట్ల అవగాహన ఎక్కువేమో అనిపిస్తుంది. ఉదాత్తమైన ఆమె వ్యక్తిత్వం పాఠకుల్ని ఆకట్టుకుంటుంది. అయితే ప్రాక్టికల్ అవుట్‌లుక్‌గల విజయ కేవలం 'పాఠకుల అభిరుచుల'కనుగుణంగా రచనలు చేస్తున్నాడన్న కారణంగా, ఇతరత్రా అర్హుడూ, తగిన వాడూ అయిన గౌరీశం ప్రేమను నిరాకరించడం కొంత వింతగానే అనిపిస్తుంది. ఇక్కడ ఆమె వ్యక్తిత్వం వోవర్ స్ట్రెచ్ చేయబడిందన్న అభిప్రాయం కలుగకమానదు.

తనకు సరిపోయే కొత్తదుప్పటికోసం అర్రులు చాచిన శీను. తీరా దానిని కొనుక్కునే అవకాశం వచ్చేసరికి, దుప్పటి బదులు పుస్తకాలు, డిసెక్షన్ బాక్సూ కొనుక్కోవడంతో అతడు నేర్చుకున్న అనుభవాల పాఠాలూ, జీవితంపట్ల పెంపొందించుకున్న అవగాహన, బాధ్యత అర్థమవుతాయి.

ఎంతో వుదాత్తంగా ఆరంభమైన గౌరీశంపాత్ర మాత్రం చివరిలో దెబ్బతిన్నదని చెప్పకతప్పదు. మంచి వ్యక్తిత్వము, పట్టుదల, దీక్షగలవాడిగా పరిచయమైన గౌరీశం-చివరకు తన మీద తనకే అదుపులేని బలహీనుడిగా మలచబడటంలో రచయిత తికమక కనిపిస్తుంది. విజయను ప్రేమించిన గౌరీశం, అరుణతో ఆవిధంగా ప్రవర్తించడం, పాఠకుడు ఆపాత్రపట్ల ఏర్పరచుకున్న సదభిప్రాయానికి గొడ్డలిపెట్టవుతుంది. పాఠకుల అభిరుచిపేరిట కొన్ని పత్రికలు చేసే 'వ్యాపారం'లో గౌరీశం పావుకావడం నేటి రచనా ధోరణులకు చక్కని చురక.

ఇక అరుణ విషయానికొస్తే, చెల్లెలికున్నంత అవగాహనలేకపోయినా అరుణ మంచి అమ్మాయి..ఆమెను చిత్రసీమకుతోసి, ఫ్లాప్‌చేయించి గౌరీశానికిచ్చి పెళ్లిచేయడం అనవసరమేమోననిపిస్తుంది...అలాగే విజయవంటి తెలివైన పిల్లను, సమర్థురాలిని చివరికలా గాలిలో వదిలేసి వుండకూడదేమో!...తక్కిన పాత్రలన్నీ నేటి లోకంపోకడకు తగినట్లే వున్నాయి.

కథ, కథనం శైలి చక్కగా వుండి రచయిత సామర్థ్యాన్ని చాటుతున్నాయి. ఆద్యంతం

వుత్కంఠతో చదివించి, ఓ మంచి నవలను చదివామన్న అనుభూతిని కలిగించింది.

--విశ్వమోహిని, భువనేశ్వర్

## చక్కని కథనం

(ద్వితీయబహుమతి రు. 75/- పొందిన సమీక్ష)

**చా**లీచాలని పిరుగుల దుప్పటిలో నిద్ర పట్టక నిస్సహాయంగా, ఉక్రోషంగా ఓ పసిపిల్లవాడు పడే మానసిక వేదనలో, కనీసావసరాలకు కూడా చాలీచాలని ఆదాయంతో జీవితాన్ని నెట్టుకొస్తున్న నేటి మధ్యతరగతి మనిషి జీవితాన్ని అత్యంత సహజంగా చిత్రీకరించారు.

జీవితమంటే అందమైన రంగుల కల కాదన్న వాస్తవాన్ని అర్థంచేసుకోలేక జీవితాన్ని వ్యర్థం చేసుకొనే మధ్యతరగతి ఆడపిల్లలకు అరుణ పాత్ర కనువిప్పు కాగలదు. వాస్తవజీవితాన్ని చిన్నవయసులోనే అవగాహన చేసుకొని నిరాడంబరంగా జీవించడంలోని తృప్తిని, మాధుర్యాన్ని విజయ పాత్రద్వారా చపి చూపారు రచయిత.

పరిశోధనాత్మక నవలల పేరుతోనూ, శృంగార సాహిత్యం పేరుతోనూ అసభ్యంగా రచనలు సాగిస్తూ 'పాఠకులు మెచ్చుకుంటున్నారు కాబట్టి మేం రాస్తున్నాం' అంటూ మూర్ఖంగా సమర్థించుకునే రచయితలను సున్నితంగా విమర్శించడమేకాక, పారితోషికాలు ఎగ్గొట్టి వర్ధమాన రచయితల నిస్సహాయతను కొంతమంది ఎడిటర్లు ఎలా ఎక్స్‌ప్లాయిట్‌చేస్తారో బయటిప్రపంచానికి తెలియపరిచారు. చదువుకు ఎగనామంపెట్టి, ఏపనీ చేతకాకపోయినా, లక్షలు గడించెయ్యాలనే దురాశతో అక్రమమార్గాలుపట్టే యువకుల్నీ, వాళ్లసామర్థ్యాన్ని సక్రమమార్గంలో వినియోగించుకోలేని సమాజాన్నీ, పెరిగేధరల్నీ, తరిగే జీవితవిలువల్నీ- ఇలా ఒకటేమిటి మొత్తం మధ్యతరగతి బ్రతుకుల్లోని సారాన్ని కాచివడపోసి, పాఠకులకందించారు రచయిత.

మధ్యతరగతి జీవితాలపై చాలారచనలు వచ్చినా కథనంలో నూతనత్వం సాధించగలిగిన రచయితకు అభినందనలు.

--సి.హెచ్. నాగమణి. గొల్లపాలెం

## వాస్తవికంగా వుంది

(తృతీయ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)

**మ**ధ్యతరగతి జీవితాలను, వారి సమస్యలను సున్నితంగా, అతిగా లేకుండా రచయిత చిత్రీకరించారు. నేడు నూటికి 99 శాతం మధ్యతరగతివారు మిథ్యా విలువలకు లోబడటం, అర్థంలేని భేషజాలకుపోవడం మనం చూస్తున్నదే. తమకు చేతనైనపని- మిషన్ కుట్టడమో, అప్పడాలు, వడియాలుచేసి అమ్మటమోచేసి సంసారానికి సాయపడటం పరువుతక్కువగా భావించేవాళ్లే ఎక్కువ.

విజయ పాత్రను చక్కగా తీర్చిదిద్ది అలాంటివారి కళ్లు తెరిపించారు రచయిత. కేవలం సమస్యలే కాకుండా వాటిని అధిగమించడం ఎలాగో సూచనప్రాయంగా తెల్పారు. గౌరీశం పాత్రలో స్పష్టత కనబడదు. మొదట ఉన్నతంగాను, ఆదర్శవంతంగాను చిత్రీకరించబడిన గౌరీశం డబ్బు కోసం, పేరుకోసం చవకబారు సాహిత్యాన్ని సృష్టిస్తాడు. ఒకవేళ అది సంభవమే అయినా విజయను ప్రేమించిన అతడు ఒక బలహీనక్షణంలో అరుణని కామించి ఆమె గర్భానికి కారకుడవుతాడు. ఇది అరుణ ప్రోత్సాహంతోనే జరిగినా అంత సబబుగా కనబడదు. ఇంత జరిగినా ఇంకా విజయను పెళ్లి చేసుకోవాలని ఆశిస్తాడు. ఆమె మనస్తత్వం అతనికి తెలిసి వుండీ అలా అతడు అడగటం అతని నిజాయితీని శంకింపచేస్తుంది.

ధరలు పెరిగినప్పుడల్లా దానికితగ్గ ఆదాయం పెరగక మధ్యతరగతివారు తమ అవసరాలను ఎంతగా కుదించుకుంటారో చదివితే హృదయం కలతబారక మానదు. మధ్యతరగతి ఆర్థిక జీవితాన్ని చాలీచాలని దుప్పటితో పోల్చటం చక్కని ఊహ.

చివరికి శ్రీను తన చేతిలో డబ్బు వున్నప్పటికీ తన చిరకాలస్వప్నం అయిన దుప్పటి కొనలేకపోతాడు. అంతకన్నా ముఖ్యమైన అవసరాలు అతనికి కనబడటమే అందుకు కారణం. నవల చదివిన తరవాత మధ్యతరగతి

కవర్ డిజైన్: **పినిశెట్టి**

వారికి సరియైన ప్లానింగ్ వుంటే అప్పులులే కుండా సంసారం గడుపుకోవడం సాధ్యమే నేమో అనిపిస్తుంది.

—వై. క్రాంతికుమారి, ధర్మవరం

## జీవితదర్పణం

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

నవల చదవడం మొదలుపెట్టడంతోటే, 'ఓస్... ఈ నవలలో ఏముంది? మనకు నిత్యం ఎదురవుతున్న సమస్యలేకదా! కొత్తగా ఈ రచయిత చెప్పేదేమిటి' అని అనిపిస్తుంది. కానీ ఇతివృత్తం పాతదే అయినా రచయిత చెప్పిన తీరు, పాత్రచిత్రణ పాఠకులను ఆకట్టుకుని నవలలోని పాత్రలు మనమే అనుకొనేటట్లు చేయడంలో కృతకృత్యులయ్యారు. ఇప్పుడు వస్తున్న క్రైం, సస్పెన్స్, సెక్స్ నవలలను చదివి, వాస్తవాన్ని మరిచి, ఏదో సాధించాలని కలలుగనే అరుణ, గౌరీశం, సుధాకర్‌లాంటి యువతను ఆలోచింపజేసేదిగా వుంది.

ఈ నవలలో ముఖ్యభూమిక విజయ. చివరి వరకు తనవంతు కర్తవ్యాన్ని నెరవేర్చి, కుటుంబంకోసం అహర్నిశలు పాటుపడిన ఉత్తమ వ్యక్తిత్వం, ఉన్నతభావాల కలయిక విజయ. వెంకటేశం, జగదాంబ కష్టాలతో పండిపోయినా, నైరాశ్యాన్ని పెంచుకోక, బతుకుబండిని లాగడంలో అంతో ఇంతో కృతకృత్యులయ్యారనే అనిపిస్తుంది.

గౌరీశం, అరుణ ఇద్దరు స్థిరచిత్తం కలవారుకాదు. అరుణ, గౌరీశం తప్పుచేసి కూడా గౌరీశం విజయను కావాలనుకోవడం గౌరీశం వ్యక్తిత్వాన్ని కించపరిచేదిగా వుంది. అరుణను అన్యాయంచేయక, గౌరీశం వివాహంచేసుకోవడంతో రచయిత వారి పాత్రలకు న్యాయంచేకూర్చారనే చెప్పవచ్చు. కొలీగ్స్‌కు పార్టీ ఇవ్వడం కూడా ఇతరులచేత చెప్పించుకునే నారాయణ గౌతమితో ప్రేమలో పడటం కొంత ఆశ్చర్యంగా వుంది. విజయకు గౌరీశంలో నచ్చని అతిచిన్న విషయానికి, అతనితో తెగతెంపులు చేసుకోవటం, అసహజంగా ఉంది.

రచయిత తన 'దుప్పటి'ని అన్ని రంగాలను గురించినవివరాలతో కలబోసి నేసారనిపిస్తుంది. నవలలో అక్కడక్కడ సహజత లోపించినప్పటికీ, చదువుతున్నంతసేపూ నిత్య జీవితాన్ని కళ్లెదుట వుంచిన వినయ్‌గారు అభినందనీయులు.

—ఎస్. తేజోవతి, కల్లూరు

## ఆడపిల్లలకు ఆదర్శం

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

విజయపాత్ర కల్పనా, పోషణా చాలా ఉదాత్తంగా ఉన్నాయి. ఈ పాత్రని ఆశయంగా తీసుకుని, ఊరికే సినిమా కబుర్లు చెప్పుకుంటూ కాలం వెళ్లబుచ్చుకునే ఈకాలం ఆడపిల్లలు కొంతమందయినా మారగలిగితే రచయిత ఆశయం సిద్ధించినట్టే.

పెళ్లిముందు ఎన్ని ఆశయాలు ఉన్నా ఆ ఆశయాలు భార్యకాబోయే వ్యక్తి అంగీకరించినా, పెళ్లి తర్వాత ఆచరణలో కష్టసాధ్యం అయేసంగతి 'వినయ్' చాలా బాగా చెప్పారు నారాయణ, గౌతమిలద్వారా.

అరుణ సగటుఆడపిల్ల జీవితంతోరాజీపడి, తన లిమిటేషన్స్ గుర్తించి, నెట్టుకొచ్చే పాత్ర. గౌరీశం తనని పెళ్లిచేసుకుంటానంటే వెంటనే ఎగిరిగంతేసి ఒప్పుకోకుండా ముందు చెల్లెల్ని చేసుకోమని తర్వాత చెల్లెలు ఇష్టపడలేదంటేనే ఒప్పుకున్న అరుణ ఒకవిధంగా చెప్పాలంటే నిస్వార్థమైనదే. మనోహర్‌లాంటి వారు జీవితంలో అక్కడక్కడ తారసపడతారు. వీలయినంతవరకూ ఇతరులకి ఉపయోగపడటానికి ప్రయత్నిస్తారు ఇలాంటివాళ్లు.

మొత్తంమీద మధ్యతరగతి జీవితాన్ని చూపించి దానిలోనే బాగుపడేమార్గాలని చెప్పి చదివింపచేసే నవల 'దుప్పటి'.

—గాడేపల్లి సుబ్రహ్మణ్యం, విజయనగరం

## చక్కని విశ్లేషణ

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

సెప్టెంబరు 'చతుర'లో ప్రచురింపబడిన 'దుప్పటి' నవల మధ్యతరగతి జీవితానికి అద్దంపట్టినట్లుంది. మధ్యతరగతి జీవితంలోని కష్టా

లు, కన్నీళ్లు, సంతోషాలు, విషాదాలు, సమస్యలు, నెరవేరని కోర్కెలు... మొదలైనవన్నీ హృదయానికి హత్తుకునేలా చిత్రించబడ్డాయి. నేటి సమాజంలోని మధ్యతరగతి వారి జీవితం త్రిశంకుస్వర్గం లాంటిది. అటు ధనికులు లాగానూ, ఇటు పూర్తిగా పేదవారి లాగానూ కూడా జీవించలేరు. సమాజంలో పాతుకుపోయిన కృత్రిమ సాంప్రదాయాలకు అనుగుణంగా జీవిస్తూ, తాహతుకు మించిన వ్యయాలతో చివరికి అప్పులపాలవుతారు. పైగా తాముచేసిన అప్పులను తమ కుమారులకు వారసత్వంగా సంక్రమింపచేస్తారు. ఈ నవలలో వెంకటేశం పాత్ర ఇందుకు ఉదాహరణ. చాలీచాలని జీతంతో, అధిక సంతానంతో, సంసారాన్ని సాగించలేక అప్పులుచేసి చివరికి తన కుమారుడు నారాయణను కూడా రుణగ్రస్తుణ్ని చేస్తాడు.

కుటుంబపరిస్థితులు, జీవితానుభవాలు వ్యక్తిలో వయసుకి మించిన అవగాహనని, వికాసాన్ని కలిగిస్తాయనేందుకు విజయ పాత్ర నిదర్శనం. కానీ- ఇవే పరిస్థితులు కొందరిలో నిరాశావాదాన్నీ అవకాశవాదాన్నీ లొంగుబాటు మనస్తత్వాన్నీ ప్రోత్సాహిస్తాయి.

మధ్యతరగతి జీవితాల్లో అశాంతిని రేకెత్తించేవి కేవలం ఆర్థిక సమస్యలే కాదు- వ్యక్తులమధ్య విభేదాలు కూడా! కుటుంబసభ్యుల మధ్య అవగాహన, పరస్పరప్రేమ లోపించటంవల్ల కలతలు మొదలై చివరికి ఒకరినొకరు ద్వేషించుకునేంతటి తీవ్రస్థాయికి చేరుకుంటాయి. జీవితాంతం తమ కుటుంబసభ్యురాలిగా సహజీవనాన్ని సాగించవలసిన వదినపై అకారణ ద్వేషాన్ని ప్రదర్శిస్తూ ఆమెను నిరంతరం విమర్శిస్తూ కుటుంబంలో అరాచకాన్ని సృష్టించే ఆడపడుచులకు విజయ పాత్ర కనువిప్పు కలిగిస్తుంది. పరిస్థితులు మరింత హీనంగా దిగజారకుండానే, ఒకరినొకరు ద్వేషించుకునే దుస్థితి రానీయకుండా, ఇరువైపులనుంచీ ఆలోచించి అన్నయ్యకు పరిష్కారం సూచించిన విజయ తెలివి అభినందనీయం.

కేవలం మధ్యతరగతి జీవితంలోని దుర్భర స్థితుల్నేగాక స్త్రీలోని మమకారాన్ని, స్థిరత్వాన్ని చంచలత్వాన్ని, స్వార్థబుద్ధిని రచయిత చక్కగా విశ్లేషించారు.

— ఎన్.సి. సరోజ, హైదరాబాదు

# ఏరిన ముత్యాలు

★ పదవులను, స్థానాలనుబట్టి వ్యక్తిత్వం పెరగదు. వ్యక్తిత్వాన్ని బట్టి ఆ పదవులకు-స్థానాలకు విలువ పెరుగుతుంది.

— సిసిరో

★ మంచి చెడ్డలనేవి ఊహించే మనసులోనేగాని వస్తువుల్లో లేవు. — పానుగంటి

★ న్యాయవిహితమైన తెలివితేటలు మోసంగా పరిగణించబడతాయేకాని, విజ్ఞానంగా గుర్తింపు పొందవు.

— ప్లేటో

★ పనేచెయ్యకుండా జీవితాన్ని వృధాచేసుకోవడం కంటే పనులు చేస్తూ పొరపాట్లు చేయడం కూడా మంచిదే.

— బెర్నార్డ్‌షా

★ జన్మతః మానవులంతా సమానం కావచ్చు. స్వభావతః మనుషులందరూ ఒకటిగా వుండరు. కనుక అందరిని ఒకేవిధంగా చూడటం అనవసరం, వ్యర్థం.

— ఫ్రేడే

★ ఆందోళన లేకపోవడమే నిజమైన ఆనందం. సంతృప్తికి మించిన సుఖం మరిలేదు.

— సెనెకా

★ దేవుడు గుళ్ళలో, మసీదుల్లో వెదికినంతకాలం దొరకడు. అతడు అందరిలోనూ ఉన్నాడు. మానవహృదయం అది అర్థంచేసుకోగలిగినప్పుడే మతకక్షలు మాయమవుతాయి.

— కబీర్

★ మనిషి మాట తీరునుబట్టి అతని మేధాశక్తి అంచనావేయవచ్చు. సరళంగా, సుస్పష్టంగా, హృద్యంగా మాట్లాడగలిగిన వ్యక్తి హృదయం కూడా అంత నిర్మలంగా ఉంటుంది.

— బ్రూస్‌బార్టన్

★ పుస్తకాలు లేని ఇల్లు కిటికీలు లేని గదివంటిది. పుస్తకాలు కొనగల శక్తి ఉన్నవారు పిల్లలకు పనికొచ్చే పుస్తకాలు కొంటే వారిని సక్రమంగా పోషించినట్లే.

-- మాన్

★ ఎదుటివ్యక్తి నీకు వ్యతిరేకంగా, భిన్నంగా ఆలోచించాడని అతని బుర్రబద్దలుకొట్టకు. పదేళ్ళక్రితం నీ బుర్ర ఇప్పుడు నీకు శుద్ధవ్యతిరేకంగా ఉండేది. అవునా?

— హొరేస్‌మాన్

★ మనస్సు అంగీకరించనిదే పాపం — హజరత్ మహమ్మద్

★ స్వార్థం ఒక్కటే పాపం. నీచత్వం ఒక్కటే దుర్గుణం. అసూయ ఒక్కటే నేరం మిగతా గుణాలన్నింటిని మార్చవచ్చుగానీ వీటిని మార్చలేం.

— అరవిందయోగి

★ మనకు అపకారం చేసినవాడి మార్గాన్ని మనం కూడా అనుసరించకుండా నిగ్రహంతో ఉండటమే మన ఉత్తమ ప్రతీకారం అవుతుంది.

-- జేనీపోర్టర్

సేకరణ: నల్లబెల్లి శ్రీమన్నారాయణ

# సాహస ప్రయోగం



## ఎనిమిది కోట్ల వ్యయంతో సినిమా

కొన్ని దశాబ్దాలుగా హిందీచలన చిత్రరంగాన్ని ఎదురులేకుండా ఏలుతున్నారు కపూర్ కుటుంబీకులు. ఒకప్పటి ప్రసిద్ధ సినీనటుడు పృథ్వీరాజ్ కపూర్‌కి పుత్రుడూ, రాజ్‌కపూర్‌కి తమ్ముడూ అయిన శశికపూర్ తన అద్భుతమైన నటనాచాతుర్యంతో, వెరగని అందమైన చిరునవ్వుతో ఎందరి అభిమానాన్నో చూరగొన్నాడు.

సినీరంగానికి వచ్చిన తొలిరోజుల్లో కొన్నాళ్లు శశికపూర్‌కూడా అపజయాల్నెదుర్కొనక తప్పలేదు. అప్పటికే అతని సోదరులు రాజ్‌కపూర్, షమ్మీకపూర్‌లు సినిమారంగంలో మంచిపేరు ప్రఖ్యాతులు సంపాదించినా శశికపూర్‌కి మంచి అవకాశాలు లభించలేదు. అయినా పట్టువిడువకుండా ప్రయత్నించి టాప్‌హీరోస్థాయికెదిగాడు శశికపూర్. సూపర్ హీరోలైన అమితాబ్‌బచ్చన్, ధర్మేంద్ర, జితేంద్ర, సంజీవ్‌కుమార్‌వంటివారితోనూ నటించాడు.

పదేళ్ళనుండీ అతను స్వంతచిత్రాల నిర్మాణం ప్రారంభించాడు. తన 'ఉత్సవ్' చిత్రంలో హీరోయిన్‌గా 'రేఖ'ను ఎంపిక చేసుకుని భారీవ్యయంతో నిర్మించాడు. దీనిని విమర్శకులు సైతం పొగిడినా ఆ చిత్రం ఆర్థికంగా అతనికి నష్టాల్నే తెచ్చింది. అతనికి పేరు ప్రతిష్ఠలు తెచ్చిన సినిమా 'రాకీ'. అందులో హీరో పేరు కూడా రాకీయే. రాకీచిత్రమేగాక, అందులోని పాటలూ బ్రహ్మాండంగా హిట్టయినాయి. 'రాకీ' తర్వాత నటించిన చిత్రాలన్నీ అతనికి మంచిపేరునూ, డబ్బునూ సంపాదించిపెట్టాయి.

గత పాతికేళ్ళుగా సినీరంగంలో ఉన్న శశిక



పూర్ తన సోదరులకంటే కొంచెం విభిన్నంగా వుంటాడు. జెన్నీఫర్ అనే బ్రిటిష్ యువతిని పెళ్ళిచేసుకున్నాడు. జెన్నీఫర్ రంగస్థలనటి. ఆమెతో ఉన్నతమైన జీవితాన్ని గడిపాడత ను. జెన్నీఫర్ రెండేళ్ళ క్రితం చనిపోయింది. శశికపూర్‌కి ప్రస్తుతం యాభైఏళ్ల వయసుంది. ఏనాడూ కనిపించిన తారలవెంటపడి తన పేరు ప్రతిష్ఠలకు మచ్చతెచ్చుకోలేదు శశి. శశికపూర్, జెన్నీఫర్‌లకు ముగ్గురు సంతానం. ఇద్దరు కొడుకులు, ఒక కూతురు. కూతురు సంజన ప్రస్తుతం సినీరంగంలోకి వచ్చింది. కపూర్‌కుటుంబం నుండి సినిమాల్లోకివచ్చిన తొలి యువతి సంజన. కూతుర్ని చూసుకుని శశి పొంగిపోతాడు, గర్వపడతాడు కూడా.

ప్రస్తుతం శశికపూర్ 'అజీబా' అనే సినిమా తీస్తున్నాడు. 1001 రాత్రులనే అరబ్‌కథ ఆధారంగా, రష్యా సహకారంతో ప్రారంభించిన ఈ చిత్రంలో హీరోగా అమితాబ్‌బచ్చన్ నటిస్తు న్నాడు. అతని సరసన నాయికగా డింపుల్‌క పాడియా నటిస్తోంది. వీరుగాక అగ్రశేణి హిందీ సినీతారలెందరో ఈ చిత్రంలో ఉన్నా రు. శశికపూర్ నాలుగుకోట్ల రూపాయలు పెట్టు బడిపెట్టగా, రష్యన్లు మరో 4 కోట్లు కలిపి ఈ చిత్రాన్ని హిందీ, రష్యన్ భాషలలో నిర్మిస్తున్నా రు. ఈ చిత్రంలో హీరోయిన్‌గా శ్రీదేవిని నియ మించాలనుకున్నాడు శశి. కానీ ఆమె 25 రోజులపాటు ఏకధాటిగాసాగే ఈ షూటింగులో పాల్గొన వీల్లేకపోవటంతో నిరాకరించింది. దాంతో ఆ పాత్రధరించే అవకాశం డింపుల్‌కి లభించింది. శ్రీదేవి తన చిత్రంలో నటించ టంలేదని అతనిప్పటికీ బాధపడుతుంటాడు.

'అజీబా' చిత్రం ఈ సంవత్సరాంతానికి పూర్తవుతుందని శశి చెబుతున్నాడు. సినిమా ల్లో నటించటమేగాక, స్వంతంగా చిత్రాలు నిర్మించటంలో, పృథ్వీథియేటర్‌ను అభివృద్ధిప రచటంలో శశి నిమగ్నమై వుంటాడు. భార్య జెన్నీఫర్ డ్రామాట్రూప్ 'షేక్స్పియర్‌వాలా'ను పునరుద్ధరించాలనే ఆశకూడా ఉంది శశిక పూర్‌కు.

## మర్కటి మందిరం

పట్టుమని పది గడపల్లేని పల్లెల్లో సైతం దేవాలయం అంటూ ఒకటి ఉండటం మన దేశ ప్రత్యేకత. దేవుళ్ళకి ఆలయాలుంటే వింతకాదుగానీ కోతిమూకలకు సైతం ఓగుడి వెలిసిందంటేనే విడ్డూరం! పైగా అది ఆంజనే యస్వామి కోసం కట్టింది కూడా కాదు.

నేపాల్ రాజధాని ఖట్మాండు సమీపంలో 'స్వయంభు' అనే లోయ ఉంది. ప్రకృతిమాత అద్భుత సౌందర్యమంతా కలబోసినట్టుగా ఉంటుందక్కడి దృశ్యం. ఆ పచ్చని పరిసరా లలో 75 ఎకరాల విస్తీర్ణం ఆక్రమించుకున్న 'స్వయంభు' లోయలో అందమైన ఒక మంది రముంది. ఈ మందిర ప్రాంగణమంతా వాన




రాలు కిచకిచలాడుతుంటాయి. గర్భగుడిలో ఓ మర్కటి ప్రతిమ దేవుడిని పూజిస్తున్న భంగి మలో వుంటుంది. ఆలయ ప్రాకారం మీద, ఆవరణలో, చెట్లపైనా, స్థంభాలపైనా కోతులు ఛెంగుఛెంగుమంటూ దుముకుతూ వుంటాయి. మందిరపు అంతర్భాగాన గోడలపై వెలిసిన శిల్పాలు కూడా కోతులే! నేపాల్‌లోని హైందవు లంతా ఈ గుడిని ఆంజనేయస్వామి గుడిగానే భావించి వస్తుంటారు. గుడి ఆవరణలో నాలు గువేలకు పైగా వానరాలుండగా 'స్వయంభు' లోయలో మూడు లక్షలదాకా కోతులున్నట్లు ఓ సర్వేలో వెల్లడైంది.

ఎందరో విదేశీయుల్ని ఆకర్షిస్తున్న ఈ మందిరాన్ని పరిశీలించడానికి లండన్‌కు చెందిన నేషనల్ జియాగ్రాఫిక్ సొసైటీవారు

అమధ్య కొంతకాలంపాటు ఇక్కడ విడిది చేశారు.

'స్వయంభు' పరిసరాలు వాతావరణం, భౌగోళిక పరిస్థితులు వానరజాతికి ఎంతో అనువైనవిగా ఉన్నందునే గత ఎనిమిది శతాబ్దాలుగా వానరసంతతి ఇక్కడ స్థిరపడిందని పరిశోధకుల అభిప్రాయం.

ఇక్కడికి రోజూ ఈ మందిర సందర్శనార్థం సుమారు అయిదువేలమంది యాత్రికులు, భక్తులు వస్తుంటారు. తినుబండారాలను కోతులకి వేస్తూ వినోదిస్తున్నా మీదపడి కొరకటం, గీరటంలాంటి పనుల్తో కోతి బుద్ధి చూపించక ప్రశాంతంగా తమ మానాన తాముంటాయి ఇక్కడి వానరాలు. అందుకే ఆంజనేయ భక్తులూ, వానరమూకను సన్నిహితంగా చూడాలనుకునేవారూ నిర్భయంగా ఇక్కడికి వచ్చి ఆనందిస్తుంటారు.

## గువ్వలా ఎగిరిపోవాలి

''చంద్రలోకమైనా, దేవేంద్రలోకమైనా బొందితో జయించి మరల భువికి తిరిగి రాగలిగే మానవుడే మహనీయుడు'' అని లోగడ ఓపాట వచ్చింది. మనిషి సాధించలేనిదంటూ ఏముంది గనుక! అమెరికాలోని న్యూయార్క్‌లో ఇటీవల వెలిసిన ''ఫ్లైఅవే'' క్లబ్బు అన్ని వర్గాలవారినీ, అన్ని వయసులవారినీ విపరీతంగా ఆకర్షిస్తోంది. ఈ క్లబ్బుకి యాజమాన్యం వారొక బోర్డు వెళ్లాడగట్టారు. ''పక్షిలా ఎగరాలని ఉందా? మీ కోరిక తీరబోతోంది'' అని రాసిన అక్షరాలు చదవగానే క్లబ్బులోకి వెళ్లి తీరుతున్నారు జనం. ఉదయం ఎనిమిది గంటలు మొదలు అర్ధరాత్రి వరకు పక్షిలా ఎగరాలనే కుతూహలపరుల కోరిక తీరుస్తోందీ క్లబ్బు. అలా ఎగిరే వసతి సమకూర్చినందుకు మనిషికి నూటనలభై రూపాయల చొప్పునా, ఎగిరే విన్యాసాల్ని తిలకించదలచుకున్నవారి నుండి ఇరవై ఎనిమిది రూపాయల వంతునా వసూలు చేస్తారు. ఎందరెందరో క్యూలో కూర్చుని ఎగిరే తమ వంతుకోసం పడిగాపులు కాస్తుంటారు. ఈ క్రీడను పరిచయం చేసినప్పటినుండీ ఈ క్లబ్బు వ్యాపారం గణనీయంగా పెరిగిపోయింది.

క్లబ్బు యజమాని ఆండీగిబ్ ఎగరడానికి చాలా సులువైన పద్ధతిని కనుగొన్నాడు. ఎన్నో సాంకేతికపరమైన పద్ధతుల్ని మార్చి, సులువుగా వుండేలా సాహసవంతుల చేత ప్రయోగాలు చేయించాడు. సరికొత్త కిటుకుల కోసం ఇంకా ప్రయోగాలు చేస్తున్నాడు కూడా.

క్లబ్బులోపల పైకప్పు చాలా ఎత్తులో వున్న విశాలమైన హాలు ఉంటుంది. దాని తలుపులన్నీ మూసివేస్తారు. ఒక్కతడవకి అయిదుగురు చొప్పున 'ఎగిరే' విన్యాసాల్లో పాల్గొనే అవకాశం ఉంటుంది. ఖగోళ పరిశోధకులు వేసుకునే దుస్తుల్లాంటి దుస్తులు వేసుకుని ఎగరాలి. ఎగరాలనుకున్నవారు ఒక మెత్తని తివాచీపై నిల్చోవాలి. దీనికి 600 అశ్వశక్తి సామర్థ్యంగల ఎయిర్ మిషన్ అమర్చి వుంటుంది.



ఈ మెషీన్‌కున్న స్విచ్చ్‌ని ఆన్ చేసే సరికి అధిక శక్తి ఉత్పన్నమై మనిషిని తేలిగ్గా ఎగరగల్గేలా చేస్తుంది. విమానంలాగా, పక్షిలాగా ఆ హాల్లో చుట్టూరా ఆ ఎగిరే మనుషులు తిరుగుతుంటారు. ఈ ప్రయోగం ఎగురుతున్నవారికి వింత అనుభూతీ, థ్రిల్లుగా తోచి నూతనోత్సాహాన్నిస్తుంది.

మార్విన్‌క్రేటర్ తయారుచేసిన ఓ వ్యవసాయ పనిముట్టును చూశాక దాని ఆధారంగా తను కూడా ఏదైనా తయారుచేయాలనే ఆలోచన గిబ్‌కి కలిగింది. దాని ఫలితమే ఎయిర్ మెషీన్ సాయంతో పక్షిలా ఎగరగల ఈ క్రీడని కనుగొన గలిగాడు. ఈ ఆట పెద్దలకే పరిమితం కాదు. చిన్న పిల్లలు కూడా ఎంతో ఉత్సాహంగా ముందుకొస్తుంటారు. ఎగిరేందుకు భయపడేవారికి ఈ క్లబ్బు భయం పోగొట్టేలా శిక్షణ ఇచ్చి ప్రోత్సహిస్తుంది. ఇలా ఎగురుతున్నందున మానసిక శాంతి, స్థిరత్వం కూడా కలుగుతోందని క్రీడాకారులు తమ అనుభవాన్ని వివరించారు.

ఏదిఏమైనా అన్ని వయసుల అమెరికన్లని విశేషంగా ఆకర్షించి ఈ క్రీడ పట్ల ఆసక్తిని పెంపొందించారీ క్లబ్బువారు. మనదేశానికి కూడా ఈ క్రీడ నేడో, రేపో రాక తప్పదు.

## ద్రాక్ష పళ్ళు

'అందని ద్రాక్షపళ్ళు పుల్లన' అని మనకోసామెత ఉంది. ఆ మాటెలాఉన్నా మండుటెండల్లో ప్రయాణించేటపుడు మంచినీళ్ళు లభ్యంకాకుంటే, దొరికిన ద్రాక్షపళ్ళైనా తిని గొంతు తడుపుకుని, కడుపునింపుకుంటూ ఉంటాం.

మనదేశంలో క్రీ.పూ. 200సం. నుండే ద్రాక్షపళ్ళు పండుతున్నాయి. ద్రాక్షపళ్ళు జన్మస్థలం కాస్పియన్ సముద్రమని కొందరంటారు. ప్రాచీనకాలంలో స్విట్జర్లాండ్ నదీతీరాల్లో ద్రాక్షవిత్తనాలు తొలిసారిగా లభ్యమయ్యాయని మరి కొందరి అభిప్రాయం.

క్రీ.పూ. 1000వ సంవత్సరంలోనే ద్రాక్షను మద్యం తయారీకి ఉపయోగించేవారని గ్రీకు కవి హోమర్ కవిత్వంవల్ల తెలుస్తోంది. బైబిల్‌లో కూడా ద్రాక్షపళ్ళప్రస్తావన చాలా సందర్భాల్లో వస్తుంది. కాస్పియర్లో మొదటిసారిగా ఫలించిన ఈ ద్రాక్షపళ్ళు ఆసియామైనరు, గ్రీస్, సిసిలీ, యూరప్‌దేశాలకు విస్తరించాయి. ద్రాక్షలో 3వేల రకాల జాతులున్నాయి. నీలం, ఆకుపచ్చ, నలుపురంగుల్లో వుంటాయి. ఏజాతిపండ్లయినా ద్రాక్షపళ్ళపై చర్మం రెండురకాలుగా వుంటుంది. పలుచగా వుండి లోపలిగుజ్జుతో తేలికగా విడివడి వూడి రాగలవి. రెండవరకం దళసరిగా వుండి గుజ్జుకి అంటుకునివుండేది. చాలావరకు ద్రాక్షపళ్ళు తీపిగానేఉన్నా పులుపుగాకూడా వుంటాయి. ద్రాక్షపళ్లలో ఆర్గానిక్ ఆమ్లాలు, అమనో ఆమ్లాలు, మైక్రో కాంపోనెంట్లు, ఖనిజ లవణాలు, నీరు, ప్రొటీన్లు, క్రొవ్వుపదార్థాలు ఉంటాయి.

ప్రస్తుతం ప్రపంచవ్యాప్తంగా ద్రాక్షపళ్ళను ఆహారంగానేగాక మద్యంరూపంలో కూడా విరివిగానే వాడుతున్నారు. విటమిన్లతోపాటు ఆరో




గ్యాన్ని మెరుగుపరిచే ఎన్నో ఔషధ లక్షణాలు కూడా ద్రాక్షలో వున్నాయి. ఇవి శరీరాన్ని వేడి నుండి తప్పించి చల్లబర్చటమేగాక రక్తంలో హిమోగ్లోబిన్ ప్రమాణాల్ని పెంచుతాయి. హిమోగ్లోబిన్ శరీరంలో తక్కువగా వున్నవారు ద్రాక్షపళ్ళు తినటం చాలామంచిది. రక్తాన్నిఅభివృద్ధిపరిచి జీర్ణశక్తిని పెంచేగుణం కూడా వీటికుంది. ద్రాక్షపళ్ళు ఎండినవైనా, పండినవైనా మంచి ఫలితాల్నే ఇస్తాయి. మానసికరోగులకు కూడా ద్రాక్ష చికిత్సకారిగా పనిచేస్తుందని తాజా పరిశోధనలు చెబుతున్నాయి. ఉబ్బసంతో బాధపడుతున్న రోగులకు ద్రాక్షపళ్ళు ఎంతో లాభకరం. ద్రాక్షతోటల్లో ఆస్మారోగులు కొంత సమయం గడిపితే ఉపశాంతి చేకూరుతుందని డాక్టర్లు చెబుతున్నారు. ★

# చతుర కథలు

## "అలవాటు"

పెళ్ళిచూపులయి, విష్ణుకు తాను నచ్చిన సంగతి తెలిసిన దగ్గర నుండి శిరీష ఆనందానికి పట్టపగ్గాలు లేవు. ఆ క్షణం నుంచీ తనకొక ప్రత్యేకత వచ్చేసినట్లుగా ప్రవర్తించసాగిందామె. అందుకు కారణం విష్ణు మంచి ఉద్యోగస్థుడు మాత్రమేకాక రచయిత కూడా అయివుండటమే.

రచయిత భార్య కాబోతున్న తనను అభినందిస్తోన్న స్నేహితురాళ్ళ వంక గర్వంగా చూసింది శిరీష. తన స్నేహితురాళ్ళందరిలోనూ తానే అందగత్తెనన్న అహంకారానికి ఇప్పుడు రచయిత భార్య కాబోతున్నానన్న గర్వం తోడైంది.

"విష్ణు సినిమా హీరోలా అందంగా వుంటాడు. ఈడూ జోడయిన జంట" అంది రమ.

"విష్ణు కథలు బాగారాస్తాడు. ఇరవై ముప్ఫై కథల వరకు పడ్డాయి పత్రికల్లో" అంది- దొరికిన ప్రతీ పుస్తకాన్నీ చదివే వాణి- విష్ణుప్రసాద్ గురించి తనకూ తెలుసునన్నట్లుగా.

స్నేహితులంతా తనకు కాబోయే భర్త అందచందాలను, అతని రచనలను, తన అదృష్టాన్నీ పొగుడుతుంటే పొంగిపోయింది శిరీష. ఆమె మనసు చంద్రమండలాన్ని దాటి విహరించసాగింది. ఆ ఆనందంలో విష్ణు పెద్ద రచయిత కాదనీ, వర్ధమాన రచయిత అనీ పొరపాటున అన్న పాపానికి 'గయ్'మంటూ ఒంటికాలిమీద లేచింది శిరీష. స్నేహితురాళ్ళు ఆమె నోటికి జడిసి మరిమాట్లాడలేదు!

పెళ్ళయింది వైభవంగా. పెళ్ళిలో తన స్నేహితులు, బంధువులు, పెళ్ళికి వచ్చినవాళ్ళు- అందరూ తన భర్తను ప్రత్యేకంగా పదేపదే చూడటం గమనించి మరింత గర్వపడింది శిరీష.

పెళ్ళయిన తర్వాత భర్త ఉద్యోగరీత్యా కొన్ని నెలలవరకు పుట్టింటికి రావడానికి వీలు పడలేదు శిరీషకు. ఈమధ్యకాలంలో విష్ణు కథలు పత్రికల్లో చాలానే వచ్చాయి. ఆ అదృష్టమంతా తనదేనంటుంది శిరీష-- ఎవరైనా తన భర్త రచనలను గురించి మాట్లాడబోతే.

శిరీష అత్తవారింటి నుండి వచ్చిందని తెలిసి చూడటానికి వచ్చిన ఆమె స్నేహితురాళ్ళు ఆమె కాపురం గురించి, ఆమె భర్త రచనల గురించి అడగసాగారు.

"మీ ఆయన ఏ టైమ్‌లో కథలు రాస్తారే శిరీషా?" కుతూహలంతో అడిగింది ఒక స్నేహితురాలు.

"మీ ఆయన రాసిన కథలు నీవు ఫెయిర్ చేస్తావుటే శిరీషా?" మరో స్నేహితురాలి ఆచూకీ.

"అసలు నేను పక్కన లేకపోతే మా ఆయన కథలు రాయలేరు తెలుసా?" కథలు తానే రాస్తున్నానన్నంత గర్వంగా చెప్పింది శిరీష.

"అహా... అలాగా" అంటూ ఆశ్చర్యంగా చూసారామె స్నేహితురాళ్ళు.

వాళ్ళు అలా ఆశ్చర్యంతో నోళ్ళు తెరవటం చూసి, రెట్టించిన ఉత్సాహంతో చెప్పింది తాను-- ఆయన ఎదురుగానో, కౌగిలిలోనో ఉండి శృంగార చేష్టలతో కవ్విస్తేనేకాని ఆయనకు 'మూడ్ రాదనీ, కథలు రాయలేరనీ' చెప్పింది శిరీష సగర్వంగా.

స్నేహితురాళ్ళు మరింత ఆశ్చర్యపోయారు.

"అవునే శిరీషా... నీవు కౌగిలిలో లేకపోతే మీ ఆయన కథలు రాయలేరంటున్నావు కదా. మరి మీ ఆయన నీ పెళ్ళికి ముందునుంచీ



కథలు రాస్తున్నారు కదుటే. మరి, అప్పుడు...'' అంటూ అర్థోక్తిగా ఆపేసింది వాణి.

శిరీషకు తల గిర్రున తిరిగింది. నోట మాట రాక, కళ్ళప్పగించి చూస్తుండి పోయింది– స్నేహితురాళ్ళవైపు!!

**–తమ్మినీడి సత్యప్రసాదరావు**

## ఫోటో

**పో**లీసుస్టేషన్‌లోకి అడుగుపెట్టిన ఇనస్పెక్టర్ శశికాంత్‌ని చూడగానే హెడ్‌కానిస్టేబుల్ వీరాస్వామి, కానిస్టేబుల్‌దుర్గరాజు పెద్దపెట్టున ఏడవసాగారు. అది చూసిన ఇనస్పెక్టరుకి కంగారు పట్టుకుంది.

''ఏమైంది? కొంపదీసి మళ్ళీ ఏదన్నా లాకప్‌హత్యగానీ చేశారా?''

''లేదుసార్'' బావురుమన్నారిద్దరూ.

''ఏడవకండి! పోలీసుస్టేషన్ నుండి ఏడ్పులు వినిపిస్తే జనం అపార్థంచేసుకుంటారు. పోనీ ఎవరినైనా మానభంగంచేశారా? అదిగానీ ఆత్మహత్య చేసుకుందా?'' ఆరాతీశాడు ఇనస్పెక్టర్.

''అలాంటి పనులేవన్నా చేసినా ఈ బాధ ఉండేదికాదుసార్!'' మళ్ళీ భోరుమన్నారిద్దరూ.

''లాకప్పులో ఉన్న జేబుదొంగ అబ్బులుగాడు చిటికెనవేలు చూపించాడ్సార్! సరేనని బయటికి తీసుకొచ్చాన్సార్! ఆ వెధవ ఒకేఒక్క దెబ్బతో నన్ను స్పృహతప్పించాడ్సార్! నాతుపాకీ లాక్కుని బెదిరించి అందరి జేబుల్లోని డబ్బూ, స్టేషన్‌లోని సామాన్లూ గోనెసంచెలో మూటకట్టుకుని పారిపోయాడ్సార్!'' ఏకరువు పెట్టాడు హెడ్‌కానిస్టేబుల్.

వింటున్న ఇనస్పెక్టర్ వెంటనే స్టేషన్ నలుమూలలూ నిశితంగా పరికించాడు. పేపర్‌వెయిట్‌తోసహా అన్నివస్తువులూ మాయమయ్యాయి.

ఆ బోర్డుమీద- ''నేరస్థుల ఫొటోలు అతికించాలికదా! అవిఏవి?'' అన్నాడు ఆఖరికి.

'తోటి నేరస్థుల క్షేమంకోరుతూ పట్టుకెళ్ళు



న్నానంటూ అవీ దోచుకుపోయాడుసార్'' ఉత్సాహంగా చెప్పేడు కానిస్టేబుల్. ఇంతలో మిగతాసిబ్బంది రొప్పుతూ స్టేషన్‌లోకి వచ్చారు అబ్బులు దొరకలేదంటూ.

''మరి రేపు డి.యస్.పి.గారొస్తారు గదా ఇన్‌స్పెక్షన్‌కు. స్టేషన్‌లోని సామాన్లసంగతేంచేద్దాం? పోనీ, మీరంత చందాలు వేసుకుని అవి కొనుక్కురండి. అబ్బులుగాడిమీద ఇంకా కేసు రాయలేదుగాబట్టి వాడు దొరక్కపోయినా ఫర్వాలేదు. తర్వాత చూసుకుందాం వాడిగొడవ. ఏదైనా ఫొటోస్టూడియోకి వెళ్ళి అర్జంటుగా దొరికినవేవో ఎవరివైనాసరే ఓ డజను ఫొటోలు పట్రండి. ఆ వెధవ తుపాకులు కూడా పట్టుకెళ్ళకపోవటం మన అదృష్టం'' అన్నాడు ఇన్‌స్పెక్టర్.

నలుగురూ తలోదిక్కుకూ పరుగులుతీశారు హడావిడిగా.



మర్నాడు డి.యస్.పి.కి స్టేషన్‌లో ఘనస్వాగతం లభించింది. ఆయన స్టేషన్నీ లాకప్‌గదుల్నీ యథావిధిగా పర్యవేక్షించాడు. క్రిందా, పైనా కలయచూశాడు. అనక నెమ్మదిగా కుర్చీలో ఆశీనుడుకాబోతూ నేరస్థుల ఫొటోలబోర్డుకేసి చిద్విలాసంగా దృష్టిసారించాడు. ఆఫొటోల్ని చూస్తూ ఓ చోట టక్కున ఆగిపోయాడు. దగ్గరగావెళ్ళిమరీచూశాడు.

ఆయన మొహంలోని రంగులు అర్జంటుగా మారిపోయాయి. సదరు ముఖారవిందంలో కళలు తప్పుటకు కారణం ఏమిటోనని ఇనస్పెక్టరూ చూశాడు ఫొటోల్ని అనుమానంగా.

అంతే!

ఈసారి ఇనస్పెక్టర్‌గారి ఫేసులోని కలర్లు మారటం మొదలైంది.

ఆ ఫొటో ఎవరిదోకాదు. సాక్షాత్తూ సివిల్ డ్రెస్‌లోఉన్న ఆ డి.ఎస్.పి.గారిదే

—కాశీభట్ల భానుమూర్తి

# చతుర

సంపుటి: 11 నవంబర్ 1988 సంచిక 10



# కక్ష

ముద్దంశెట్టి హనుమంతరావు

"ఇది ఆవేశంకాదు... నాలో రగులుతున్న జ్వాల. మా శ్రేయోభిలాషినంటున్న మీ
ఆయన్నిలా వ్యసనాలకి బానిసచేసి, మా సంసారజీవితంలో అశాంతి రేకెత్తించి, ఒక
చిచ్చు పెట్టారు. నా మానసిక వ్యథకు కారకులై, నాపై కక్ష తీర్చుకుంటున్నట్టు సంతృ
సంతోషించటం మీ రాక్షసప్రవృత్తిని వెల్లడి చేస్తోంది. "చెడపకురా చెడేవు" అని ఒ
లోకోక్తి ఉంది. ఈ దుశ్చర్యకు ఫలితం ఎప్పుడో ఒకరోజు తప్పక అనుభవిస్తారు"...

ఉద్రిక్తురాలైన ఆమె కళ్ళు 'చింతనిప్పుల్లా' మండుతున్నాయి.

ఆమెనిలా వ్యథల పాలుచేసిన అతని కక్షకి గల కారణం ఏమిటి? అతనెవరు? ఆమెకీ అతనికీ ఉన్న బాంధవ్యం ఎలాంటిది? అతన్నామె ఎదుర్కోగలిగిందా? చదవండి!

ఈ నెల 'చతుర' సమర్పిస్తున్న సమగ్ర నవల. ముద్దంశెట్టి హనుమంతరావు రచన 'కక్ష'

టౌనుహాలు ఆవరణంతా రంగురంగు విద్యుద్దీపాలతో శోభాయమానంగా మెరిసిపోతోంది. మృదుమధురమైన పాటలు లవుడ్‌స్పీకర్లలోంచి వీనుల విందుగా వినిపిస్తున్నాయ్. పున్నమినాటి చంద్రుడు నిండుగా నవ్వుతూ ఆకాశమార్గంలో ప్రయాణానికి సన్నద్ధమయ్యాడు. తెల్లని వెన్నెల విద్యుద్దీపాల కాంతిలో మిళితమైపోయింది. చల్లని గాలులు, శరీరానికి మరింత హాయిని కలిగిస్తున్నాయ్.

రామరాజు, దీప్తిల వివాహసందర్భంలో విందు సాగుతోందారోజు. అందుకే ఆ అలంకరణ...ఆ హడావిడీను!

హాలు ముందుభాగంలో వున్న వరండాలో నూత్న వధూవరులు ఆకర్షణీయంగా ముస్తాబై సోఫాలో ఆసీనులైవున్నారు. వాళ్ళముందు ఒక చిన్న టేబులుపైన మల్లెపూవుని మరిపించేంత తెల్లని గుడ్డవేశారు. దానిమీద ఓ వెండి పళ్ళెంలో అక్షింతలు, మరో చిన్న పళ్ళెంలో వక్కపొడి వున్నాయి. మొగరాఅగరవత్తులు మల్లెల సువాసనల్ని వెదజల్లుతున్నాయ్.

రామరాజు ఏదోచెబుతూవుంటే సిగ్గుదొంతరలు ముంచుకురాగా, మొహం దించేసుకొని, చిరునవ్వులు ఒలకబోస్తోంది దీప్తి. భార్య చిరునవ్వులసోయగాన్ని ఆస్వాదిస్తూ ముగ్ధుడైపోతున్నాడు రామరాజు.

ఆ జంటను చూస్తూవుంటే ముచ్చటేస్తోంది. రతీమన్మథుల్ని గుర్తుకుతెచ్చేలా వున్న వారిని చూసి అసూయపడనివారు వుండరేమోననిపిస్తోంది.

ఆశీర్వదించడానికి ఎవరొచ్చినా, వాళ్ళిద్దరూ లేచినుంచొని వినమ్రతతో అభివాదం చేస్తున్నారు. స్నేహితుల్ని, బంధువుల్నీ దీప్తికి పరిచయంచేస్తున్నాడు రామరాజు. అందరూ రామరాజుని అభినందించినవాళ్ళే. ఔను మరి... అందమైన అర్ధాంగి లభించడం అదృష్టంకాదూ?

భైరవమూర్తి, అతనిభార్య ప్రేమ చాలా ఆలస్యంగా వచ్చారు. అప్పటికే చాలామంది స్నేహితులు వచ్చి ఆశీర్వదించి వెళ్ళిపోయారు.

"ఏవిటిమూర్తీ... ఇప్పుడా రావడం?" సన్నగా నవ్వుతూ అన్నాడు రామరాజు.

"మరేమీ అనుకోకురా రాజూ! కాస్త అర్జంటుపనుండి త్వరగా రాలేకపోయాను" క్షమాపణ చెప్పుకున్నాడు భైరవమూర్తి.

ప్రేమ చిరునవ్వుతోనే దీప్తిని పలకరించి, తాము తెచ్చిన కానుకను ఆమెకి అందించింది. దీప్తి ఆ కానుకను వెనుకవేవున్న టేబులుమీద పెట్టేసింది.

భైరవమూర్తి, ప్రేమ అక్షింతలు తీసుకుని, నూతన వధూవరుల్ని ఆశీర్వదించారు. భైరవమూర్తి రామరాజుతో చేయికలిపి అభినందించాడు.

అప్పుడు చూసింది దీప్తి భైరవమూర్తిని దగ్గర్లో. అంతే! మరుక్షణం ఆమె అంతరంగంలో అలజడి ప్రారంభమయింది. ఆమె మొహంలో అప్రయత్నంగా రంగులు మారాయ్. ఈరోజు అతను అగుపించకుండా వుండివుంటేనే బావుండేదేమోననిపించిందామెకు. ఆమె మనసులో ఏవేవో భావాలు చెలరేగుతూ, చిన్న తుఫానుని సృష్టించాయి. మొహంక్రమంగా ఎర్రబారింది. అదేతరుణంలో రామరాజు మిత్రుణ్ణి ప్రత్యేకంగా పరిచయం చేశాడు. "నాకు వున్న కొద్దిమంది సన్నిహిత మిత్రుల్లో ముఖ్యుడు దీప్తీ... పేరు భైరవమూర్తి. పేరులో ఆధునికత లోపించినా, మనిషిమాత్రం అధునాతనంగానే వుంటాడు. స్నేహమంటే చెవికోసుకుంటాడు. నాటకరంగంలో కూడాప్రవేశంవుంది.నవ్వుతూ వుంటాడు...నవ్విస్తాడు. వీడు ఎక్కడ వున్నా కాలక్షేపానికి లోటుండదు. ఇతని అత్తవారిదీ మీవూరే! నిజానికి నీగురించి నాకు తెలిసింది ఈ దంపతుల ద్వారానే. నిన్ను నాకు అర్ధాంగిగా చూసిపెట్టినందుకు వీళ్ళిద్దర్నీ ఎన్నడూ మర్చిపోలేను. ఇదిగో, ఈమె శ్రీమతి మూర్తి... పేరు ప్రేమ" అంటూ వాళ్ళిద్దర్నీ పరిచయం చేశాడు రామరాజు.

"మా ఇరువురికీ పరిచయం అవసరంలేదులెండి రామరాజుగారూ!" అంది ప్రేమ చిరునవ్వుతో.

"అదీ నిజమేఅనుకోండి. ఒకేవూరివాళ్ళు కదా! అయినా, అంత పెద్దపట్నంలో అందరికీ పరిచయాలు వుండకపోవచ్చు. పరిచయం అనే ఆనవాయితీ అంటూ ఒకటుందికదండీ మరి" నవ్వేశాడు రామరాజు.

భైరవమూర్తి నిండుగా నవ్వుతూ కలిగించు కున్నాడు.

"ఒక వూరివాళ్ళు. పైగా పరిచితులు. ఇహనేం - మీ స్నేహబంధం మరీ బిగుసుకుపో తుంది. నిజంచెప్పాలంటే దీప్తిగారూ..., మీ వివాహం మారాజుతో జరగడానికి మా ఆవిడ ప్రయత్నమే కారణమండీ! స్వస్థలపు అభి మానం ఎట్లాగూ వుంటుందికదండీ!" దీప్తి వేపు చిరునవ్వుతో చూస్తూ అన్నాడు భైరవమూ ర్తి.

దీప్తి సమాధానం చెప్పలేదు. అతనికేసి చూడలేదుకూడాను. భైరవమూర్తితో ప్రసంగా న్ని పెంచుకోవడమే ఆమెకి మనస్కరించని విషయం. అతను తన కళ్ళెదుటనుంచి ఎప్పు డు తప్పుకుంటాడా అని, ఎదురుచూ స్తోందామె. ఆమె హృదయం రగిలిపోతోంది ఆగ్రహంతో.

దీప్తి మౌనముద్రను గ్రహించాడు, భైరవ మూర్తి. ఆమె మనసులో తనపై ఏహ్యాభావం వుండేవుంటుందనుకున్నాడు. ఇంకా అక్కడ వుండదల్చుకోలేదు. "ఒరేయ్‌రాజూ... డిన్నరు తీసుకుని వస్తాలేరా! పద ప్రేమా..." అంటూ హాల్లోకి నడిచాడు భైరవమూర్తి.

ప్రేమ దీప్తితో చెప్పి భర్తవెంట నడిచింది.

"భైరవమూర్తి నాకెంతో సన్నిహితుడని చె ప్పినా నువ్వలా ముభావంగా, పల్లెటూరిపిల్లలా మరీ బిడియపడుతూ ప్రవర్తించటం ఏమీ బాగుండలేదు దీప్తీ! వాడు ఏమనుకుంటాడు చెప్పు? నువ్వు చదువుకున్నదానివి. ఆ మాత్రం తెలీదూ?" దీప్తి మొహంలోకి చూస్తూ, అన్నా డు రామరాజు.

దీప్తి క్షణంపాటు నిరుత్తరయ్యింది. అట్లాంటిప్రశ్న భర్తనుంచి వస్తుందని ఆమె వూహించలేదు. ఆ ప్రశ్నకు ఏం సమాధానం చెప్పగలదు? ఎందుకు తనలా ముభావంగా వున్నదీ, వివరించి నిజాన్ని చెబుతుందా? చె బితే, పరిణామాలెలావుంటాయో? సందిగ్ధంలో పడింది...ఏమైతేనేం...ఆ పరిస్థితిలో అబద్ధం చెప్పకతప్పదనుకుంది.

"క్షమించండి... ఏమిటో కాస్త నలతగా వుండేనూ, హుషారుగా వుండలేకపోయాను" అంది మెల్లగా.

"నలతగావుందా... ఏమయిందేమిటి?" ఆతృతగా అడిగాడు రామరాజు.

"తలనొప్పిగా వుందండీ"

"అనాసిన్ టాబ్లెట్ తెప్పిస్తానుండు"

"అబ్బే... వద్దండీ! అదే సర్దుకుపోతుంది లెండి. రోజంతా రెస్ట్‌లెస్‌గా వున్నానుకదా- అందుకేనేమో ఈ తలనొప్పి..." అనేసింది ముసి ముసిగానవ్వుతూ.

రామరాజు చిన్నగా నిట్టూర్చాడు. "అ య్యిండొచ్చుదీప్తీ! కాని ఒక్క విషయం ఆలో చించు. నువ్విలా ముభావంగా వుంటే, మన ల్ని ఆశీర్వదించడానికి వచ్చినవాళ్ళు, ఏవేవే విటో వూహించుకునే అవకాశం వుంటుంది. మనవాళ్ళసంగతి నీకు తెలీందేమున్నదని?"

దీప్తి మనస్సు చివుక్కుమంది భర్తచేత ఇలా అనిపించుకోవడం. అదీ వివాహమైన ప్రా రంభదశలోనే అటువంటి అవకాశాన్ని తాను కలిగించినందుకు ఎంతో చింతించింది. ఆమె హృదయం క్షోభించింది. పొరపాటు తనదేనని తెలుసుకుంది.

"సారీఅండీ... అటువంటి అవకాశాన్ని మరి వ్వనులెండి..." వుత్సాహంగా నవ్వుతూనే అంది.

తృప్తిగా ఓ చిరునవ్వు నవ్వేడు రామరాజు. "గుడ్ ... ఆ స్పిరిట్ వుండాలి దీప్తీ" అన్నా డు.

ఎవరెవరో వస్తూనే వున్నారు. వాళ్లని దీప్తికి పరిచయం చేస్తున్నాడు రామరాజు దీప్తి హామి ఇచ్చినట్టుగానే, ఆమె ముభావంగా ఎప్పుడూ అగుపించలేదు. హుషారుగా నవ్వుతూనే వుంది. అందుకు ఆమెని మనసులోనే అభి నందించుకున్నాడు రామరాజు.

డిన్నరు పూర్తయ్యేసరికి దాదాపు పది గంటల వేళయింది. రామరాజు, దీప్తి ఇంటికి వచ్చేశారు. వస్తూనే సోఫాలో చేరబడిపోయింది దీప్తి.

"ఒంట్లో నలతగా వుందన్నావు, కాసేపు విశ్రాంతి తీసుకో దీప్తీ. నేను స్నానంచేసి ఇప్పు డే వచ్చేస్తాను" అంటూ టవలు తీసుకుని, దుస్తులు మార్చుకుని బాత్‌రూమ్‌కేసి నడిచా డు రామరాజు.

దీప్తికి ఎంతో బడలికగా వున్నట్టని

పించింది. నిజానికి వెంటనే నిద్రపోవాలనుందామెకి. కాని సభ్యతగా వుండదేమోననిపించింది. కళ్లు మూసుకుని, అలా విశ్రాంతి తీసుకుంటోంది. అయితేనేం- ఆమె మనోనేత్రానికి భైరవమూర్తే కనిపిస్తున్నాడు. ఆరునెలల క్రితం, శమంత ఇంట్లో జరిగిన ఆ సంఘటన, భైరవమూర్తిపట్ల జుగుప్స ఏర్పడిన ఆ సంఘటన ఆమె కళ్లముందు లీలగా మెదిలింది.

★ ★ ★

దీప్తి ఇంటికి నాలుగు ఫర్లాంగుల దూరంలో ఆమె స్నేహితురాలు శమంత ఇల్లుంది. వాళ్లిద్దరూ కేవలం స్నేహితులేకాదు- దూరపు బంధువులు కూడాను. అందుకే వాళ్లిద్దరిమధ్య సాన్నిహిత్యం మరింత బలపడింది.

శమంత వివాహం నిశ్చయమయ్యింది. ఆ వివాహానికి ఓరోజు ముందుగానే దీప్తి శమంత ఇంటికి వెళ్లింది. అక్కడ తారసపడ్డాడు భైరవమూర్తి. అతనెవరో దీప్తికి తెలీదు. శమంతతో మాట్లాడుతూ వుంటే అక్కడికి వచ్చాడు భైరవమూర్తి.

"ప్రేమ రాలేదా మూర్తిగారూ?" ప్రశ్నించింది శమంత.

ప్రేమ భైరవమూర్తి భార్య. ఆమె శమంతకి దగ్గరి బంధువు.

"నీ వివాహానికి ప్రేమ రాకుండా వుంటుందా శమంతా? రాకపోతే నువ్వూరుకుంటావూ? వచ్చింది... కాస్సేపటిలో ఇక్కడికి వచ్చి వాలుతుంది. అడ్వాన్సుగా నన్ను పంపించింది" నవ్వుకుంటూ అన్నాడు భైరవమూర్తి.

శమంతతో మాట్లాడుతూ వున్న భైరవమూర్తి దృష్టి తనమీదే వుండటం దీప్తి గమనించకపోలేదు. అందుకనే మొహం దించేసుకుని 'మగాళ్లకి ఎందుకో ఈ పాడుబుద్ధి...' అనుకుంది లోలోన.

"ప్రేమ వచ్చిందన్నారు... బావుంది. కానీ అడ్వాన్సుగా మిమ్మల్ని పంపడమేమిటండీ; అదే స్వయంగా వచ్చేయొచ్చుకదా" చిలిపిగా నవ్వుతూ అంది శమంత.

"వచ్చేస్తుందండీ మరికొద్దిక్షణాల్లో. నిజానికి నేను రాననుకున్నానండీ మీ వివాహానికి. కాని ప్రేమ ఒప్పుకుంటేగా? నన్నూ ప్రయాణం కట్టించింది" జేబులోంచి రుమాలుతీసి మొహం ఒత్తుకుంటూ అన్నాడు భైరవమూర్తి. రుమాలుకి ఒత్తాడేమో ఇంటిమేట్ సెంటువాసన గుప్పుమంది.

"మీమీద నమ్మకంలేక వెంటతీసుకొచ్చిందేమోనండీ?" చిలిపిగా నవ్వుతూ అంది శమంత.

భైరవమూర్తి గతుక్కుమన్నాడు. ఆ సమయంలో అదీ ఒక పరాయిఅమ్మాయి సమక్షంలో శమంత అట్లా వ్యాఖ్యానించడం ఏమీ బాగులేదనిపించిందతనికి. కాస్తంత అహం దెబ్బతింది. ఆ అమ్మాయి ముందు మరీ చులకనయిపోయినట్టనిపించింది. "అబ్బే... అటువంటి అపనమ్మకం ప్రేమకి నామీద ఏనాడూ లేదు శమంతా! నువ్వు అపోహపడుతున్నావేమో. బిలీవ్‌మీ... నేను లేకపోతే ప్రేమ ఒంటరితనం ఫీలవుతుంది- అంతే!" సన్నగా నవ్వుతూ అన్నాడు భైరవమూర్తి.

"అలాగా!" ముసిముసిగా నవ్వుకుంది శమంత. ఆ విషయంలో ఇంకా పొడిగించడం ఇష్టంలేకపోయింది.

"ఔనుగాని... ఈ అమ్మాయి ఎవరు? నేనెప్పుడూ చూళ్లేదే" దీప్తికేసి కళ్లతో చూపిస్తూ ప్రశ్నించాడు.

"దీప్తి అని నా స్నేహితురాల్లెండి. దూరపు బంధువు కూడాను. ప్రేమకి తెలుసు"

"నమస్కారమండీ" రెండు చేతులు జోడిస్తూ అన్నాడు భైరవమూర్తి.

"నమస్కారం..." ముక్తసరిగా తప్పనిసరి పరిస్థితిలో అంది దీప్తి.

అప్పుడామె మొహాన్ని స్పష్టంగా చూశాడు భైరవమూర్తి. ఆమె సౌందర్యం అతణ్ని బాగా ఆకట్టుకుంది. ఆమె కళ్లలో వింత తేజస్సూ, చంద్రవంకలాంటి పెదాలపై చిరుదరహాసం అతణ్ని సమ్మోహితుణ్ని చేసినయ్. 'ఓహ్... ఏమి ఆ అందం...?' అనుకున్నాడు మనస్సులో.

"నా పేరు భైరవమూర్తండీ దీప్తిగారూ! మా శమంత మిమ్మల్ని నాకు పరిచయం చేసింది గాని, నన్ను మీకు పరిచయం చెయ్యడం మర్చిపోయినట్టుంది. నిజం చెప్పాలంటే పరిచయంచెయ్యడం అన్నది కూడా ఓ కళండీ!

సరే... ఇప్పుడు దానిగురించి చెప్పాలంటే పెద్ద ఉపన్యాసమవుతుందిలెండి. ఇంతకీ చెప్పొచ్చే దేవిటంటే- నేను ఈ వూరి అల్లుణ్నేనండీ...'' ఉత్సాహంగా చెప్పుకుపోతుంటే చప్పున అందుకుంది శమంత.

''ప్రేమ తెలుసుకదే దీప్తీ... విశాఖలో వుంటుందని చెప్పాను'' దీప్తినుద్దేశించి అంది శమంత.

''బాగా తెలుసునే! అప్పుడెప్పుడో మీ ఇంట్లోనే పరిచయమయిందికదా. ఆమె ఇక్కడికి వచ్చినప్పుడంతా మాట్లాడుకుంటూ వుండేవాళ్లం''

''ఆ ప్రేమ భర్తే ఈయన. ఆమెపరంగా ఈయన మనకి బంధువే'' అంది శమంత.

భైరవమూర్తి మౌనంగా వుండలేకపోయాడు.

''అవునండీ! మీకు బంధువునే'' అన్నాడు పళ్ళికిలిస్తూ.

దీప్తి ఏం మాట్లాడకుండా మౌనం దాల్చింది.

''అదేమిటండీ దీప్తిగారూ అలా మౌనం దాల్చారు. చదువుకున్నవారు... సంస్కార వంతులు... ఈతరంవాళ్లు ఎంత హుషారుగా వుండాలి?'' అన్నాడు భైరవమూర్తి.

''అంటే మీ వుద్దేశం ఏమిటండీ? ముక్కూ మొహం తెలీని మీతోపాటు పిచ్చాపాటీ మాట్లాడుతూవుండడమా ?'' సీరియస్‌గా మొహంపెట్టి అంది దీప్తి.

భైరవమూర్తి మళ్ళీ సన్నని మందహాసం చేశాడు.

''ఒకసారి పరిచయం అయ్యాక, ముక్కూ మొహం తెలీనివాళ్లం ఎలా అవుతామండీ? పరిచయాన్ని పెంచుకుంటేనేకదా, సన్నిహితులమవుతాం. సరదాగా కబుర్లు చెప్పుకోవచ్చు. నాటకాల గురించో, సాహిత్యం గురించో, స్పోర్ట్సు గురించో మాట్లాడుకోవడంలో ఎంత ఆనందముంటుందని? వీటిలో ఏ ఒక్కదానిపైనా ఆసక్తి లేకపోతే కనీసం సినిమా గురించయినా మాట్లాడుకోవచ్చుకదా?'' అన్నాడు.

దీప్తికి బోరుకొడుతోంది. శమంత కూడా ఇంచుమించు అదే అనుభూతికి లోనయింది.

అతణ్ని వదిలించుకోవడం ఎలా అని ఆలోచిస్తోంది.

''అవునండీ మూర్తిగారూ... నాటకాల గురించిగాని, సాహిత్యం గురించికాని, స్పోర్ట్సు గురించిగాని మాట్లాడుకుందామన్నారుకదా, వీటన్నింటిలో మీకు ప్రవేశముందా?'' ప్రశ్నించింది శమంత.

ఊహించని ఈ ప్రశ్నకు భైరవమూర్తి కాస్తంత తికమకపడ్డాడు. ఏదో ఉబుసుపోకకి వాళ్ళిద్దరితో కాస్సేపు కబుర్లుచెప్పుకుంటూ కూచోవచ్చుననుకుని అలా అన్నాడేగాని, వాస్తవానికి ఇతనికి ఒక్క నాటకాల గురించి తప్పించి మిగిలిన రెండు సబ్జెక్టులలో అంతగా ఏం తెలీదు. నాటకాల గురించి అయినా ఎక్కువగా తెలిసింది ఏమీలేదు.

''ఏమిటలా ఆలోచిస్తున్నారు?'' అంది దీప్తి.

తెలీదని చెప్పడానికి చిన్నతనమనిపించింది భైరవమూర్తికి

''అబ్బే... ఆలోచనేంలేదండీ'' అన్నాడు కృత్రిమమైన చిరునవ్వుతో.

''అయితే మా శమంత అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పండి మరి...''

''ఆఁ ఆఁ... అదే... పెద్దగా తెలీకపోయినా కాస్తంత ప్రవేశం వుందిలే శమంతా! అయితే డిస్కస్ చేసుకోడానికికాదుగా! సరదాగా మాట్లాడుకోడానికే'' అన్నాడు.

అతణ్ని వదిలించుకోవడానికి అవకాశం దొరికిందనుకున్నారు శమంత, దీప్తి. అతని పరిజ్ఞానమేమిటో తెలుసుకోవాలనుకున్నారు.

''అలాగా- అయితే దీప్తీ... నువ్వేమయినా అడగవే ''అంది శమంత.

''తప్పకుండా మరి- భైరవమూర్తిగారూ... తెలుగు కవులలో 'కవిసామ్రాట్' అనే బిరుదు ఎవరికుందండీ?'' ప్రశ్నించింది దీప్తి.

దీప్తి నవలలు చదవడంలో దిట్ట. అంతేకాదు- తెలుగు సాహిత్యమన్నా కాస్తంత అభిరుచి వుందామెకి.

తనకి యేమేమో తెలుసునని వట్టి డాంబికాలు పలికాడేగాని, నిజానికి భైరవమూర్తి చదివిన తెలుగు సాహిత్యం అతి తక్కువ. ప్రజాకవి, అభ్యుదయకవి, శ్రీశ్రీ గురించి మాత్రం విన్నాడు. అతనికే 'కవిసామ్రాట్' బిరుదు

వుండి వుంటుందన్న దృఢ నిశ్చయానికొచ్చాడు. "ఈ మాత్రం తెలీదటండీ? శ్రీశ్రీకి కవిసామ్రాట్ అనే బిరుదుంది" హుషారుగానే చెప్పాడు.

పక్కున నవ్వింది దీప్తి. శమంతకూడా నవ్వకుండా వుండలేకపోయింది.

"తప్పుచెప్పానంటారా?" చిన్నబుచ్చుకున్నాడు వాళ్ళు నవ్వినందుకు "తప్పుగాక మరేమిటండీ? 'కవిసామ్రాట్' అన్న బిరుదు కీ.శే. విశ్వనాథ సత్యనారాయణగారికే వుంది" చెప్పింది దీప్తి.

భైరవమూర్తికి విశ్వనాథసత్యన్నారాయణగారి గురించి అసలు తెలీదు. అతని నవలలూ చదవలేదు. కవితలూ చదవలేదు. 'నేరక తెచ్చుకున్నానీ తంటా' అని అప్పుడనుకున్నాడు. 'అభ్యుదయ కవిగా, ప్రజాకవిగా వినుతికెక్కిన శ్రీశ్రీగారే 'కవిసామ్రాట్' అయ్యుంటారనుకున్నానండి..." మొహం మాడ్చుకుంటూ అన్నాడు.

శమంత అందుకుంది- "సాహిత్యంలో మీకు పెద్ద ప్రవేశం లేదని, కనీసం సాహితీకారుల వివరాలే తెలీవని తేలిపోయిందండీ మూర్తిగారూ: ఇప్పుడు క్రీడారంగానికి వద్దాం... గవాస్కర్ ఎవరండీ?"

"ఏవిఁటి శమంతా, నన్ను చాలా తక్కువగా అంచనావేసినట్టున్నావు. గవాస్కర్ భారత క్రికెట్ ఆటగాడు. భారత క్రికెట్ జట్టుకి మాజీ కెప్టెన్" ఉత్సాహంగా చెప్పాడు.

"అతని పూర్తిపేరు చెప్పగలరా?"

మళ్ళీ ఇరుకున పడ్డాడు, భైరవమూర్తి. "పూర్తి పేరేమిటంటే..." నీళ్ళు నమిలేశాడు.

నిజానికి, గవాస్కరంటే, గవాస్కరేగాని అతని పూర్తిపేరు ఎప్పుడూ తెలుసుకోలేదు భైరవమూర్తి. "నాలుకమీదే వున్నట్టుందిగానీ, గుర్తుకొచ్చి చావటంలేదు..." అన్నాడు.

"తెలీదని చెప్పకూడదటండీ? తప్పేముంది?" అంది దీప్తి.

తలకొట్టేసినంత పనయ్యింది మూర్తికి. క్షుణ్ణంగా న్యూస్‌పేపరు చదవకపోవడం, తన తప్పేనని ఇప్పుడనిపించింది. లేకపోతే ఈ చిన్న విషయానికి ఇలా తెల్లమొహం వేయడమా?

"తెలీక కాదనుకోండి. మర్చిపోయాను..."

"సునీల్ మనోహర్ గవాస్కరండీ!" నవ్వుతూ చెప్పింది శమంత. "ఆఁ ...అఁ... అదే గుర్తుకు రాలేదండీ!"

"పోన్లెండి... మరొక్క ప్రశ్న. గవాస్కర్ నెలకొల్పిన రికార్డులేవిఁటి?" దీప్తి ప్రశ్న.

న్యూస్‌పేపరు చదవడంలో అశ్రద్ధచూపడం, మళ్ళీ దెబ్బకొట్టిందనుకున్నాడు. అతని ఫాలభాగంపై చిరుచెమట మెరుస్తోంది. మొహం పాలిపోయింది. కావాలని కష్టాన్ని తెచ్చుకున్న తన తెలివితక్కువతనానికి, తనని తానే నిందించుకున్నాడు భైరవమూర్తి, పాంటు జేబులోంచి రుమాలు తీసి, మొహాన్ని ఓసారి తుడుచుకున్నాడు.

"సారీ అండీ... ఇటువంటి ప్రత్యేక వివరాలు అడిగితే నేను చెప్పలేను. సరదాగా ఏవో కబుర్లుచెప్పుకుందామని అన్నానేగాని, ఇటువంటిగోష్ఠి జరుపుతారని నేను వూహించలేదు. స్పోర్ట్సులో కూడా మీకింత పరిజ్ఞానం వున్నందుకు మీ ఇద్దర్నీ అభినందిస్తున్నాను..." తను సరెండరైపోయినట్టుగా చెప్పాడు భైరవమూర్తి.

శమంత, దీప్తి పరస్పరం మొహాలు చూసుకొని, నవ్వుకున్నారు. భైరవమూర్తికి అదో అవమానంగా తోచింది. కాని ఏం చెయ్యగలడు? మానసికంగా తన ఓటమిని అంగీకరించేశాడు.

"గవాస్కర్ నెలకొల్పిన రికార్డులు నాకు తెలవలేదు. ఒప్పుకుంటున్నాను. పోనీ మీరు చెప్పండి, తెలుసుకుంటాను" దీప్తి మొహంలోకి చూస్తూ, చిరునవ్వుతో అడిగాడు.

నిజానికి భైరవమూర్తి అభిప్రాయం కూడా అదేగా, దీప్తితో కాస్సేపు మాట్లాడుతూ కూచోవాలని. అది నెరవేరుతోందిగనక తన ఓటమిని అంగీకరించినా ఫరవాలేదనుకున్నాడు.

"ప్రపంచంలో అందరి ఆటగాళ్లకంటే అత్యధిక పరుగులు చేసి క్రికెట్ చరిత్రలోనే రికార్డు నెలకొల్పాడు. అంతేకాదు, అందరికంటే 'టెస్టుల్లో' ఎక్కువ సెంచరీలు కొట్టి వుత్తమ రికార్డు నెలకొల్పాడు. ఆయన క్రికెట్ జీవితంలో ఇంకా ఎన్నో రికార్డులున్నాయి. అవి అప్రస్తుతమనుకోండి." అంది దీప్తి.

మొదట్లో వున్న బెరుకుతనం, దీప్తిలో అంత రించడం గమనించాడు భైరవమూర్తి. అది అతనికి ఆనందాన్ని కలిగించింది. క్రమంగా ఆమెతో పరిచయాన్ని విస్తృతపర్చుకుందుకు ఆమెలోని ఈ మార్పు ఉపకరిస్తుందనుకున్నాడు.

"మీకు చాలా వివరాలు తెలుసునండీ! ఇందుకు మిమ్మల్ని అభినందించాల్సిందే! మీరు క్రికెట్ ఆడతారా ఏవిఁటండీ?" ఆసక్తిగా ప్రశ్నించాడు భైరవమూర్తి.

దీప్తి నవ్వింది.

భైరవమూర్తి ఐస్ అయ్యాడు ఆ నవ్వుకి. అబ్బ ఏంనవ్వు? ఆ నవ్వులో ఆమె ఎంత అందంగా వుంది? ఇటువంటి అపురూప సుందరిని అర్థాంగిగా పొందబోయే భర్త ఎక్కడున్నాడోగాని, ఎంత అదృష్టవంతుడు! "క్రికెట్ వివరాలు తెలియాలంటే, క్రికెట్ ఆడనవసరం లేదండీ! ఆసక్తివుండాలేగాని, చదివితే తెలుస్తాయికదా?" అంది దీప్తి.

ఆమె, అంతరంగంలో తన తెలివితక్కువతన్నాని ఎగతాళి చేస్తూ నవ్వుతున్నట్టే అనిపిందతనికి.

భైరవమూర్తి అలా ప్రసంగాన్ని పొడిగిస్తున్నాడన్న అనుమానం కలిగింది శమంతకి. అతణ్ణి వదిలించుకోవాలని ప్రయత్నించి, అనవసరంగా అతనితో ప్రసంగిస్తున్నామనిపించి అతణ్ణి వదిలించుకోవాలనిపించిందామెకి

"మూర్తిగారూ... స్పోర్ట్సులోనూ మీకు తెలిసింది అంతగా లేదని వెల్లడయ్యిందండీ! పోనీ మీ సబ్జక్టు, నాటకాల విషయంలో మీ పరిజ్ఞానం చూద్దాం. నువ్వడుగుతావా? లేక నన్నే అడగమంటావే దీప్తీ?"

"నువ్వే అడగవే"

భైరవమూర్తి గుండెలు జోరుగా కొట్టుకోవడం మొదలుపెట్టాయి. శమంత ఏం ప్రశ్న వేస్తుందోనని కంగారుగా వుంది.

"మూర్తిగారూ... 'కన్యాశుల్కం' నాటకాన్ని రచించిందెవరండీ?" అంది శమంత.

భైరవమూర్తి తెల్లమొహం వేశాడు. ఇటీవలి కాలంలో నాటకసమాజాలు ప్రదర్శిస్తోన్న నాటిక, నాటకాల పేర్లే తెలుసునుగాని, వాటి రచయితలెవరో అంతగా తెలిసి చావదు తనికి అటువంటిది ఎప్పటి నాటకమో ఈ 'కన్యాశుల్కం' ఎవరు రచించారో తనకెలా తెలుస్తుంది?... అనుకున్నాడు. ఇంటికప్పుకేసి చూడ్డం ప్రారంభించాడు. ఇంక తను అక్కడ వుండటం శ్రేయస్కరం కాదనిపించింది. పరిణామాల్ని వూహించకుండా, అనవసరంగా ఇరుక్కుపోయాననుకున్నాడు.

"అదేమిటండీ... ఇంటికప్పుకేసి చూస్తున్నారు?" అంది దీప్తి... యెగతాళి ధోరణిలో.

భైరవమూర్తి కుంచించుకుపోయాడు. "అబ్బే... ఏంలేదండీ! ఆలోచిస్తున్నాను..." తడబడుతూ అన్నాడు.

శమంతకి నవ్వొచ్చింది.

"ఏవిఁటండీ భైరవమూర్తిగారూ! నాటకరంగంలో వున్నవాళ్ళు మీరు, వేషాలు వేస్తున్నారు. ఒక సమాజాన్ని నిర్వహిస్తున్నట్టున్నారు. కనీసం ఈ సబ్జక్టులోనయినా మీకు ప్రవేశం లేకపోవడం, నిజంగా శోచనీయమండీ! ఏదో ఫ్యాషన్‌కోసం, ఈ సబ్జక్టులపై మాట్లాడుకుందామన్నారుగాని, మీకు ఏ సబ్జక్టులోనూ ప్రవేశంలేదు..." అంది. "నాలోని లోపాన్ని నేను ఒప్పుకుంటున్నాను శమంతా! ఇది ఒకవిధంగా నాకు కనువిప్పు అయ్యింది. ఇకపైన వివిధరంగాల్లో విషయాల్ని తెలుసుకుంటాను. మరి, వెళ్ళొస్తాను" అంటూ లేచాడు, భైరవమూర్తి.

"మంచిది... వెళ్లండి. 'ప్రేమ'ను త్వరగా పంపించెయ్యండి"

"అలాగే శమంతా! 'ప్రేమ'ని తీసుకుని మరీ వచ్చేస్తాను" అంటూ దీప్తికేసి దృష్టిని సారించాడు.

"వస్తానండీ దీప్తిగారూ... ఈ కొద్దిసేపూ ఎంతో చక్కటి కాలక్షేపం జరిగింది. విలువైన వివరాలు తెలుసుకున్నాను. అందుకు ధన్యవాదాలు... మళ్ళీ కలుద్దాం" అనేసి చరచరా అక్కణ్నించి నిష్క్రమించాడు- భైరవమూర్తి.

అతను గుమ్మందాటి వెళ్ళే వరకూ వూరుకుని.

"అబ్బ... గొప్ప శాల్తీని పరిచయం చేశావే తల్లీ" కణతలు పట్టుకొని, విసుగ్గా అంది దీప్తి.

శమంత కిలకిల నవ్వింది.

"తారసపడ్డాక పరిచయం చెయ్యకపోతే, సభ్యతగా వుండదుకదేమరి!"

"ఇటువంటి వ్యక్తుల సరసన సభ్యతమా టెందుకే? మనకి బోరనిపిస్తోందన్న ఇంగిత మైనా లేదు మనిషికి?"

"అంతపాటి ఆలోచన వుంటే ఇంకేం? పైగా సాహిత్యం గురించి, నాటకాల గురించి, స్పోర్ట్సు విషయాలూ సరదాగా మాట్లాకుందా మంటాడేంటి?" నవ్వుతూ అంది శమంత.

"ఆయా ఫీల్డుల్లో ఎంతో ప్రవేశమున్నట్టే అన్నాడుచూశావా!తీరా మనం ప్రశ్నించేసరికి తెల్లమొహం వేశాడు. మనిషికి కాస్త కూడా సిగ్గూ, బిడియం, అన్నవి లేనట్టున్నాయి"

"అవి లేకనేకదే, నిన్ను పరిచయం చెయ్యాలేదని, నీగురించి ప్రత్యేకంగా అడిగాడు?" నవ్వింది శమంత.

దీప్తి నవ్వలేదు.

సీరియస్‌గా మొహం పెట్టింది.

"అడుగుతాడు... అడుగుతాడు... నువ్వన్నట్టు సిగ్గులేనివాడే! ఆ చూపులు చూడు, ఎంత అసహ్యంగా వున్నాయో. ఎదుటివాళ్ళు, కొత్తవ్యక్తులు, అపరిచితులన్న జ్ఞానమైనా లేకుండా, సభ్యతను మరిచిపోయి అలా గుచ్చి గుచ్చి చూస్తాడేవిటే? వట్టి బ్రూట్‌లా వున్నాడు" ఏహ్యాభావంతో అంది దీప్తి.

శమంత మనసు చివుక్కుమంది. తానుమాత్రం ఏం చెయ్యగలదు? అది భైరవమూర్తి నహజగుణమని ఎంతమందికి తెలుసు?

"అతను అదోరకం మనిషిలేవే! సహజంగా అతనిలో జీర్ణించుకుపోయివున్న గుణం ఎలా పోతుందని; మరేమీ అనుకోకు" సమాధానపరిచే ధోరణిలో అంది శమంత.

దీప్తి సన్నగా నవ్వింది.

"అర్థమయిందిలే! ఏంచేస్తాం? రకరకాల వ్యక్తులుంటారు. అందర్నీ భరించాల్సిందే మరి" తేలిగ్గా అనేసింది.

"ఏదో త్వరగానే వదిలిపెట్టాడు. లేకుంటే గంటల తరబడి పిచ్చాపాటి కొడుతూ కూచుంటాడు"

"వదిలిపెట్టక ఏంజేస్తాడు గురుడు? మన ప్రశ్నలతో అదరగొట్టాంకదా!" నవ్వింది దీప్తి.

ఆమె నవ్వుతో నవ్వు కలిపింది శమంత.

అంతలోనే శమంత తల్లి అక్కడికి వచ్చింది.

"అమ్మాయ్ దీప్తీ... ఓసారి ఇలా రామ్మా!" అంటూ లోపలికి వెళ్ళింది.

దీప్తి ఆమెను అనుసరించింది.

శమంత పక్కనేవున్న పత్రికను తీసి తిరగేయసాగింది.

★ ★ ★

మరో రెండుగంటలు గడిచాక ప్రేమ, భైరవమూర్తి కలిసి ఆటోలో వచ్చారు శమంత ఇంటికి.

భైరవమూర్తి వరండాలో కూచున్నాడు.

ప్రేమ, శమంత వున్న గదిలోకి వచ్చింది-

"హల్లో శమంతా!" అంటూ.

"వచ్చావాతల్లీ! నా పెళ్ళికని ఈ వూరొచ్చి, పుట్టిల్లు వదిలిపెట్టి రావడానికి ఇంతవరకూ తీరిక చిక్కలేదన్నమాట?" చిరుకోపంతో ప్రశ్నించింది శమంత.

ప్రేమ సన్నగా నవ్వుతూ శమంత కోపాన్ని చల్లబర్చాలని ఆమె పక్కనే కూలబడింది.

"అంతకోపమైతే ఎట్లాగే? కూల్‌డౌన్... కూల్‌డౌన్. మా అమ్మ ఏవేవో కబుర్లు చెబుతూవుంటే కదల్లేకపోయాను. అందుకనే అడ్వాన్సు పార్టీగా, మా ఆయన్ని ముందుగా పంపించాను"

"నాకు తెలీక అడుగుతాను- మీ ఆయన్ని ముందుగా పంపించడం ఎందుకే?"

"నేను వచ్చేశానని నీకు కబురు చెప్పడానికే!"

"అంటే మీఆయన్ని ఇలాంటిపనులకు వుపయోగించుకుంటున్నావన్నమాట" నవ్వుతూ అంది.

"పోవే... ఈ చిలిపితనం వదిలింది కాదు నీకు!" నవ్వింది ప్రేమ.

"సరేగాని... మీఆయనేడీ?"

"వరండాలో కూచున్నారు"

దీప్తి అప్పుడే లోపల్నుంచి వచ్చింది. ప్రేమని చూసి పలకరించింది.

"దీప్తీ... మా శమంత ఓఇంటిదవుతోంది...

మరి నువ్వెప్పుడు ఆహ్వానం పంపుతావ్?'' చిలిపిగా అడిగింది.

"దేనికయినా సమయం రావాలి కదా ప్రేమా!'' నవ్వుతూ అనేసింది దీప్తి.

"ప్రేమా... ఓసారి అమ్మని కలిసిరావే, నీగురించే అడుగుతోంది...'' అంది శమంత.

"దీప్తీ... నువ్వుండు- ఇప్పుడేవచ్చేస్తాను'' అంటూ లోపలికి వెళ్ళింది ప్రేమ.

వరండాలో కూచున్న భైరవమూర్తి ఒంటరితనం ఫీలవుతున్నాడు.

శమంత తండ్రి సుందరం, అప్పుడప్పుడూ అతనికి కంపెనీ ఇస్తున్నా మధ్యమధ్య ఏదో పనిమీద వెళ్ళిపోతూ వుంటే తనకి సరైన సహచర్యం లభించడం లేదని లోలోన బాధపడిపోతున్నాడు భైరవమూర్తి. తాను రాకుండా వుండాల్సిందని కూడా ఒకదశలో అనుకున్నాడంటే అతనెంత బోర్డమ్ ఫీలవుతున్నాడో అర్థం చేసుకోవచ్చు.

ఇంత ఒంటరితనం ఫీలవుతున్నా అతని చూపులు మాత్రం దీప్తికోసమే వెదుకుతూ వున్నాయి. తన ఒంటరితనాన్ని పోగొట్టుకుందుకు శమంత వుంటోన్న గదిలోకిపోయి పిచ్చాపాటి కొట్టాలనుకుంటే, కొన్ని గంటల క్రితం అతను పొందిన అవమానభారాన్ని గుర్తుచేసుకుని ఆ ప్రయత్నాన్ని విరమించుకున్నాడు.

దీప్తి అప్పుడప్పుడూ అగుపిస్తున్నా మెరుపులా తళుక్కున మెరిసి మాయమవుతున్నట్టే అనిపిస్తోందతనికి. ఒకటిరెండుసార్లు ఆమెతో మాట్లాడ్డానికి ప్రయత్నించి విఫలుడయ్యాడు కూడాను.

ఒంటరిగా కూచున్నాడేమో సిగరెట్టుమీద సిగరెట్టు కాలుస్తూనే వున్నాడు.

ఓమారు దీప్తి, శమంత గదిలోంచి బైటికి రాగానే చప్పున లేచి వెళ్ళాడామెముందుకు పళ్ళు ఇకిలిస్తూ.

"ఏవండీ దీప్తిగారూ... ఎక్కడికయినావెళ్లాలా?'' అని కలిగించుకుని అడిగాడు భైరవమూర్తి.

అతనిచొరవ దీప్తికి సుతరామూ నచ్చలేదు. దీపశిఖల్లాంటి ఆమె దృక్కుల్ని అతనికేసి ప్రసరించింది. ఆమె మొహం కోపంతో ఎర్రబారింది.

"నేనేం మీకు చెప్పలేదే! మీరెందుకలా అనవసరంగా వనువు రానుకుంటున్నారు చెప్పండి! పిలవని పేరంటానికి వస్తే, పరిహాసానికి గురికాగలరు... జాగ్రత్త!'' అంటూ హెచ్చరించి విసురుగా వెళ్ళిపోయింది దీప్తి.

భైరవమూర్తి అవాక్కయిపోయి క్షణంపాటు శిలాప్రతిమే అయ్యాడు. అతని మొహం మ్లానమయింది. అంతరంగానికేదో షాక్ తగిలినట్టయింది. 'ఎంత పొగరు?'... అని మనసులోనే హూంకరించుకొని వెనక్కివచ్చి కుర్చీలో కూలబడ్డాడు నీరసంగా.

దీప్తితో ఎలా పరిచయాన్ని పెంపొందించుకోవాలో అర్థంగాక ఆలోచనల్లో పడ్డాడు భైరవమూర్తి. అతనికి ఏమీ పాలుపోలేదు. తన మనసులోని భావానికి, ఒక రూపాన్నివ్వాలన్న అభిలాష, ఆరాటం అధికమయ్యాయి. ఒకపక్క కాస్తంత బెదురున్నా అతని చూపులుమాత్రం దీప్తి శమంత వున్న గదికేసే కేంద్రీకృతమై వున్నాయి. దీప్తితో ఎట్లాగయినా మాట్లాడాలి. ఆమెతో పరిచయాన్ని పెంచుకోవాలి... అదే అతని ధ్యేయం...! అదే అతని లక్ష్యం.

భైరవమూర్తి ఎంత కరకుగా అగుపిస్తాడో అతని మనసూ అంత కరకుగానే వుంటుంది. మనిషిరూపం, మనసుకి ప్రతిబింబమని అందుకే అంటారేమో! అతను ఏదన్నా మనసులో అనుకుంటే చివరికి ఫలితం ఎలావున్నా దానికోసం ప్రయత్నం సాగించనిదే అతనికి నిద్రపట్టదు. అంత మొండిపట్టుదల అతనిది.

ఏమేమో ఆలోచిస్తూనే ఒంటరిగా కూచుని నాలుగయిదు సిగరెట్లు వూదేశాడు భైరవమూర్తి.

మరో సిగరెట్ వెలిగించడానికి జేబులోంచి సిగరెట్‌పెట్టె తీశాడు భైరవమూర్తి. సరిగ్గా అప్పుడే, మెరుపుతీగలా దీప్తి డాబా మీదికి వెళ్ళడం గమనించాడు. సిగరెట్ పెట్టెని మళ్ళీ జేబులోకి కుక్కేశాడు. అతని హృదయంలో ఎవరో మధురగీతి ఆలాపిస్తున్నట్టయింది. ఎక్కడలేని హుషారూ వచ్చేసిందతనికి. ఈ అవకాశం జారవిడుచుకోకూడదన్న నిర్ణయానికొచ్చాడు భైరవమూర్తి. ప్రేమ ఎక్కడో

లోపలి గదిలో వుంది. శమంత ఆమె గదిలో వుంది. శమంత తండ్రి చుట్టుపక్కల ఎక్కడా లేడు. అంతకంటే అనుకూల వాతావరణం మరి రాదనుకున్నాడు. చప్పునలేచి, డాబామీదికి వెళ్ళాడు.

నంజవెలుగులో, డాబామీద ఆరవేసి ఉన్న చీరను తీస్తోన్న దీప్తి, ఎంతో వయ్యారంగా అగుపిస్తోంది భైరవమూర్తికి. ఆమెకి ఎదురుగా వెళ్ళాడు. "దీప్తిగారూ... నన్నుచూస్తే ఎందుకలా మండిపోతారు. మీ దృష్టిలో నేనెలా అగుపిస్తున్నాను. సహృదయంతో, మీతో పరిచయం చేసుకోవాలని, మీ మృదుమధురవాక్కులు వినాలని, నేనెంతగా తహతహలాడుతున్నానో, మీకు చెప్పినా అర్ధంకాదు. మిమ్మల్ని చూసిన మరుక్షణం నించీ, ఏదో అతీతమైన శక్తి నన్నాకర్షించినట్టనిపిస్తోందంటే నమ్మండి. అందుకే ధైర్యంచేసి, మీతో మాట్లాడాలన్న వుబలాటంతో ఇలా వచ్చేశాను. మిమ్మల్నింతగా అభిమానించే నన్ను మీరిలా తిరస్కారభావంతో చూస్తూ కించపర్చడం మీవంటి నవనీత హృదయులకు భావ్యం కాదండీ" నాటకీయంగా అన్నాడు, భైరవమూర్తి.

దీప్తి భయపడలేదు. తన ఒంటరితనాన్ని అతను అవకాశంగా తీసుకుంటున్నాడనుకుంది. అతనిపట్ల ఏహ్యాభావం మరింత పెరిగింది. తీక్షణంగా చూసిందతనికేసి. అతనికి ఏవిధమైన జవాబూ చెప్పడానిక్కూడా మనస్కరించలేదామెకి. చీర భుజమ్మీదవేసుకుని, అతన్ని తప్పించుకుని మెట్లకేసి చరచరా నడిచింది.

దీప్తి మౌనాన్ని అర్ధాంగీకారంగా తీసుకున్నాడో ఏమో మరి–

"పలుకే బంగారమా మాట్లాడితేనే ముత్యాలురాలిపడతాయనా మౌనంగా పోతున్నావు?" అంటూ ఆమె వెంట నడిచి, చప్పున ఆమె ఎడమచేతిని పట్టుకున్నాడు భైరవమూర్తి.

అంతే!

"రాస్కెల్..." అతని చెంప ఛెళ్ళుమంది.

అనుకోకండా, దీప్తికోసం డాబామీదికి అప్పుడే వస్తోన్న శమంత, ఆ దృశ్యాన్ని కళ్ళారా చూసింది. భైరవమూర్తి పట్ల జుగుప్స ఏర్పడిందామెలో, "భేష్.. బాగా పాఠం చెప్పావే దీప్తీ!" కసిగా అంది శమంత.

భైరవమూర్తికి తలకొట్టేసినంత పనయింది. శమంత సమక్షంలోనే తనకీ అవమానం జరగడం భరించలేకపోయాడు. ఇంతటి ఘోరావమానాన్ని అతడు జీవితంలో ఎన్నడూ చవిచూడలేదు. అతని అహం దెబ్బతింది. ఆక్రోశం పెరిగింది. అయితే, ఆ తరుణంలో ఏంజేసినా నవ్వుల పాలయ్యేది తనేనన్న నిజాన్ని గ్రహించుకున్నాడు. దీప్తి చెంపదెబ్బ, శమంత మెచ్చుకోలూ, అతనిలో పగ సెగలుకక్కింది. అతని కళ్ళు చింతనిప్పులే అయ్యాయి. మొహం అరుణారుణ కాంతిని పుంజుకుంది. ఆ మార్పుని అక్కడున్న అతివలిద్దరూ గమనించలేదా నంజవెలుగులో.

"నన్నిలా అవమానించినందుకు నీ గొప్పతనానికి, నీ పాతివ్రత్యానికి, మురిసిపోకు దీప్తీ! ఎప్పుడో, ఎలాగో ఓలా కక్ష తీర్చుకుంటాను. నీ కంటతడి చూసి, మనసారా నవ్వుతాను" ప్రతిజ్ఞ చేసినట్టుగా, కసిగా అన్నాడు భైరవమూర్తి.

శమంత ఏదో అనబోతుండగా, దీప్తి అందుకుంది–

"బోడి ప్రగల్భాలు పలక్కుదౌర్భాగ్యుడా! నలుగురిలో మరింత అవమానానికి గురికాగలవు. నేను తల్చుకుంటే ఈ క్షణంలోనే అంత పనీ చెయ్యగల్ను. కాని మా శమంత పెళ్ళి సందర్భంలో, ఇటువంటి రభస జరపడం నాకిష్టంలేదు. అంతేకాదు – నీ భార్య ప్రేమ మొహం చూసి వూరుకుంటున్నాను. ఎందుకో తెలుసా? నీకు అవమానం జరిగితే, నీకు అర్ధాంగి అయిన పాపానికి, ఆమె నిలువునా కృంగిపోతుంది. అది నాకిష్టంలేదు. అర్ధమయిందా? లెర్న్ మేనర్స్, వొళ్ళు దగ్గర పెట్టుకుని మసలు. ఆడదంటే అంత చులకనగా చూడకు. వెళ్ళు..." ధైర్యంగా శాసించినట్టుగానే చెప్పింది దీప్తి. ఆమె కళ్ళు నిప్పుల వర్షం కురిపిస్తున్నాయా తరుణంలో.

భైరవమూర్తి విసురుగా మేడమెట్లు దిగి వెళ్ళిపోయాడు.

శమంత దీప్తి భుజాన్ని తట్టింది, అభినందిస్తున్నట్టుగా.

"దీప్తీ... నీలాంటి చొరవ, ధైర్యం, గుండెనిబ్బరం ఆడవాళ్ళందరికీ వుంటే, ఈనాటి అబ

లలబతుకువెంతో బాగుండుననిపిస్తోందే;నాకు చాలా ఆనందంగా వుందే; ఈ గుణపాఠంతో బాగా బుద్ధి వచ్చివుంటుందిలే; మరెప్పుడూ పరాయిస్త్రీ జోలికిపోడు'' అంది శమంత.

దీప్తి సన్నగా నవ్వింది.

"అలా ఒక నిర్ణయానికి రావొద్దు శమంతా! ఇటువంటివాళ్ళవి కుక్కతోక మనస్తత్వాలు. వాటిలో మార్పు వస్తుందన్న నమ్మకం నాకులేదు. నిజం చెప్పాలంటే శమంతా... అతణ్ణి చూసిందగ్గర్నించీ అతని పట్ల సద్భావం కలగలేదే ఎందుకోమరి! ఏమైతేనేం - కొంతయినా బుద్ధితెచ్చుకుంటాడులే. సరేగాని... ఈ విషయం ఇంకెక్కడా అనొద్దే - 'ప్రేమ'తోనయినా సరే. ఆమె బాధపడుతుంది... అంతేకాదు... తక్షణం తిరుగుముఖం పట్టినాపడుతుంది''

దీప్తి చెప్పింది నిజమేననిపించింది శమంతకి.

"అదీ నిజమేనే- పదపోదాం...''

ఇద్దరూ కిందికి దిగిపోయారు.

భైరవమూర్తి ఎక్కడా అగుపించలేదు వారికి. తర్వాత తెలిసింది. అర్జంటుగా ఏదో పనుందంటూ అతను వాళ్ళ వూరు వెళ్ళిపోయాడని. అందుకు కారణం ఏమిటో దీప్తికి, శమంతకి మినహా మరెవ్వరికీ తెలీదు మరి!

దీప్తి, శమంత ఆ విషయం విన్నాక పరస్పరం మొహాలు చూసుకుని నవ్వుకున్నారు.



రామరాజు తండ్రి పదేళ్ళక్రితమే పరమపదించాడు. అతని మ్మాతృమూర్తి ఈ లోకాన్ని విడిచి, మూడేళ్ళు కావస్తోంది. అతనికి 'నా' అనేవాళ్ళు ఇంకెవరూలేరు. అతను ఒంటరివాడు. స్వతంత్రుడు. అందుకనే దీప్తి తల్లిదండ్రులు మరింకేవీ( ఆలోచించకుండానే అతణ్ణి అల్లుడిగా చేసుకుందుకు చప్పున ఒప్పేసుకున్నారు. దీప్తి అభిప్రాయమూ అదే; అతని నీడలో తాను స్వేచ్ఛగా, సుఖంగా జీవించగలదన్న నమ్మకం ఏర్పడిందామెలో. రామరాజు నాలుగంకెల్లో నెలజీతం సంపాదిస్తున్నాడు. బాధ్యతలేవీ లేవు. సుఖజీవనానికి కొరతేమిటింక!

దీప్తి చదువుకున్నదీ, తెలివైనదీ, ఇంగితంగలదీ కావడంవల్ల, ఇంటిని రమణీయంగా తీర్చిదిద్దుకుంటూ, సంసారాన్ని స్వర్గధామం చేసుకోవాలని ప్రయత్నిస్తోంది. రామరాజు ఆమె మనస్తత్వానికి అనుగుణంగా మసలుకుంటున్నాడు. ఆమెతో జీవితం అతనికి స్వర్గతుల్యమే అవుతోంది.

ఆ రోజు ఆఫీసునుంచి తిరిగొచ్చిన రామరాజు దుస్తులు మార్చుకుని సోఫాలో వచ్చి కూచున్నాడు.

దీప్తి తాను స్వయంగా తయారుచేసిన గులాబ్‌జామ్‌లను ప్లేటులో వేసి తెచ్చి భర్త ముందు పెట్టింది.

రామరాజు స్పూన్‌తో ఒకదాన్ని నోట్లో వేసుకున్నాడు. పాలమీగడలా కరిగిపోయింది. చాలా రుచిగా వున్నట్టు ఫీలయ్యాడు.

"నువ్వే తయారుచేశావా దీప్తీ?'' చిరునవ్వుతో ప్రశ్నించాడు.

"ఔనండీ. ఏం... బావుండలేదా?'' చిరునవ్వుతో అడిగింది దీప్తి.

"నువ్వు తయారు చెయ్యడమూ, బాగుండకపోవడమూనా? ఎంతమాట! నిజానికి నిన్ను చూస్తూనే నువ్వందించిన పదార్థాలను మధురాతి మధురంగా ఊహించుకుని తినెయ్యొచ్చు దీప్తీ! నీ దరహాసం మత్తెక్కిస్తోంటే, నీ పలుకులు తియ్యదనాలొలికిస్తూ వుంటే, నీ చేతి వంటకాలు మధురిమలందిస్తున్నాయ్'' అంటూ నవ్వేడు రామరాజు.

"చూశావా హఠాత్తుగా నాకు కవిత్వం వచ్చేస్తోంది''

దీప్తి కిలకిలా నవ్వింది- భర్త అందించిన కాంప్లిమెంట్‌కి.

"నిజమే సుమండీ... మీరు కవిత్వం చెప్పా

రు'' అంది నవ్వుతూనే.

''నిన్ను చూస్తుంటే కవిత్వమే వస్తుంది దీప్తీ- నిజం...'' ఆమె మొహంలోకి తదేకంగా చూస్తూ అన్నాడు రామరాజు.

''నరేలెండి కవిగారూ... ఇంక పొగడ్తలాపండి! కాఫీ కలపమంటారా లేక హార్లిక్సా?''

''ఆ నిర్ణయం దేవిగారికే వదిలేస్తున్నాను- నీ ఇష్టం...''

''అబ్బ... అంతా నా ఇష్టంమీద జరుపుతున్నట్టే చెబుతున్నారేవిటండోయ్... ఇప్పుడే తెస్తానుండండి'' అంటూ లోపలికి పోయి, అయిదు నిమిషాల్లో హార్లిక్సు తెచ్చి అందించింది.

''నా అభిరుచుల్నీ నా అలవాట్లనీ ఎంత తొందరగా తెలుసుకున్నావు దీప్తీ- రియల్లీ యూ ఆర్ స్మార్ట్...''

''అర్ధాంగిని కదండీ మరి? తొందరగా అర్థం చేసుకోగలిగాను...'' నవ్వింది.

రామరాజు తృప్తిగా ఓ నిట్టూర్పు విడిచి, ఖాళీచేసిన గ్లాసుని బల్లమీద పెట్టాడు.

''ఏమైనా ఒంటరిజీవితానికి, వైవాహిక జీవితానికి ఎంతో వ్యత్యాసం వుందనిపిస్తోంది దీప్తీ! ఈ నిజాన్ని స్వానుభవంతో తెలుసుకున్నాను. నా వివాహం కాకముందు, ఇంటిపట్టున ఉండేవాణ్ణి కాదనుకో. నువ్వీ ఇంట్లో అడుగుబెట్టాక ఇల్లువిడిచి బైటికి వెళ్ళడానికే మనస్కరించడం లేదంటే నమ్ము'' అన్నాడు రామరాజు.

భర్త మాటలు దీప్తికి ఎంతో సంతృప్తినిచ్చాయి. ఆమె కళ్ళల్లో గర్వంతో నిండిన వెలుగు తళుక్కుమంది. ఏ స్త్రీ అయినా కోరుకునేది ఇంతకంటే ఏముంటుంది?... అనుకుంది మనసులో.

''మరీ అంత గట్టిగా ఆ మాట అనకండి. నేను అప్పుడే మిమ్మల్ని కొంగున ముడివేసుకు తిరుగుతున్నానని అనుకుంటారు జనం'' ముసిముసిగా నవ్వుతూ అంది.

''అనుకోనీ దీప్తీ, మనకేం?''

''ఆ నిర్లక్ష్యమే వద్దండీ,మనం సంఘజీవులం. సంఘంలో మనమూ ఒకరం. అణకువతో వుండటం చాలా అవసరం''

రామరాజు ఆ విషయంలో వాదన పెంచుకోదల్చలేదు. దీప్తి చెప్పింది సబబుగానే తోచింది.

''నరేగానీ... మా మేనేజరు గారింటికి వెళ్లాలి ఓసారి. ఆయన మరీ మరీ చెబుతున్నాడు మనల్ని రమ్మని. ఎప్పుడు వెళ్దామంటావు?''

''మీ ఇష్టమండీ... నేనెప్పుడూ రెడీయే''

''అన్నట్టు, మా భైరవమూర్తి ఇంటికీ వెళ్ళలేదు. వాళ్ళు మనకి ఎంతో సన్నిహితులని చెప్పాను గుర్తుందా? ఇంకా మనం వాళ్ళింటికి వెళ్ళలేదని వాళ్ళకి కోపం రావచ్చు''

దీప్తి మొహంలో రంగుమారింది. అంతవరకూ చిరుదరహాసంతో కళకళలాడుతూ వుండే ఆమె మోము క్షణంలో గంభీరంగా మారింది.

''వాళ్ళింటికి వెళ్ళడం అంత అవసరమంటారా?'' మొహం దించుకుని అంది.

రామరాజు దీప్తి మొహంలోకి పరిశీలనగా చూశాడు. భైరవమూర్తి ప్రసక్తి వచ్చినపుడంతా భార్య మొహంలో రంగులు మారుతూ వుండటం అతను గమనించడం ఇది రెండోసారి. అలా ఎందుకు జరుగుతున్నదో అతని ఊహకి అందలేదు. దీనికి ఏదో కారణం తప్పక వుండి వుంటుందన్న ఆలోచన అతనిలో మెదిలింది.

''ఔనూ... మా భైరవమూర్తిని చూసినా, అతని ప్రస్తావన వచ్చినా నీ మొహంలో అప్రయత్నంగా ఓ విధమైన మార్పు వచ్చేస్తోంది దీప్తీ, దీనికి కారణం ఏమన్నా వుందా? ఇలా అడిగానని మరేం అనుకోకు. కేవలం ఇది నా సందేహం మాత్రమే'' సన్నగా నవ్వుతూ అడిగాడు రామరాజు.

ఆ ప్రశ్న వినగానే దీప్తికి షాక్ తగిలినట్టయింది. భర్తకి అటువంటి సందేహం రావడానికి తన ప్రవర్తనే కారణమనుకుంది. తమ వివాహమై ఎంతో కాలం కాలేదు. ప్రారంభదశలోనే ఇటువంటి సందేహాలు జనిస్తే, అవి ఎలాంటి అపార్థాలకు దారితీస్తాయోనని భయపడింది. ఇంక అటువంటి పిచ్చిపిచ్చి వేషాలు వెయ్యకూడదని గట్టిగా నిర్ణయించుకుంది. భర్తకేసి ఓరగా చూసి, చిన్నగా మందహాసం చేసింది.

"అబ్బే... ప్రత్యేకించి కారణమంటూ ఏమీ లేదండీ! అసలు మీకు ఈ అనుమానం ఎందుకొచ్చిందో నాకు అర్థం కావడం లేదు. ఒక్కో మనిషిపై ఒక్కోవిధమైన భావం ఏర్పడ్డం మానవసహజమంటే మీరూ ఒప్పుకుంటారనుకుంటాను. ఎందుకో మరి-- భైరవమూర్తిగారిని చూస్తే నాకు సద్భావం కలగడంలేదు. దానికి కారణం ఏమిటని మీరు అడిగితే ప్రత్యేకించి నేనేం చెప్పలేనండీ! పోనీలెండి... మీరెందుకు బాధపడ్డం? క్రమంగా నా అభిప్రాయాల్నీ నా భావాల్నీ మార్చుకుందుకు ప్రయత్నిస్తానండీ"

రామరాజు బరువుగా ఓ నిట్టూర్పు విడిచాడు.

"భైరవమూర్తి పట్ల నీకు అటువంటి అభిప్రాయం కలగడం దురదృష్టం దీప్తీ! అతని భార్య మీ వూరు అమ్మాయేకదా?"

"కాదని ఎవరన్నారండీ? ఆమె నాకు పరిచితురాలు కూడాను. ఆమెని ఎప్పుడు కలుసుకున్నా సరదాగా కాలక్షేపం చేస్తుంటాను. ఈ వాదనలన్నీ ఎందుకు లెద్దురూ! ఎప్పుడో ఓరోజు వాళ్ళింటికీ వెళ్దాం. ప్రేమ చెప్పింది కూడా రమ్మని" అంది మామూలు ధోరణిలోనే దీప్తి.

రామరాజు సన్నగా నవ్వేడు. "అదీ... అలా అన్నావు బావుంది దీప్తీ! నా ఫీలింగ్సుని కూడా నువ్వు అర్థం చేసుకోవాలి మరి. ఇంతకుముందే చెప్పాను— నాకు చాలా సన్నిహితుడు భైరవమూర్తని. వాడికి నొప్పి కలిగించడంగాని, అవమానించడంగాని నాకు మనస్కరించదు"

"అతణ్ణి అవమానించే అవసరం నాకేముందండీ? చెప్పానుకదా- వాళ్ళింటికి తప్పకుండా వెళ్దామని. ఎప్పుడో ఎందుకు - రేపే వెళ్దాంపదండి" చిరునవ్వుతో అంది దీప్తి.

తృప్తిగా నిట్టూర్చాడు, రామరాజు.

"సరేగాని... సినిమాకి వెళ్దామా?"

"ఎప్పుడు?"

"రాత్రి షోకి..."

"మీఇష్టం కాని నిద్రలేకపోతే, మీ ఆరోగ్యం పాడవ్వదూ? రేపు... మీరు కాస్త పెందరాళేవస్తే, సాయంత్రం షోకి వెళ్దాంలెండి"

"ఓకే. నువ్వన్నట్టే చేద్దాం. రేపుసాయంత్రం ఆటకి టిక్కెట్లు తీసుకునివస్తాను. నేనొచ్చేసరికి నువ్వు రెడీగావుండు"

"అలాగేనండీ"

"ఏదీ... ఆ న్యూస్‌పేపరిలా ఇవ్వు..."

దీప్తి లేచివెళ్ళి, న్యూస్‌పేపరు తెచ్చిచ్చింది.

రామరాజు చదవడంలో నిమగ్నుడయ్యాడు.

★ ★ ★

దీప్తికి చెప్పినమాట గుర్తుంది రామరాజుకి. అందుకనే ఇంటికి పెందరాళే వెళ్ళాలన్న తలంపుతో, తలెత్తకుండా శ్రద్ధగా పనిచేస్తున్నాడు.

సాయంత్రం నాలుగ్గంటలవుతోంది. భైరవమూర్తి వచ్చాడు.

"ఏవిఁట్రోయ్ రాజూ, ఇవ్వాళ చాలా బుద్ధిమంతుడివైపోయినట్టున్నావు? ఎప్పుడైనా ఇంతశ్రద్ధగా పన్జేసియేడ్చావూ?" నవ్వుతూ అంటూ రామరాజు టేబిలుముందున్న స్టూలు మీద కూచున్నాడు భైరవమూర్తి.

రామరాజు తలెత్తిచూశాడు.

"కాస్త పెందరాళే ఇంటికి వెళ్దామని..."

"ఏవిఁటి సంగతి... విశేషం ఏమన్నా వుందా?"

"సినిమాకి వెళ్ళాలనుకుంటున్నాంరా..."

"దేనికి?"

"ఆనందభైరవికి... అప్పుడెప్పుడో వచ్చినపుడు చూడలేదు. అందుకే, ఇప్పుడు మిస్సవ్వకూడదని..."

"ఫన్నీ... మేంకూడా అదేసినిమాకి వెళ్ళాలనుకుంటున్నాంరా, సాయంత్రం షోకి." చిన్నగా మందహాసం చేస్తూ అన్నాడు మూర్తి.

"ఈజిట్? అయితే మరేం! మంచికంపెనీయే! మేంకూడా సాయంత్రంషోకే వెళ్తున్నాం. టిక్కెట్లసంగతి ఏంజేశావు?"

"నేను ఏర్పాటుచేస్తాలేరా! అక్కడిస్టాఫ్ నాకు తెలిసినవాళ్ళే. మీరు నేరుగా హాలుదగ్గరికి వచ్చేయండి"

"థాంక్స్‌రా మూర్తీ... టిక్కెట్లకోసం 'క్యూ'లో పడిగాపులుపడే దురవస్థనుంచి తప్పించావు. ఇదిగో, రెండు టిక్కెట్లు తీసుకో" అంటూ

జేబులోనుంచి పదిహేను రూపాయలుతీసి ఇచ్చాడు రామరాజు.

"ఉంచరా రాజూ... ఆపాటి నాదగ్గర లేవను కుంటున్నావా? అంతగా నువ్వు ఆత్మాభిమానంతో గిలగిల్లాడితే, మరో సినిమాకి వెళ్ళాంలే, అప్పుడు నువ్వు టిక్కెట్లు తీసుకుందువుగాని." అన్నాడు భైరవమూర్తి ఆ డబ్బు తీసుకోకుండా.

ఈ విషయం తెలిస్తే దీప్తి అసహ్యించుకుంటుందేమోనన్న సందేహంవచ్చింది రామరాజుకి.

"అబ్బే... అలా ఎందుకులేరా! మళ్ళీ సినీమాకి వెళ్ళినపుడు ఇదేపద్ధతి అవలంబిద్దాం... వుంచు" బలవంతంగా ఇచ్చేశాడు డబ్బుని.

భైరవమూర్తికి ఆడబ్బు తీసుకోక తప్పలేదు.

"నువ్వు, అప్పుడే చాలా మారిపోయావురా రాజూ..."

"మార్పేమీలేదుగాని, ఎందుకయినా మంచిది... నువ్వు కాస్త పెందరాళే వెళ్ళరా మూర్తీ: టిక్కెట్లు దొరక్కపోతే, ఇంటికి తిరిగివెళ్ళడమన్నది, చిన్నతనంగావుంటుంది" మందహాసంతో అన్నాడు రామరాజు.

భైరవమూర్తి నవ్వేడు.

"నేను వెళ్ళడమూ, టిక్కెట్లు దొరక్కపోవడమూనా? ఆ ఏర్పాటేదో నేను చూసుకుంటాను కదా? నువ్వు మీ ఆవిడతో నిశ్చింతగా వచ్చేసెయ్ హాలుదగ్గరికి"

"అలాగే..."

"వస్తా..." భైరవమూర్తి అక్కణ్ణించి నిష్క్రమించాడు.

రామరాజు తన 'టేబిలుమీదున్న ఫైళ్ళన్నీ సర్దేసి, ఆఫీసు సూపరింటెండెంటుకి చెప్పి, ఇంటికి బయల్దేరాడు.

త్రోవలో మల్లెపూలు కొనుక్కొని, ఇల్లు చేరుకున్నాడు రామరాజు. అప్పటికే దీప్తి ముస్తాబై రెడీగావుంది. తెల్ల షిఫాన్ చీర, మేచింగ్ బ్లౌజులో, ఎంతో ఆకర్షణీయంగా, అందంగా అగుపిస్తోందామె. క్షణంపాటు భార్యకేసి తదేకంగా చూడకుండావుండలేకపోయాడు.

దీప్తి సిగ్గుపడిపోయింది. ఆమె చెక్కిళ్ళు ఎర్రబడ్డాయి.

"ఏవిఁటండీ అలా చూస్తున్నారు? కొత్త వ్యక్తినేంకాదుగా! మీ అర్ధాంగినే..." కిలకిలా నవ్వుతూ అని– "వెళ్ళి మొహంకడుక్కొని బట్టలు మార్చుకోండి - కాఫీ ఇస్తాను" అంటూనే భర్తచేతిలోవున్న మల్లెపూల పొట్లాన్ని అందుకుని పూలను తల్లో తురుముకుంది.

రామరాజు ముసిముసిగా నవ్వుకుంటూనే గదిలోకి వెళ్ళిపోయాడు.

దీప్తి కూనిరాగాలు తీస్తూ, నిలువుటద్దంముందు నుంచుని, మల్లెపూలను మరోసారి సర్దుకుంది. వివిధ భంగిమల్లో తననితాను అద్దంలోచూసుకుని మురిసిపోయింది.

మరి కాస్సేపటికి రామరాజు తెల్లని దుస్తుల్లో రెడీ అయ్యొచ్చాడు.

తెల్లని దుస్తుల్లోవున్న ఆ ఇరువురూ, ఒకరొకరు చూసుకుని నవ్వుకున్నారు.

"ఇవ్వాళ నువ్వెంత అందంగా కనిపిస్తున్నావో నీకు తెలుసా దీప్తీ? వనదేవతను నేనెప్పుడూ చూళ్ళేదుగా! ఆమె అచ్చంగా నీలానే వుంటుందేమోనని వూహిస్తున్నాను"

దీప్తి లోలోన వుప్పొంగిపోయింది. సిగ్గుతో మొహం దించుకుంది.

"మీరు మాత్రం అందంగాలేరూ?" అని మాత్రం అనగలిగింది.

ఫ్లాస్కులో పోసివుంచిన కాఫీని కప్పులోపోసి, తెచ్చి భర్తకు అందించింది దీప్తి.

"తొందరగా కానివ్వండి. టిక్కెట్లు దొరక్కపోతే, తిరిగి వచ్చేయాల్సివస్తుంది."

రామరాజు కాఫీని సిప్‌చేస్తూ - "అటువంటి భయంలేదులే దీప్తీ! మా భైరవమూర్తి కూడా ఫామిలీతో వస్తున్నాడు. ఈ సినిమా మొదటిసారి వచ్చినపుడు, వాళ్ళూ చూడలేదట. హాల్లోని స్టాఫ్ తెలిసినవాళ్ళున్నారట... వాడే టిక్కెట్లు ఏర్పాటుచేస్తానన్నాడు. అంచేత టిక్కెట్లు దొరకవన్న భయంలేదు" కాఫీ తాగడం పూర్తిచేసి, కప్పుని భార్యకి అందించాడు రామరాజు.

అతని దృష్టిమాత్రం, దీప్తి మొహంకేసే కేంద్రీకృతమైవుంది. భైరవమూర్తి ప్రస్తావన వచ్చిందిగాబట్టి, ఆమె ముఖకవళికలు మారుతాయో, లేదోనన్న అభిలాష అతనిది.

దీప్తి అంతరంగంలో అయిష్టత పేరుకు

న్నా ఆ భావాన్ని మొహంలో వ్యక్తంకానీయకుండా జాగ్రత్తపడి, నవ్వుగా మందహాసంచేసింది.

“అతను ఏర్పాటుచేస్తానంటే, అంతకంటె కావల్సిందేముందండీ” అనేసింది ముక్తసరిగా.

భార్యమొహంలో, అయిష్టత అగుపించకపోవడంతో తృప్తిగా నవ్వుకున్నాడు రామరాజు.

ఇంటికి తాళంవేసి ఇద్దరూ ఆటోలో సినిమాహాలుకి బయల్దేరారు.

సినిమాహాలు దగ్గరికి వెళ్ళేసరికి, భైరవమూర్తి దంపతులు వారికోసం నిరీక్షిస్తున్నారు.

టిక్కెట్లు దొరక్కగామోసు చాలామంది తిరుగుముఖం పడుతూండటం చూసిన రామరాజుకి, తమకీ టిక్కెట్లు దొరికాయో లేదోనన్న సందేహంకలిగింది.

దీప్తిని చూసి ప్రేమ ఓరునవ్వు నవ్వింది. “రా దీప్తీ! మీ ఇద్దర్నీ మాయింటికి రమ్మని చెప్పానుకదా... రాలేదేం? అంతతీరికలేకుండా వున్నావా ఏమిటీ?” చిలిపిగా నవ్వుతూ అంది ప్రేమ.

దీప్తి నవ్వుని మందహాసంచేసింది. “కొత్త సంసారంకదా, ఇల్లు చక్కబెట్టుకునేసరికే సమయం గడిచిపోతోంది ప్రేమా! మరేం అనుకోకు- త్వరలో వస్తాంలే!”

“ఏంరా... మూర్తీ, టిక్కెట్లు దొరికినట్టేనా? లేకపోతే అబౌట్టర్నా?” నవ్వుతూ ప్రశ్నించాడు రామరాజు.

“టిక్కెట్లు దొరక్కపోవడమన్నది నా జాతకంలోలేదు బ్రదర్...” సగర్వంగా, నవ్వుగా మందహాసంచేస్తూ అన్నాడు మూర్తి.

“అంతమంది తిరిగి వెళ్ళిపోతూవుంటే, క్యూలో నిల్చోకుండా టిక్కెట్లు సంపాదించావంటే నిజంగా నువ్వు ఘనుడివేరా!” కాంప్లిమెంటు ఇచ్చేశాడు రామరాజు.

భైరవమూర్తి కాలర్ని ఓసారి సర్దుకున్నాడు. “చాలా ఆలస్యంగా తెలుసుకున్నావురా...” సుతారంగా సిగరెట్ పొగవదుల్తూ అన్నాడు భైరవమూర్తి.

“బెటర్ లేట్, దేన్ నెవ్వర్...” నవ్వేశాడు, రామరాజు “లోపలికి పోదామా?”

“ఆలస్యమెందుకూ? పదండీ...”

---

నలుగురూ హాల్లోపలికిపోయి కూచున్నారు. మరో అయిదు నిమిషాల్లో హాల్లోని లైట్లు ఆరిపోయాయి. ప్రకటనలు ప్రారంభమయ్యాయి న్యూస్‌రీలు తర్వాత సినిమా.

సినిమా ప్రారంభమయ్యాక హాలంతా నిశ్శబ్దంగా మారింది. అంతగా సినిమా కథలో లీనమైపోయారు ప్రేక్షకులు.

ఇంటర్వెల్‌లో లైట్లు వెలిగాయి.

"పదరా రాజూ! కూల్‌డ్రింక్స్ తీసుకొద్దాం." లేచాడు భైరవమూర్తి.

"నాకేం వద్దండీ" అంది ప్రేమ.

"ఏవండీ మీకు?" దీప్తిని వుద్దేశించి అడిగాడు భైరవమూర్తి.

"నాకూ ఏవీఁ వద్దండీ అన్నయ్యగారూ!" అంది, దీప్తి.

భైరవమూర్తి అంతరంగం చివుక్కుమంది, అలా ఆమె సంబోధించినందుకు.

"సరే... మనం వెళ్దాంపదరా" రామరాజుతో పాటు బైటికి నడిచాడు భైరవమూర్తి.

మళ్ళీ సినిమా ప్రారంభమవుతుందనగా వాళ్ళిద్దరూ తిరిగొచ్చి, ఎవరి సీట్లో వారు కూచున్నారు.

మళ్ళీ హాల్లో నిశ్శబ్దం ఆవరించుకుంది.

సినిమా ముగిసింది. అన్నివర్గాల ప్రేక్షకులకీ నచ్చిన సినిమా అది. ఒక్కొక్కరూ ఒక్కోలా అభిప్రాయాన్ని వెల్లడిచేసుకుంటూపోతున్నారు. సంగీతం, పాటలు వీనులవిందుగా వున్నాయని కొందరంటూవుంటే; నృత్యం చిత్రానికి ప్రాణమని మరికొందరంటున్నారు.

"సినిమా ఎట్లావుందిరా రాజూ?" హాల్లోంచి బైటికి వస్తున్నప్పుడు అడిగాడు భైరవమూర్తి.

"చిత్రం గొప్పగావుందిరా! సాంకేతిక విలువలు వుత్తమస్థాయిలో వున్నాయి. దర్శకుడి ప్రతిభ కొన్ని ఫ్రేముల్లో అద్భుతంగా కనిపిస్తోంది. ముఖ్యంగా, గిరీష్‌కర్నాడ్ నటన అమోఘంగావుంది. ఆయన మాట్లాడకుండానే ముఖకవళికల్లో సంభాషణలు చెప్పేరేమోనన్నంత గొప్పగా అభినయించేశారు. ముఖ్యంగా ప్రతి నటుడూ చూడాల్సిన సినిమా ఇది." అంటూ తన అభిప్రాయాన్ని చెప్పాడు రామరాజు.

"ఏవండీ దీప్తిగారూ... మీరేవంటారు?" భైరవమూర్తి ప్రశ్నించాడు.

అతను తననలా ప్రశ్నించడం, దీప్తికి ఇష్టంలేకపోయినా తప్పనిసరిగా ఏదో జవాబు చెప్పాలనుకుంది.

"భైరవి పాత్ర నన్నుబాగా ఆకట్టుకుందండీ!" ముక్తసరిగా చెప్పింది దీప్తి.

దీప్తి అలా చెప్పడంలోని అంతరార్థం ఏవిఁటో భైరవమూర్తి అర్థంచేసుకున్నాడు. కాని రామరాజు, ప్రేమ మాత్రం దీప్తి భైరవిపాత్ర నచ్చే అలా చెప్పిందనుకున్నారు.

"లోకో భిన్నరుచి... అన్నారులెండి పెద్దలు. ఒక్కొక్కరి అభిప్రాయం, ఒక్కోలా వుంటుంది. అవి వ్యక్తిగత అభిప్రాయాలు" అనేశాడు భైరవమూర్తి, నవ్వుతూ.

ప్రేమ మాత్రం ఏవీఁ మాట్లాడలేదు. భైరవమూర్తి భార్య అభిప్రాయాన్ని అడగనూలేదు.

రోడ్డుమీదికొచ్చి రెండు ఆటోల్ని బేరమాడుకున్నారు.

"మూర్తీ... వస్తాంరా!" చెప్పాడు రామరాజు.

"వస్తాను ప్రేమా!" దీప్తి చెప్పింది ప్రేమకి.

"అది సరేగాని... మా ఇంటిని మీ దంపతులు ఎప్పుడు పావనంచేస్తున్నారేవిఁటి?" అడిగింది ప్రేమ.

"రెండు మూడు రోజుల్లో వస్తాం ప్రేమా!" హామీయిచ్చింది దీప్తి.

"ఒరేయ్ రాజూ... పదిసార్లు మాచేత చెప్పించుకోకూడదు రా! నీ వివాహం జరిగి ఎన్నాళ్ళయ్యిందని? ఇంతవరకూ మీరు మాయింటికి రాలేదంటే, నీ సన్నిహిత స్నేహితుడనని చెప్పుకుందుకు నాకే సిగ్గుగా వుందిరా! రియల్లీ, అయామ్‌సారీ..." కాస్తంత బాధపడుతూనే అన్నాడు భైరవమూర్తి.

"నువ్వలా బాధపడిపోకురా! దీప్తి చెప్పింది కదా, రెండు మూడురోజుల్లో తప్పకుండా వస్తాం... కాస్త ఓపికపట్టుమరి..." నవ్వుతూ అన్నాడు రామరాజు.

"ఒరేయ్ ఫూల్... ఆమె చెప్పడమేవిఁట్రా? ఇటువంటి నిర్ణయాన్ని నువ్వే తీసుకుని, ముందుకు నడవాలి" నవ్వుతూనే అన్నాడు భైరవమూర్తి. కాని అతని మనసులో ఓ బాధ

మెదిలింది— రామరాజు దీప్తి చెప్పుచేతల్లోకి ఇప్పట్నుంచే పోతున్నాడేమోనని! అదే అతని కి ఇష్టంలేని విషయం.

భైరవమూర్తి మాటలవెనక భావాన్ని దీప్తి అవగాహనచేసుకుంది. కాని ఏమీ అనలేని పరిస్థితి ఆమెది.

రామరాజు మాత్రం తేలిగ్గా నవ్వేశాడు.

"అలాగేలేరా..."

"ఒరేయ్... రేపట్నుంచి రిహార్సిల్సు వున్నాయి. ఆ విషయం మర్చిపోకేం?" గుర్తు చేశాడు భైరవమూర్తి.

"గుర్తుందిలేరా... పోసివేయ్ ఆటోని..." అన్నాడు రామరాజు.

ఎవరి తోవ వాళ్ళు పట్టారు.

★ ★ ★

మర్నాడు ఆఫీసుకి బయల్దేరాడు రామ రాజు.

చిరునవ్వులొలకబోసుకుంటూ, భర్తకి ఎదురొచ్చింది దీప్తి.

నన్నగా నవ్వుతూ ఆమె చెక్కిలిపై ఓ చిటికె వేశాడు రామరాజు.

సిగ్గుతో దీప్తి చెక్కిళ్ళు గులాబీలే అయి నయ్.

"వస్తాను దీప్తీ... ఇవ్వాళ రిహార్సిల్సు వున్నాయి. ఓగంటో, రెండు గంటలో లేటవ్వు తుంది ఇంటికి రావడానికి" అన్నాడు రామ రాజు.

"మీరు ప్రాక్టీసుచేస్తోంది నాటికే కదండీ! ఒక్కగంటేకదా?"

ఆశ్చర్యంగా భార్యకేసి చూశాడు రామరాజు.

"అబ్బో... నాటిక, నాటకం వ్యత్యాసం తెలు సునాఏమిటి రాణీగారికి?"

"తెలుసునండీ! తెగ చదువుతానుకదా? నవలలు అందుబాటులో లేకపోతే నాటికలు, నాటకాలు చదివేదాన్ని"

"నాటకాలగురించి ఈపాటి అయినా నీకు పరిజ్ఞానంవున్నందుకు ఒక నటుడిగా ఎంతో గర్వపడుతున్నాను. బైదిబై... నీప్రశ్నకు సమా ధానంచెప్పాలి కదా? రిహార్సిల్స్‌కోసం అంద రూ ఒకేసారి వచ్చి రెడీగావుండరు. ఏవో సాకు లు చెప్పుకుంటూ లేటుగానే వస్తారు. మధ్యమ ధ్య డైరెక్టరుచెప్పింది రిపీట్‌చేస్తూ వుండాలి. అంచేత ఆలస్యం అనివార్యం"

"సరే- వెళ్ళిరండి" అంది.

రామరాజు నిష్క్రమించాడు.

దీప్తి ఇంట్లోపలికివచ్చేసి తలుపు వేసుకుని తన పనిలో నిమగ్నురాలయింది.

★ ★ ★

ఆఫీసులో శ్రద్ధగా పన్జేసేవాళ్ళలో రామరాజు ఒకడు. ఎప్పుడూ సీటులోనే వుంటాడు- రిసెస్‌పిరియడ్‌లో తప్పించి. అందుకనే రామ రాజు పట్ల ఆఫీసు సూపరింటెండెంటుకి, ఆఫీ సరుకి సదభిప్రాయంవుంది. అతనెప్పుడు షార్టు లీవు అడిగినా 'నో' అనరు.

భైరవమూర్తి, శ్రీపతుల విషయంలో భిన్నంగావుంటుందీ పద్ధతి. అనవసరంగా గొడ వపెట్టి, దౌర్జన్యంలోకి దిగుతారని, ముక్కుతూ, మూలుగుతూ అటువంటి పర్మిషన్సు ఇస్తూ వుంటారు.

మధ్యాహ్నం మూడుగంటలుదాటింది. రామరాజు శ్రద్ధగా పనిచేసుకుంటున్నాడు.

గుర్నాధం రామరాజు సీటుదగ్గరికొచ్చాడు.

"నమస్కారం రాజుగారూ!" అన్నాడు గు ర్నాధం.

"నమస్కారం... కూర్చోండి..." అన్నాడు రామరాజు.

రామరాజుకి అభిముఖంగా స్టూలుమీద కూచున్నాడు గుర్నాధం.

గుర్నాధం మరో ఆఫీసులో సీనియర్ అసిస్టెంటు- అతనూ నటుడే! అతనికో నాటక సమాజం వుంది. భైరవమూర్తిలానే చేతి డబ్బు ఖర్చుపెట్టి, నాటకాలు వేయించడం అతనికీ సరదాయే. అప్పుడప్పుడూ టిక్కెట్లుపెట్టి నాటి కాలువేసి, సమాజంకోసం, ఆర్థికపరిపుష్టి తీసు కొస్తూ వుంటాడు. లౌక్యం తెలిసిన వ్యక్తి.

గుర్నాధంగారు తన దగ్గరికి వచ్చాడంటే ఏదో విశేషం వుండేవుంటుందనుకున్నాడు రామరాజు.

"చెప్పండి గుర్నాధంగారూ... ఏమిటిలా దయచేశారు?" వినమ్రతతో అడిగాడు రామ రాజు. వయసులో తనకంటె పెద్దవారిని గౌర

వించడం అతనికి అలవాటు.

"ఈమధ్య ఎక్కడా రిహార్సిల్సు హడావిడీ అగుపించడంలేదు, ఏవిఁటి విశేషం రాజుగారూ? వివాహం అయ్యాక మీలో నాటకాభిరుచి తగ్గిందా ఏవిఁటండీ?" సన్నగా మందహాసం చేస్తూ అన్నాడు గుర్నాధం.

రామరాజు కించిత్ బాధపడ్డాడు. 'తనలో నాటకాభిరుచి తగ్గడమా? వివాహానికీ, నాటకాలకీ సంబంధం ఏవిఁటి?..' అనుకున్నాడు. మెల్లగా మందహాసం చేశాడు.



''నాకు వివాహమైనా, నాలోని నాటకాభిరుచి తగ్గదండీ! జన్మతః నాలో వుద్భవించిన అభిరుచి ఇది. చిన్నప్పట్నుంచీ నాటకాలువేస్తున్నాను... వేస్తాను. ఆ కళపట్ల నిరాదరణ యెప్పటికీ వుండదు. మీలాగే కొందరు నన్నీ ప్రశ్న వేశారు. వాళ్ళకీ ఇదే సమాధానంచెప్పాను. అసలువిషయం ఏమిటంటే, మా డైరెక్టరు శ్రీపతి, భైరవమూర్తి నాటిక ఎంపికచేయడంలో జాప్యంచేశారు''

''ఇంకా నాటిక ఎంపిక కాలేదనుకుంటాను'' ఎంపికకాకుండా వుండాలని మనసులో



కోరుకుంటూ అన్నాడు గుర్నాధం.

"ఎంపికచేశారండీ! ఈ వేళనించే రిహార్సి ల్సు ప్రారంభం"

నిరుత్సాహంతో నీరుగారిపోయాడు గుర్నాధం. ఆ అనుభూతి అతని మొహంలో స్పష్టంగా తారాడుతోంది.

"ఏం నాటిక ఎంపికచేశారండీ?"

రామరాజు ఇరకాటంలో పడ్డాడు. తనకి తెలిసినా, చెబితే ఏం కొంపమునుగుతుందోనన్న భయం మనసులో మెదిలింది. 'యాచకో, యాచకశత్రుః' అన్నట్టు, రెండునాటక సమాజాల సభ్యులు ఎంత స్నేహంగా వున్నా ఒకర్ని మించిపోవాలని మరొకరి ప్రయత్నం ఎప్పుడూ వుంటుంది. ఎంపికచేసిన నాటిక పేరు చెబితే గుర్నాధం సమాజమే దాన్ని చేపట్టినా ఆశ్చర్యంవుండదు. అప్పుడు తను నిందపడాల్సివస్తుందనుకున్నాడు. ఏదో ఆలోచిస్తున్నట్టుగా అభినయంచేశాడు. "ఏదో చెప్పాడండీ భైరవమూర్తి. పేరు చప్పున గుర్తుకు రావడంలేదు. ఇవ్వాళ రిహార్సిల్సుకి వెళ్తున్నానుగా, తర్వాత చెబుతాల్లెండి..." అన్నాడు రామరాజు.

గుర్నాధం ఓ నిట్టూర్పువిడిచాడు. "ఎంతో ఆశతో మీదగ్గరికి వచ్చానండీ..."

"ఏవిషయంలో?"

"మేం ఓ నాటకాన్ని టిక్కెట్టు పెట్టి ప్రదర్శించదలిచామండీ! అందుకు గాను, 'విజేత' అనే నాటకాన్ని ఎంపికచేసుకున్నాం. అందులో నాయకుని పాత్ర మీచేత వేయించాలని మా సభ్యులందరం తీర్మానించుకున్నాం. నాటకంలో మీరున్నారూ అంటే, టిక్కెట్లు హాట్ కేక్స్‌లా అమ్ముడుపోతాయన్న విశ్వాసం, నమ్మకం మాకున్నాయి. ఆ అభ్యర్ధనతోనే నేనిప్పుడొచ్చాను. చేతిలో ప్రస్తుతం మీకేం నాటకంలేదుకదా, మీరు తప్పక అంగీకరిస్తారనే ధైర్యంతో వచ్చాను. కాని, మీరు రిహార్సిల్సు ప్రారంభిస్తున్నారని నాకు తెలీదు"

"సారీసర్.... ఈరోజునించేకదా, మేం రిహార్సిల్సు ప్రారంభిస్తున్నది? మీ నాటకంలో నేనింక ఎలా యాక్ట్‌చెయ్యగల్ను? మీకు నిరాశ కలిగించినందుకు, నాకెంతో విచారంగా వుందండీ!"

అప్పుడే 'టీ' అమ్మేవాడొస్తే, రెండు టీలు తీసుకుని, గుర్నాధంకి ఒక గ్లాసులో ఇచ్చి, తనొక టీ- తీసుకున్నాడు రామరాజు.

'టీ'కి డబ్బులు గుర్నాధం ఇవ్వబోయాడు.

"నోసర్... మీరు నాగెస్టు... డబ్బులు మీరివ్వకూడదు" అంటూ తనే ఇచ్చాడు.

"ఏం చెయ్యడమా అని, ఆలోచిస్తున్నాను రాజుగారూ!" టీ సిప్‌చేస్తూ అన్నాడు గుర్నాధం.

"మీ శ్రీనివాసరావుగారున్నారు కదండీ, ఆయనచేత వేయించండి"

"ఆ అవకాశం ఎట్లానూ వుందనుకోండి. కాని, మీరావేషం వేస్తే వచ్చిన అప్లాజు, అతను వేస్తే రాదు. అదే నా తాపత్రయం... మా సమాజ సభ్యుల అభిమతం!!"

"కాని ఏంచేస్తాం? వీలులేదుకదా?"

"మీరు వేస్తున్నది నాటిక కదండీ! మీలాంటి నటులకి, అది కొట్టిన పిండిలాంటిదే! అంచేత మా నాటకంలోకూడా వెయ్యడానికి మీరు అంగీకరిస్తే, మీ మేలు ఎన్నటికీ మర్చిపోం" టీగ్లాసు ఖాళీచేసి టేబిలుమీద పెడుతూ అన్నాడు.

తననే ఆ వేషం వెయ్యమని గుర్నాధంగారు ఎందుకు అంత పట్టుబడుతున్నారో, రామరాజుకి అర్ధంకాలేదు.

"ఒకసారి రెండు నాటకాలు ప్రాక్టీసు చెయ్యడం నావల్ల అయ్యేపని కాదండీ, గుర్నాధంగారూ! అలా ప్రయత్నించడం వల్ల ఒక నాటకంలోని డైలాగులు మరో నాటకంలో దొర్లడానికి అవకాశాలువున్నాయ్. అదీగాక మా సమాజంవాళ్ళు ఒప్పుకోరేమో!"

రామరాజు దారిలో పడుతున్నట్టనిపించింది గుర్నాంధంకి. అతనిలోని ఆశ, ఇంకా సజీవంగా వుంది.

"మీ సమాజం అంటే, భైరవమూర్తేకదా? అతణ్ణి నేనెట్లాగో ఒప్పిస్తానండీ రాజుగారూ! అప్పుడు మీకు అభ్యంతరం వుండదనుకుంటాను?" ఆసక్తితో అన్నాడు.

భైరవమూర్తి ఎలాగూ ఒప్పుకోడని రామరాజుకి తెలుసు. బాధ్యతని తనపైవేసుకోదల్చలేదు. "భైరవమూర్తిని మొదట అడిగిచూడండి గుర్నాధంగారూ!" అన్నాడు.

గుర్నాథం హృదయం కాస్తంత తేలికపడింది.

"అలా అన్నారు, బావుందండీ రామరాజుగారూ! ఇప్పుడే వెళ్ళి భైరవమూర్తిని కలుస్తానుండండి" అంటూ లేచాడు గుర్నాథం.

సరిగ్గా అదే సమయంలో భైరవమూర్తి, శ్రీపతి రామరాజు దగ్గరికి వస్తున్నారు. వాళ్ళిద్దర్నీ చూశాడు గుర్నాథం.

"అదిగోండి భైరవమూర్తిగారు ఇటే వస్తున్నారు. అతనివెంట శ్రీపతిగారు కూడా ఉన్నారు. ఇప్పుడే తేలిపోతుంది- సమస్య..." అన్నాడు గుర్నాథం.

తన సమక్షంలోనే ఈ సమస్య పరిష్కారం కావడం మంచిదనిపించింది రామరాజుకి.

భైరవమూర్తి, శ్రీపతి, రామరాజు సీటు దగ్గరికి వచ్చేశారు. గుర్నాథంని అక్కడచూసి ఇద్దరూ విస్తుపోయారు. రామరాజు దగ్గరికి అతను వచ్చాడూ అంటే ఏదో విశేషం వుండొచ్చునను కున్నారు ఎవరి మనసులోవారు.

"నమస్కారమండీ భైరవమూర్తిగారూ!" అన్నాడు గుర్నాథం, వినయం పుట్టిపడేలా.

"నమస్కారం... నమస్కారం... ఏమిటిలా మా రామరాజు దగ్గరికి వచ్చారు?" అన్నాడు భైరవమూర్తి.

"వూరకరారు మహానుభావులు..." తనూ కలిగించుకున్నాడు శ్రీపతి.

గుర్నాథంని అక్కడ చూశాక భైరవమూర్తికీ, శ్రీపతికీ ఒకే ఒక్క అనుమానం వచ్చింది. అదేమిటంటే రామరాజుని తమ నాటక సమాజానికి లాగేయాలన్న ప్రయత్నంలో వచ్చి వుంటాడని. రాజకీయ పార్టీలకుమల్లె నాటక సమాజాలూ అట్లాగే వున్నాయని వారి భావన.

"మీ వూహ కరెక్టేనండీ శ్రీపతిగారూ! నేను వూరికనే రాలేదు. వూరికనే వచ్చానని అబద్ధం చెప్పను కూడాను ఒక అభ్యర్థనతో వచ్చాను-"

"ఏమిటండీ అది?" ప్రశ్నించాడు భైరవమూర్తి.

"మాసమాజం, 'విజేత' అనే నాటకాన్ని టిక్కెట్టుపెట్టి ప్రదర్శన ఇవ్వదలిచాం. మీకు తెలుసుకదా, ప్రతి సంవత్సరం ఒక నాటకంవేసి, సమాజానికి కొంత డబ్బు పోగు చేస్తున్నామని. ఇప్పుడూ అదే ప్రయత్నం. అయితే అందులోని నాయకపాత్రకి, రామరాజుగారే బాగా సూట్ అవుతారని మా సభ్యులందరూ ఏకగ్రీవంగా ఒప్పుకున్నారు. ఆయన్ని రిక్వెస్టు చేసి, ఆ పాత్రను ధరించమని కోరుతున్నాను. కాని, ఆయన ఒప్పుకోవడంలేదు. ఈవేళ నుంచే కొత్త నాటిక ప్రారంభిస్తున్నారటగా! అంచేత రెండూ ఒకేసారి ప్రాక్టీసు చెయ్యడం వీలుపడదంటున్నారు. అదీగాక సమాజం అనుమతి లేనిదే, తాను ఎక్కడికీ వెళ్ళనని చెబుతున్నారు. అనుమతి తీసుకుందుకు మీదగ్గరకే బయల్దేరుతున్నాను... ఇంతలో మీరే వచ్చారు. ఇదీ విషయం మూర్తిగారూ! మీరు అనుమతిస్తే, రాజుగారిని ఎలాగో ఒప్పిస్తాను" అంటూ ముగించాడు గుర్నాథం.

భైరవమూర్తి ఓసారి శ్రీపతికేసి చూశాడు. శ్రీపతి ఆ సమాజానికి దర్శకుడు కావడంవల్లనే, అతని అభిప్రాయం తెలుసుకుందుకు అతనికేసి చూశాడు. శ్రీపతి తన అసమ్మతిని కళ్ళతోనే తెలియజేసినట్టున్నాడు... భైరవమూర్తి గుర్నాథంకేసి తిరిగాడు.

"గుర్నాథంగారూ... మా రామరాజు నటనా కౌశలానికి విలువిచ్చి, మా అనుమతికోసం వచ్చారు మీరు. అందుకు ధన్యవాదాలు చెప్పుకుంటున్నాను. ఎందుకూ అంటే సమాజంలోని ఓ నటునికిచ్చిన విలువంటే, అది సమాజానికే గర్వకారణం. అంతవరకూ బాగానే వుంది. కాని మా రామరాజు తీరిగ్గా లేడుకదా! ఈరోజు నుంచే కొత్త నాటిక రిహార్సల్సు ప్రారంభిస్తున్నాం. మేం రిహార్సిల్సు ఎంత పకడ్బందీగా సాగిస్తామో మీకు తెలీందికాదు. ఈ నాటికను పరిషత్తులకు తీసుకుపోయే వుద్దేశం కూడా వుంది. అందుచేత రామరాజుని ఏట్టి పరిస్థితిల్లోనూ, మీ నాటకంలో వేషం వేసేందుకు అనుమతి ఇవ్వలేమండీ! మరోవిధంగా భావించరనే ఆశిస్తున్నాను" అన్నాడు భైరవమూర్తి.

రామరాజు తృప్తిగా వూపిరిపీల్చుకున్నాడు. భైరవమూర్తి అనుమతి ఇచ్చివుంటే, తను ఇబ్బందిలోపడి వుండేవాడు... అనుకున్నాడు.

అంత ఖచ్చితంగా భైరవమూర్తి చెప్పినప్పుడు గుర్నాథం మాత్రం ఇంకేం చెయ్యగలడు!

"మీరు అనుమతి ఇవ్వకపోతే నేనుగాని, రామరాజుగారుగాని, చేయగలిగిందేమీలేదు. వస్తానుమరి... వస్తానండీ రామరాజుగారూ..." అంటూ మొహం మాడ్చుకుంటూ అక్కణ్ణించి నిష్క్రమించాడు గుర్నాధం.

"మనమే అక్కడికి తెలివితక్కువవాళ్ళమని అనుకుంటున్నాడుగామోసు గుర్నాధం" అన్నాడు శ్రీపతి.

"వాడిమొహం... వాడి వుచ్చులో ఎవరు పడతారు? ఈవిధంగా రామరాజుని, మన సమాజాన్ని దెబ్బతియ్యాలనుకున్నాడేమో!" అన్నాడు భైరవమూర్తి.

"ఎందుకయినా మంచిది రామరాజూ, నువ్వు జాగ్రత్తగా వుండు" సలహా ఇచ్చాడు శ్రీపతి.

రామరాజు ఏం మాట్లాడలేదు. "ఒరేయ్ రాజూ... నువ్వు ఆఫీసునించి నేరుగా రిహార్సిల్సు రూమ్‌కి వచ్చేయ్..." అన్నాడు భైరవమూర్తి.

"అలాగేరా!"

భైరవమూర్తి, శ్రీపతి, అక్కణ్ణించి నిష్క్రమించారు.

రామరాజు గట్టిగా ఓ నిట్టూర్పు విడిచాడు. నాటకరంగంలోనూ రాజకీయాలు చోటుచేసుకుంటున్నాయనిపించిందతనికి. పనిలో నిమగ్నుడయ్యాడు.



నాటకం రిహార్సిల్సు వేయించడమంటే అంత సులువేంకాదు. అదో యజ్ఞంలాంటిది. బాధ్యత తీసుకున్న వ్యక్తి బుర్ర పాడయిపోతుందన్నా అతిశయోక్తికాదేమో!

నాటికగాని, నాటకంగాని- అందులో స్త్రీ పాత్రలుంటే, ఆ పాత్రధారిణులు కిరాయికి తెప్పించుకున్నవాళ్ళవడం మూలాన్న ప్రారంభంనుంచీ రిహార్సిల్సుకి వాళ్ళుండరు. నాటకం తేదీకి కొద్దిరోజులు ముందునుంచీ రిహార్సిల్సుకి వస్తారు. అదీ ఉన్నవూరైతేను! పైవూరయినా, పై రాష్ట్రమయినా వారంరోజులు ముందుగా వాళ్ళొచ్చి రిహార్సిల్సు జరపడం పరిపాటి. ఇహపోతే మిగతావారందరూ వుండి, రిహార్సిల్సు జరిపిన రోజులు చాలా తక్కువనే చెప్పాలి. ఎవరో ఒకరు, ఏదో ఒక కారణంతో రావడం మానేసినా, మిగతావాళ్ళంతా రిహార్సిల్సు చెయ్యవల్సిందే. ఎంతో డిసిప్లిన్ వున్న సమాజాల్లో మాత్రం రిహార్సిల్సు సక్రమంగా సాగుతుంటాయి.

రామరాజు రిహార్సిల్సు రూమ్‌కి వెళ్ళేసరికి అక్కడ భైరవమూర్తి, శ్రీపతి, శంకరం మాత్రమే వున్నారు. రామరాజు వెళ్ళి కూచున్నాడు లోపల.

"మరీమరీ చెప్పాను అందరికీను... ఇంతవరకూ ఎవ్వరూ అగుపించడంలేదు. వాళ్ళందరి మాటకేంగాని జయదేవ్, రామం వచ్చేస్తే నాటిక ప్రారంభించేద్దాం కదా!" అన్నాడు భైరవమూర్తి.

"అలా అని, వాళ్ళకోసం ఎంతసేపు ఇలా నిరీక్షిస్తూ కూచుంటాం?" అన్నాడు శంకరం.

"ఔను మూర్తీ... వాళ్ళకోసం ఇలా సమయం వృథా చేసుకుని కూచోవడం ఏం బావుంటుంది? ప్రారంభమే కదా, ఏదో విధంగా కానిచ్చేద్దాం. రేపట్నుంచి వాళ్ళని ఖచ్చితంగా రమ్మని చెబుదాం" శంకరంని సపోర్టు చేశాడు రామరాజు.

రామరాజు చెప్పిందాన్ని అక్కడ ఎవరూ కాదనరు.

"రామరాజు చెప్పినట్టే చేద్దాంరా మూర్తీ!" అన్నాడు శ్రీపతి "ఓ.కే. నువ్వే కొబ్బరికాయ కొట్టేయ్... లేడీ ఆర్టిస్టు మరో నాలుగయిదురోజులవరకూ రాదు గాబట్టి, ఆమె పోర్షను నువ్వే చదివేయ్। జయదేవ్, రామం రాలేదుకదా వాళ్ళ పోర్షను నేను చదువుతాను..."

"సరే... ప్రార్థన చేద్దాం... లేచినుంచోండి" అన్నాడు శ్రీపతి. అందరూ నుంచున్నారు.

వేపుడుకో పాన్
నిండు నూనెలో వేయించటానికో బాణలీ
మగ్గ వెట్టటానికో పాత్ర
ప్రెషర్ కుక్ చేయటానికి మరో నాల్గవ పాత్ర
ఉపయోగించే ప్రతి గృహిణికి

ముచ్చటైన మూడు ముక్కల సలహా

# ప్రెస్టీజ్
## ప్రెషర్ పాన్

ఎంత చేయగల్గుతుందో
ఎంత త్వరితంగా
చేయగల్గుతుందో కనిపెట్టండి




**Prestige**
**PRESSURE PAN** ©

సాధారణమైన మరియు ఎత్తైన మూతలలో లభ్యమవుతుంది.
మీవద్ద ప్రెస్టీజ్ ప్రెషర్‌కుక్కర్ ఉంటె మూత
అక్కరలేకుండా మీరు ప్రెషర్‌పాన్ మాత్రం కొనుక్కోవచ్చు

ttk తయారీ

"ఒరేయ్ రాజూ... నువ్వే ప్రార్థన ప్రారంభించరా... అది మనకి మంచిశకునం" అన్నాడు భైరవమూర్తి.

"పరబ్రహ్మ... పరమేశ్వర..." అంటూ ప్రార్థన ప్రారంభించాడు రామరాజు. మిగిలినవాళ్ళు అతని గొంతుతో గొంతుకలిపారు. పాట పూర్తయ్యింది. శ్రీపతి కొబ్బరికాయ కొట్టాడు.

అప్పుడొచ్చారు జయదేవ్, రాము. "ఆలస్యమైపోయింది సార్! మరేం అనుకోకండి" అంటూ సంజాయిషీ చెప్పుకుని లోపలికి వచ్చారు.

శ్రీపతి గంభీరంగా వాళ్ళకేసి చూశాడు.

"ఏరంగంలోనయినా క్రమశిక్షణ చాలా అవసరం. నాటకరంగంలో మరీ అవసరం. ఎందుకూ అంటే, అసంఖ్యాకమైన ప్రజల సమక్షంలో నాటకాన్ని ప్రదర్శిస్తాం గనక. పకడ్బందీగా దాన్ని అధ్యయనం చెయ్యాలి. మీరు యువకులు. వృద్ధిలోకి రావల్సిన వాళ్ళు... క్రమశిక్షణ పాటించండి" అన్నాడు.

"అలాగేసార్. మరెప్పుడూ లేటవ్వం..." అన్నాడు, జయదేవ్.

"ఎస్‌సార్..." వంతకలిపాడు రాము.

"సరే... ఈ మాటలే గుర్తుంచుకోండి... మనం ఇక రిహార్సిల్సు ప్రారంభిద్దాం. ఎవరెవరు ఏ పాత్ర ధరించాలో, నేనూ, భైరవమూర్తి, ముందుగానే నిర్ణయించాం" అంటూ యెవరెవరు యే పాత్ర వెయ్యాలో చెప్పాడు.

సిటింగ్ రిహార్సిల్సు ప్రారంభమయ్యాయి. నాటిక పూర్తిగా చెప్పేసరికి థ్రిల్లింగ్ అనిపించిందందరికీను.

"నాటిక ఎలా వుందంటారు?" అడిగాడు భైరవమూర్తి.

"చాలా బావుందండీ- మంచి సెలెక్షను" అన్నాడు శంకరం.

"ఏమ్రా రాజా నీ అభిప్రాయం చెప్పావు కాదు"

"చాలా మంచి నాటిక ఎంపిక చేశార్రా పరిషత్తుల్లో ఈ నాటిక నిలబడగలదనిపిస్తోంది" అన్నాడు రామరాజు.

"నువ్వు చెప్పావంటే, దానికి తిరుగుండదు. లెటజ్ సీ..."

"అన్నట్టు, మనం తీసుకున్న నాటిక ఏమిటో తెలుసుకోవాలని గుర్నాథం ప్రయత్నించాడ్రా మూర్తీ..."

"అలాగా... నువ్వు చెప్పావా?"

"నాకు గుర్తులేదని చెప్పాను."

"మంచిపనిచేశావు. నాటిక రిహార్సిల్సు ప్రారంభించాం గాబట్టి, ఇప్పుడు వాళ్ళు తెలుసుకున్నా ఇబ్బంది వుండదులే"

తర్వాత కాసేపు పిచ్చాపాటీకొట్టి ఎవరింటికి వాళ్ళు వెళ్ళిపోయారు.

★ ★ ★

గోడగడియారం ఏడుగంటలు కొట్టింది.

దీప్తి గడియారంకేసి చూసింది. గంటలు లెక్కబెట్టలేదుగనక, అలా చూసిందామె. భర్త రాకకోసమే ఎదురుచూస్తోంది. ఈసరికి రిహార్సిల్సు ముగిసే వుంటాయని వూహిస్తోంది.

విసుగ్గా టీపాయ్‌మీదున్న సినీమా పత్రికను తీసి తిరగెయ్యటం ప్రారంభించింది.

సరిగ్గా అప్పుడే తలుపు తట్టిన శబ్దం... చప్పున వెళ్ళి తలుపు తీసింది. ఎదురుగా భర్తే.

"వచ్చేశారా? ఇంకా ఏంరాలేదా అని అనుకుంటున్నాను" అంది.

"రిహార్సిల్సులో కూచున్నామంటే అప్పుడప్పుడూ జాప్యం జరుగుతుంది. ఈరోజు ప్రారంభోత్సవం గాబట్టి త్వరగా తెమిలిపోయాం" అంటూ లోపలికి వచ్చాడు రామరాజు.

దీప్తి తలుపు వేసుకుని వస్తూ- "అంటే ఇంకా ఆలస్యంగా రావటం జరుగుతుందన్నమాట..." అంది దిగులుగా.

"అని కాదుగాని, ఆలస్యం జరగొచ్చునని అంటున్నాను..." సోఫాలో కూలబడ్డాడు.

"త్వరగా వచ్చేయడానికి ప్రయత్నించండీ! నాకు ఎంత బోరుగా వుంటుందో వూహించారా?"

రామరాజు సన్నగా నవ్వాడు.

"ఊహించలేకకాదు దీప్తీ! కాని నటజీవితంలో ఈ విలంబన తప్పదు. నేనింకా నయం. కొందరైతే రాత్రి పన్నెండువరకూ ఇల్లు చేరరు"

"ఆ కొందరులో మీరు చేరకపోతే చాలు..."

నవ్వేసింది దీప్తి.

"ఇవ్వాళ మరో సమాజంవాళ్ళు తమ నాటకంలో హీరో వేషం వెయ్యమని అభ్యర్థిస్తూవచ్చారు."

నాటకం రిహార్సిల్సు గుర్తుకు తెచ్చుకుని కాస్త షాక్ తింది దీప్తి.

"ఒప్పుకున్నారా ఏవిటండీ?" ఆత్రంగా అడిగింది.

"అబ్బే... ఎలా ఒప్పుకుంటాను. ఈ రెండింటి రిహార్సిల్సు పూర్తయ్యేసరికి అర్ధరాత్రి అవుతుంది. నువ్వు ఒంటరిగా వుండొద్దూ? అందుకే నేను అంగీకరించలేదు" చిన్నగా నవ్వుతూ అన్నాడు రామరాజు.

పెద్ద రిలీఫ్ వచ్చినట్టుగా ఓ నిశ్వాసం వదిలింది దీప్తి.

"హమ్మయ్యా! రక్షించారండీ! ఒప్పుకున్నారేమోనని హడిలిపోయాను"

"నీకోసమే కదా మానేసింది...?" నవ్వుతూనే అన్నాడు.

"అందుకు ధన్యవాదాలు చెప్పుకుంటున్నాను. కూచోండి. కాఫీ తీసుకొస్తాను" అంటూ వెళ్ళబోయింది దీప్తి.

"ఇప్పుడేం కాఫీ దీప్తీ? ఆకలి చచ్చిపోతుంది. ఏకంగా భోజనం చేద్దాం... స్నానం చేసి వస్తానుండు..." అంటూ లేచి దుస్తులు మార్చుకుని బాత్రూమ్‌కేసి నడిచాడు రామరాజు.

దీప్తి కూనిరాగాలు తీసుకుంటూ వంటగది వేపు నడిచింది.

★ ★ ★

ఆరోజు ఆదివారం.

రామరాజు కూరగాయలు తీసుకురావడానికి మార్కెట్టుకి వెళ్ళాడు. ఒకసారి మార్కెట్టుకి వెళ్ళాడూ అంటే నాలుగురోజులకు సరిపడా కూరగాయలు తీసుకొచ్చేస్తూ వుంటాడు. అల్లం, పచ్చిమిరప దగ్గర్నించి ఏ ఒక్క వస్తువూ మర్చిపోకుండా తీసుకొస్తాడు. ఏ చిన్న వస్తువుకయినా ఇరుగుపొరుగింటికి అప్పుకెళ్ళడం అతనికి ఇష్టముండదు. ఆ విషయం భార్యకి చెప్పాడు కూడాను. అందుకే మార్కెట్టులో ఆలస్యమవుతుంది సాధారణంగా.

ఉదయం పదిగంటలు దాటింది. మార్కెట్టుకి వెళ్ళిన భర్తకోసం ఎదురుచూస్తూ ద్వారం దగ్గరే నిల్చుంది దీప్తి.

అప్పుడే టి.వి.యస్.మీద వచ్చిన భైరవమూర్తి బండిని ఆపి వచ్చాడు రామరాజు ఇంటికి.

దీప్తి లోపలికి వెళ్ళిపోలేదు.

"రామరాజు లేడాండీ?" ప్రశ్నించాడు భైరవమూర్తి.

"లేరండి... బజారెళ్ళారు. ఆదివారంకదా, ఉదయం బజారుకెళ్తారు" అంది.

ఆమె మాటల్లోని భావాన్ని అర్థంచేసుకున్నాడు మూర్తి. బజారుకెళ్ళారని తెలిసికూడా ఎందుకొచ్చారని ఆమె అభిమతమై వుండొచ్చు ననుకున్నాడు.

"ఇప్పుడొచ్చేస్తాడంటారా?"

"రావొచ్చు..."

"వాడు వచ్చేవరకూ కూచుంటానయితే..." అన్నాడు భైరవమూర్తి.

ఆలోచనల్లో పడింది దీప్తి. కూర్చోనివ్వకపోతే భర్త కోపగించుకుంటారేమోనని భయపడింది.

"సరే... కూచోండి..." అంటూ లోపలికి దారిచ్చింది.

భైరవమూర్తి లోపలికొచ్చి సోఫాలో కూచున్నాడు. దీప్తి మాత్రం ద్వారం దగ్గరే నిల్చుంది.

భైరవమూర్తి ఆమెకేసే చూస్తున్నాడు. కానీ ఆమెమాత్రం వీధిలోకి చూస్తోంది.

"ఓ గ్లాసుడు చల్లని నీళ్లు ఇస్తారా?" అడిగాడు.

వినురుగానే లోపలికెళ్ళింది దీప్తి. గ్లాసుతో నీళ్ళుతెచ్చి టీపాయ్‌మీద పెట్టింది.

"మీకు నామీద కోపం ఇంకా పోలేదన్న మాట?" అంటూ గ్లాసుతో మంచినీళ్ళు తీసుకున్నాడు.

"చూడండి భైరవుడుగారూ... ఒకసారి నా చేతిదెబ్బ చవిచూశారు. మళ్ళీ అటువంటి అవకాశానికి తావివ్వకండి. అది మీకూ, నాకూ శ్రేయస్కరం. మరో విషయం- మావారు ఇంట్లో లేని సమయంలో మీరు రావద్దు. అది నాకు ఇష్టంలేదు" కోపంగానే అంది దీప్తి.

దీప్తి ప్రాక్టికల్‌గా ఇప్పుడు చెంపదెబ్బ కొట్టక పోయినా ఆమె మాటలు మరో చెంపదెబ్బలా పనిజేశాయి. అవమానంతో మొహం మాడిపోయింది.

"పెద్ద పతివ్రతలా ప్రవర్తిస్తున్నానని మనసులో మురిసిపోకు దీప్తీ! మళ్ళీ నన్ను అవమానించావు. దీనికి ప్రతిఫలం పొందకుండా వుండవు... సరే-మీ ఆయనొస్తే చెప్పు సాయంత్రం రిహార్సిల్సు వుండవని..." అనేసి విసురుగా వెళ్ళిపోయాడు బైటికి.

భైరవమూర్తి మోపెడ్‌ని విసురుగానే స్టార్ట్ చేసి సాగిపోయాడు. అతని హృదయం జ్వలిస్తోంది. దీప్తిపట్ల వుండే కక్ష ఇనుమడించింది. ఆమెకి తగిన పాఠం నేర్పాలనుకున్నాడు.

భైరవమూర్తి మాటలకి దీప్తి భయపడలేదు. అయితే ఈ నిజాలన్నీ భర్తముందుంచడమా, దాచడమా అనే సందిగ్ధంలో పడింది. భైరవమూర్తంటే భర్తకిగల గౌరవం, అభిమానం చూసి ప్రస్తుతానికి అటువంటి ప్రయత్నం మానుకోవాలనే నిర్ణయించుకుంది. పరిస్థితుల్ని ఎదుర్కోవాలనే నిశ్చయించుకుంది.

రామరాజు సైకిలు బెల్లువిని ఆలోచనాలోకంనించి బైటపడి వాస్తవంలోకి వచ్చింది దీప్తి.

"ఏమిటండీ ఇంత ఆలస్యమయిందీరోజు?" అంటూ కూరగాయలసంచి అందుకుంది.

"మార్కెట్టులో ఎవరో ఒకరు కలుస్తూనే వుంటారు దీప్తీ! ఎవర్ని తప్పించుకుని వచ్చేస్తాం చెప్పు! అందుకే ఆలస్యమయింది" అంటూ లోపలికి వచ్చేశాడు రామరాజు.

"మీ ఫ్రెండు భైరవమూర్తిగారు వచ్చారండీ..."

"వుండమనలేకపోయావా?"

"కాసేపు కూచుని వెళ్ళిపోయారు. ఈరోజు రిహార్సిల్సు లేవట. అది చెప్పడానికి వచ్చారు..."

"సరేలే... రిహార్సిల్సు లేకపోతే మరీ మంచిది. మనం సినిమాకి పోదాం..." అంటూ దుస్తులు మార్చుకుందుకు వుపక్రమించాడు రామరాజు. దీప్తి వంటగదికేసి వెళ్ళిపోయింది.

★ ★ ★

రోజులు వేగంగా సాగిపోతున్నాయి. అనుకున్నట్టుగానే రామరాజు దంపతులు భైరవమూర్తి ఇంటికి వెళ్ళారు.

రామరాజు దంపతులు అన్యోన్యంగా, హాయిగా కాలం గడుపుతున్నారు. దీప్తిలాంటి అందమైన అనుకూలవతిని భార్యగా పొందినందుకు రామరాజు మనసులో ఆనందించడమే కాదు... గర్వపడుతుండేవాడు. అటువంటి అదృష్టాన్ని తనకి అందించినందుకు భగవంతునికి కృతజ్ఞత చెప్పుకునేవాడు.

దీప్తి కూడా తన అదృష్టానికి మురిసిపోతోంది. రామరాజువంటి సహృదయుడు, కళాకారుడు తనకి భర్త కావడం తన పూర్వజన్మ సుకృతమని భావించేది.

అయితే వీళ్ళిద్దరి ఆనందాన్నీ, అనురాగాన్నీ, అన్యోన్యతనీ, అభిలషించని వ్యక్తి భైరవమూర్తి.

అతని ఈర్ష్యా ద్వేషాలు స్నేహితుడు రామరాజుపైకాదు. దీప్తి ఆనందాన్నిచూసి కళ్ళల్లో నిప్పులు గుమ్మరించుకుంటున్నాడు. ఆమె సుఖశాంతుల్ని సహించలేకపోతున్నాడు.

దీప్తి తన చెంపమీద కొట్టి, అవమానించిన ఆరోజు, భైరవమూర్తి హృదయఫలకంమీంచి చెరిగిపోలేదు. ఎంత ప్రయత్నించినా ఆ సంఘటనని విస్మరించలేకపోతున్నాడు. ఆ ప్రతీకార జ్వాలలు గుండెల్లో రగిలి, అతణ్ణి దహించి వేస్తున్నట్టవుతోంది.

ఆమెపై కక్ష తీర్చుకోవాలన్న కోరిక రోజురోజుకి ప్రబలమౌతూ వస్తోందతని అంతరంగంలో. అయితే ఎలా కక్ష తీర్చుకోవాలి...? అదే అతనిలో నిరంతరం ప్రతిధ్వనిస్తోన్న ప్రశ్న! ఆమెతో పరిచయం చేసుకోడానికే సరైన వాతావరణం ఏర్పడ్డంలేదే! తనని చూస్తూనే ఆమె ఏహ్యాభావంతో మొహం తిప్పుకుంటోంది. తనతో మాట్లాడ్డానికే ఆమె సుముఖంగాలేదే! ఆమె కళ్ళల్లో తీక్షత, మొహంలో గంభీరత, మాటల్లోవాడి తనని ముందుకు సాగనివ్వడంలేదు. అయితే ఎలా?

సిగరెట్ ఒకదానివెనక మరొకటి కాలుస్తూ. ఆలోచిస్తున్నాడు భైరవమూర్తి.

'ఆనందభైరవి' సినిమాచూసి వచ్చాక, దీప్తి తనకి భైరవిపాత్ర నచ్చిందని చెప్పడంలో ఆంతర్యం ఏమిటి! ఆమె వ్యక్తిత్వం గురించి

తాను తెలుసుకోవాలన్నదే ఆమె హెచ్చరిక అయ్యుంటుందేమో... అనుకున్నాడు భైరవ మూర్తి. పరిపరి విధాల ఆలోచిస్తున్నా తన అంతరంగంలో రగులుతోన్న జ్వాలల్ని ఎలా చల్లార్చడమో అతని ఊహకందడంలేదు.

ఆలోచిస్తూనే వున్నాడు భైరవమూర్తి. యాష్ ట్రే సిగరెట్ పీకలతో నిండిపోయింది. అతని మెదడులో రకరకాల భావాలు మెదులుతు న్నాయ్. ఆమె సాగిస్తోన్న ఆనందమయ జీవి తంలో చిచ్చురేపాలి. నిప్పులు పోయాలి. ఆమె కన్నీటిని కళ్ళారా చూడాలి. అప్పుడుగానీ తనకు జరిగిన అవమానానికి ప్రతీకారం జరగ దు. అది ఎలా?

ఆమె గురించి అబద్ధాలు సృష్టించి, రామ రాజులో అనుమానపు బీజాలు నాటితే అతను నమ్ముతాడా? అప్పుడామె తనని నిలదీసి నిందకు గురిచేస్తే? ఆనాటి సంఘటన రామరా జుకి ఆమె చెబితే- అబ్బే... ఇది లాభంలేదు. ఆమెని ఇరకాటంలో పెట్టబోయి, తనే ఇరుక్కు పోయే అవకాశాలు అధికంగా వున్నాయి. దాంతో రామరాజు తనతో స్నేహానికి స్వస్తిచెప్పి, దూరమవ్వడానికి అవకాశం వుంది... అనుకు న్నాడు భైరవమూర్తి.

మళ్ళీ మెదడుకి పని కల్పించాడు భైరవ మూర్తి. తాను బైటపడకుండా దీప్తిపై కక్ష తీర్చుకోవాలి. ఆలోచించాడు... తళుక్కున అతని మెదడులో ఓ ఆలోచన విద్యుల్లతలా మెరిసింది. అంతే! భైరవమూర్తి ఆనందానికి అవధుల్లేకపోయాయి. తనలో తానే తృప్తిగా నవ్వుకున్నాడు. కాలుస్తోన్న సిగరెట్టుని కసిగా నలిపేసి యాష్ట్రేలో పడేశాడు. అప్పుడుగాని అతనికి నిద్రపట్టలేదు.

'కక్ష' మనిషిలోని మానవత్వాన్ని నిర్దాక్షి ణ్యంగా చంపేస్తుంది. మంచీ చెడూ అన్న విచక్షణాజ్ఞానాన్ని మంటగలుపుతుంది. ఒక్కొ క్కప్పుడు సర్వనాశనానికి దారితీస్తుందనటంలో సందేహంలేదు. రామ రావణ యుద్ధానికి, మహాభారత సంగ్రామానికి మూలహేతువు 'క క్ష'గాక మరేమిటి?

★ ★ ★

సాయంత్రం అయిదుగంటలు కావస్తోంది.

రామరాజు తలదించుకుని దీక్షగా పనిచేసు కుంటున్నాడు.

కొన్ని ఆఫీసుల్లో కొందరు, సాధారణంగా సాయంత్రం నాలుగ్గంటలకే కలాన్ని మూసేసి జేబుల్లో తగిలించేస్తారు. అక్కణ్ణించి పిచ్చా పాటి ప్రారంభమవుతుంది. అయితే వాళ్ళు వంచి శ్రద్ధగా పనిచేసేవాళ్ళూ లేకపోలేదు. తమకిస్తోన్న జీతాలకి న్యాయం చేకూర్చాలన్న దే వారి ధ్యేయం. అది సిన్సియారిటీకి ప్రతీక! కర్తవ్యానికి కాణాచి! అటువంటి వారికోవకే చెందుతాడు రామరాజు.

అధికారులు కూడా అందుకే రామరాజుని అభిమానిస్తారు.

అప్పుడే అక్కడికి వచ్చిన భైరవమూర్తికి రామరాజు సిన్సియారిటీ నచ్చలేదు.

"ఏమిట్రా రాజూ... నువ్వే గొప్పదేశభక్తు డిలా, వంచినతల ఎత్తకుండా పన్జేస్తున్నావు? నేనొచ్చి నిల్చున్నానని కూడా గమనించలే దంటే, అంతగా పనిలో లీనమయ్యావన్న మాట" అన్నాడు సిగరెట్‌పొగ వదుల్తూ భైర వమూర్తి.

రామరాజు తలెత్తి సన్నగా మందహాసం చేశాడు.

"చాలాపని పెండింగులో పడిందిరా మూ ర్తీ! ఈమధ్య తీరిక లేకపోయిందికదా! అందు కే అప్టుడేట్ చెయ్యాలని ప్రయత్నిస్తున్నా నురా"

భైరవమూర్తి అదోలా నవ్వేడు. ఆ నవ్వులో వెటకారం ధ్వనించింది.

"నువ్వు బొత్తిగా తెలివితక్కువవాడిలావు న్నావురా రాజూ! పెండింగు లేకుండా పనంతా ఎప్పటికప్పుడు పూర్తి చేసేస్తుంటే, మనకింక విలువేముంటుందని? మనసీటులో మనకి బదులు ఎవరో కొత్తవ్యక్తిని వేశారనుకో! పనంతా పూర్తిచేసుకుని కూచుంటే, ఆ సెక్షన్ని నడ పడం, ఆ వ్యక్తికి సులువైపోదూ? అప్పుడు మన అవసరం ఏముంటుందని? మన ప్రాము ఖ్యత పై అధికార్లకి ఎట్లా తెలుస్తుందని? ఆఫీసుపనిలో ఇది కీలకమైన విషయం. అందుకేరా బ్రదర్... నేను ఆపామాపీగా పనిచే స్తూవుంటాను..." తన థియరీని చెప్పుకుపో యాడు భైరవమూర్తి.

భైరవమూర్తి అభిప్రాయం, అతని థియరీ

పూర్తిగా తప్పని రామరాజుకి తెలుసు. అతని నైజం తెలిసినవాడు గనక వాదించడం ఇష్టంలేకపోయింది.

భారంగా ఓ నిట్టూర్పు విడిచాడు రామ రాజు.

"సరేలేరా మూర్తీ... 'లోకో భిన్నరుచిః' అన్నారు పెద్దలు. ఎవరి అభిప్రాయాలు వారివి. నాకు మాత్రం ఎవరిచేతనయినా మాటపడ్డం ఇష్టముండదు. అయినా మనం జీతానికి తగిన న్యాయంచేకూర్చాలికదా! సరేగాని... నువ్వు అప్పుడే వెళ్ళిపోయే ప్రయత్నంలో వున్నావా?"

"కనిపించడంలా? నా సీటు వదిలేసి అప్పుడే పదినిముషాలు దాటింది. నువ్వా లేరా... ఆ ఫైళ్ళన్నీ లోపలపెట్టు. శ్రీపతి మనల్ని ఎక్కడికో తీసుకెళ్తానంటున్నాడు. మన కోసం నిరీక్షిస్తున్నాడు. తొందరగా తెములు" అన్నాడు. సిగరెట్ పొగను సుతారంగా వదుల్తూ.

"ఎక్కడికట?" ప్రశ్నవేశాడు రామరాజు.

భైరవమూర్తికి అటువంటి ప్రశ్నలు మనస్కరించవు.

"అది నేను చెప్పలేను. శ్రీపతి చెప్తాడులే. బయల్దేరు ముందు. తోవలో వివరాలన్నీ తెలుసుకుందువుగాని..." విసుగ్గా అన్నాడు భైరవ మూర్తి.

క్షణం ఆలోచనలోపడ్డాడు రామరాజు. నాటకాలకి సంబంధించి ఏదో విశేషం వుండొచ్చునను కున్నాడు.

"సరే... వస్తానుండు" అంటూ పెన్నుమూసి జేబులోపెట్టాడు.

టేబులుమీదున్న ఫైళ్ళు, కాగితాలు సర్దేసి బయల్దేరాడు రామరాజు.

భైరవమూర్తి సన్నగా నవ్వుకున్నాడు.

వీళ్ళిద్దరికోసం రోడ్డుమీద నిరీక్షిస్తున్న శ్రీపతి వీళ్ళని చూడగానే-

"ఇంత ఆలస్యమేమిత్రా?" ప్రశ్నించాడు.

"ఇదిగో ఈ బుద్ధిమంతుడు కుర్చీలోంచి లేస్తేనా! వీడొక్కడే దేశాన్ని ఉద్ధరిస్తున్నట్టు దించిన తల ఎత్తకుండా పనిచేస్తున్నాడంటేనమ్ము" రామరాజుకేసి చూపిస్తూ అన్నాడు భైరవమూర్తి.

శ్రీపతి రామరాజుకేసి చూశాడు. "ఏరా రాజూ... పెళ్ళయ్యాక మరీ బుద్ధిమంతుడివైపోతున్నావా ఏంటిరా?" చిన్నగా నవ్వుతూ అన్నాడు శ్రీపతి.

"అబ్బే... అదేంలేదురా— నా సంగతి నీకు తెలుసుకదా, ఎప్పుడూ ఒక్కలానే వుంటాను. ఎటొచ్చీ ఉద్యోగరీత్యా మన బాధ్యతల్ని నిర్వర్తించాలిగదా? ఆఫీసుపని కాస్త పెండింగ్‌లో పడిందిరా. అది పూర్తి చేసుకోడానికి అదనంగా శ్రద్ధతో పనిచెయ్యాల్సి వస్తోందంతే"

శ్రీపతి భైరవమూర్తి కోవకు చెందినవాడే కావడంవల్ల రామరాజు అభిప్రాయాన్ని అంతగా హర్షించలేకపోయాడు.

"ఉద్ధరించావులేరా! అనంతమైన ఈ ఆఫీసుపనుల్లో పెండింగ్ పదానికే అర్థంలేదు. పెండింగ్‌లేని ఆఫీసు వుండదు... వుండకూడదు కూడాను. నువ్వు మరీ దేశభక్తుడవైపోకురా— మాలాంటివారికి ప్రమాదం" నవ్వుతూనే చురక తగిలించాడు శ్రీపతి.

రామరాజు చిరుమందహాసం చెయ్యడం మినహా మరేమీ అనలేకపోయాడు.

ఖాళీగా పోతోన్న ఆటోని ఆపాడు భైరవమూర్తి. ముగ్గురూ కూచున్నాక ఎక్కడికి పోవాలో డ్రైవర్‌తో చెప్పాడు. ఆటో ముందుకు సాగిపోయింది.

ఆటో ఒక బార్ ముందాగడం గమనించాడు రామరాజు. నిర్ఘాంతపోయాడు.

"ఇదేమిత్రా... ఇక్కడికి తీసుకొచ్చారు?" సంభ్రమంతో అన్నాడు రామరాజు.

"ముందు దిగరా... తర్వాత చెప్తాం" చిరునవ్వుతో అన్నాడు శ్రీపతి.

రామరాజు వాళ్లతోపాటే దిగాడు. భైరవమూర్తి ఆటోఛార్జీ ఇచ్చేశాడు.

"నీ వివాహం అయ్యాక నిజానికి నువ్వే మాకు పార్టీ ఇవ్వాల్సిందికాని మా దురదృష్టం... నువ్వా విషయాన్ని మర్చిపోయినట్టున్నావు. అవునా! అంచేత నీ తరపున భైరవమూర్తి ఈరోజు పార్టీకి స్పాండవుతున్నాడు. అర్థమయిందా ఇప్పటికైనా? వాడికి నువ్వు థాంక్స్ చెప్పుకోవాలి" లోపలికి వెళ్తూ అన్నాడు శ్రీపతి.

రామరాజు ఇరకాటంలోపడ్డాడు. మొట్టమొ

దటిసారి బార్‌లో అడుగుపెడుతున్నందుకు అతని కాళ్లు వణుకుతున్నాయి. ఏదో అనబోయాడు. భైరవమూర్తి రామరాజు నోరుమూస్తూ—

"నోరు మూసుకోరా... ఎవరైనా వింటే నవ్వుతారు. అవమానభారంతో కృంగిపోవాలి మనం" అన్నాడు.

దాంతో రామరాజు నోటికి తాళంపడింది. మూర్తి చెప్పింది నిజమేనేమోననిపించిందతనికి. వాళ్ల వెంట నడిచాడు.

ముగ్గురూ ఓ టేబిల్‌ముందు కూర్చున్నారు. విద్యుద్దీపాలు డిమ్‌గా వెలుగుతున్నాయి. పల్చటి నీలంరంగు కాంతి పరిసరాల్ని ప్రభావితం చేస్తోంది. నిశ్శబ్దవాతావరణం... ఎవరు మాట్లాడినా రహస్య సమాలోచన చేస్తున్నట్టే, అతిమెల్లిగా మాట్లాడుతున్నారు. పాప్ మ్యూజిక్ వీనులవిందుగా వినిపిస్తోంది.

బేరర్ వచ్చి వాళ్లముందు నుంచున్నాడు. భైరవమూర్తి ఆర్డరిస్తుంటే రామరాజు మధ్యలో కలిగించుకున్నాడు.

"నేను కేవలం బీరు మాత్రమే తీసుకుంటాన్రా" అన్నాడు.

నిజానికి రామరాజుకి బీరు తీసుకోవడం కూడా అట్టే అలవాటులేదు. ఆమధ్య ఎప్పుడో ఒకటి రెండుసార్లు కాస్తంత తీసుకున్నాడు— ఇటువంటి పరిస్థితుల్లోనే.

"అలాగేలేరా... అదీ వస్తుందికదా! నీ వివాహం సందర్భంలో నువ్వు పార్టీ ఇవ్వకపోయినా నా పోరుపడలేక భైరవమూర్తి ఈరోజు ఈ పార్టీ ఏర్పాటుచేస్తుంటే నువ్వేమిట్రా— ఆదిలోనే హంసపాదులా ఇలా ప్రారంభించావు?" నవ్వుతూ మెల్లగా అన్నాడు శ్రీపతి.

రామరాజు ఏమీ మాట్లాడలేకపోయాడు.

బేరర్ నవ్వుతూ వెళ్లిపోయాడు.

భైరవమూర్తి రామరాజుకేసి చూశాడు.

"చూశావట్రా రాజూ... బేరర్ ఎలా నవ్వుకుంటూపోతున్నాడో? ఇట్లాంటి చోట్లకి వచ్చినప్పుడు మనం ఎంతో హుందాగా, డిగ్నిఫైడ్‌గా వుండాలి. లేకపోతే బేరర్స్ దృష్టిలో చులకనైపోతాం. ఇప్పుడర్థమయిందా?" అన్నాడు భైరవమూర్తి.

అర్థమయిందన్నట్టుగా తలూపి మౌనముద్ర దాల్చాడు రామరాజు. కాని అతని గుండెలు జోరుగా కొట్టుకోవడం మొదలయింది.

బేరర్ ఒక విస్కీబాటిల్‌ని, ఒక బీరుబాటిల్ని గ్లాసుల్ని తెచ్చి టేబుల్‌మీద పెట్టాడు. వాటితోపాటు మంచినీళ్లజగ్, జీడిపప్పు, సలాడ్ వగైరాలు తెచ్చిపెట్టాడు.

"కాస్సేపట్లో తందూరీ చికెన్ తీసుకొస్తాను సార్..." అంటూ అక్కణ్నించి వెళ్లిపోయాడు బేరర్.

"ఓకే!" అంటూ రెండు గ్లాసుల్లో విస్కీపోసి గ్లాసుల నిండుగా నీరుపోశాడు భైరవమూర్తి. శ్రీపతికి ఓ గ్లాసు అందిస్తూ, తనో గ్లాసు వుంచుకున్నాడు.

"నువ్వు కోరినట్టుగానే బీరు తెప్పించాన్రా రాజూ... గోయెహెడ్" బీరుబాటిల్ని, ఖాళీ గ్లాసుని రామరాజు ముందుంచాడు భైరవమూర్తి.

రామరాజు గ్లాసుకి సగంవరకూ బీరు నింపుకున్నాడు.

"బొత్తిగా అధ్వాన్నంగా వున్నావురా రాజూ! ఎవరైనా చూస్తే నవ్వుతారు. బీరు ఏంచేస్తుందని...?" అంటూ తనే గ్లాసునిండా పోశాడు మూర్తి.

రామరాజుకి బీరు అంతగా కొత్తకాదు. అయినా ఆరోజు ఫుల్‌బాటిల్ తీసుకోవడంవల్ల కాస్త నిషాపట్టింది.

ఆనాటి కార్యక్రమం ముగిశాక ముగ్గురూ బైలుదేరారు. రామరాజు నడకలో తడబాటు కనిపించింది. అతని పరిస్థితిని గమనిస్తూనే వున్నాడు భైరవమూర్తి. నిషా ఎక్కిందని అతని కళ్లు, నడకే చెబుతున్నాయి. ఫరవాలేదనుకున్నాడు భైరవమూర్తి. ఈ స్థితిలో రామరాజు ఇల్లుచేరుకుంటే దీప్తి మానసికాందోళన ఎలా వుంటుందో ఊహించుకుని లోలోన విజయోత్సాహంతో విర్రవీగాడు.

ముగ్గురూ ఓ ఆటో చేసుకుని రామరాజు ఇంటి దగ్గర ఆపారు. రామరాజుని డ్రాప్‌చేసి భైరవమూర్తి, శ్రీపతి అదే ఆటోలో బైలుదేరారు. వెళ్తూ వెళ్తూ-

"విష్‌యూ స్వీట్‌డ్రీమ్స్‌రా రాజూ!" నవ్వుతూనే అన్నాడు భైరవమూర్తి.

# ఇతర డైలు అన్నీ కలిపి ఎంతమంది వాడుతారో అంతకంటే ఎంతో ఎక్కువ మంది తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డైనే వాడుతారు.

ఇవిగో 3 మంచి కారణాలు:




రెండు నైసర్గిక రంగులలో లభ్యం—
బ్లాక్ మరియు డార్క్ బ్రౌన్.

**1** తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డై మీ జుట్టుకు అందిస్తుంది నైసర్గిక రంగు, రూపం. జుట్టును మృదువుగాను, ఎలా కావలిస్తే అలా చక్కగా వుంచుకోడానికి దీనిలో కండిషనర్ కూడా వున్నది.

నిజానికి, వేసుకొన్నారని మీరు చెప్పితే తప్ప ఎవరికీ తెలియదు.

**2** ఇతర హేర్ డైలలాగా కాకుండా, తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డైని సులభంగా, అనుకూలంగా వేసుకోవచ్చు.

అవును, జుట్టును షాంపూ చేసుకోవడం లాగే ఎంతో సులభం.

**3** తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డై నాణ్యత సంబంధంగా మీరు నిశ్చింతగా వుండవచ్చు. ఎందుకంటే, మీ జుట్టును, చర్మాన్ని సంరక్షించడానికి ఇది ప్రత్యేకంగా తయారు చేయబడినది.

పరిపూర్ణ రక్షణ—ఇదే గోద్రెజ్ వాగ్దానం.

**గోద్రెజ్®** తనంతట తానే వ్యాపించే పర్మనెంట్ హేర్ డై.



CLARION/B/GS/50/173/TL

వాళ్ల ఆటో ముందుకు దూసుకుపోయింది.

రామరాజు కాస్తంత నిషాలో వున్నా బొత్తిగా మైమరిచి లేడు. కాని అతని మనస్సు పీకుతూనే వుంది. తలుపుతట్టాడు.

దీప్తి భర్త రాకకోసం ఎదురుతెన్నులు చూస్తోందేమో తలుపు చప్పుడు వినడంతోనే తలుపు తెరిచింది.

"ఏమిటండీ... ఇంత ఆలస్యమయింది?" ప్రశ్నించింది. ఆమె ప్రశ్నలో విసుగు పొడజూపుతోంది.

ఆ పరిస్థితిలో రామరాజుకి ఆ ప్రశ్ననచ్చలేదు.

"ఏం... నీకు సంజాయిషీ చెప్పాలా ఏమిటి?" చిరుకోపంతో అన్నాడు రామరాజు.

గుప్పుమంది మత్తువాసన. దీప్తికి అనుభవంలేని వాసన అది! ఆమెకి అర్థమయింది. భర్త ఏం తీసుకున్నాడనేది- ఆమె గుండెలు గుభేలుమన్నాయి. హృదయం మౌనంగా బావురుమంది. ఆమె నిర్మించుకున్న కలల హార్మ్యం కుప్పగా కూలిపోయినట్టనిపించింది.

భర్తకి తాగుడు అలవాటుందని దీప్తికి తెలీదు. ఇప్పుడు తెలిసేసరికి ఆమెకి కళ్ళు తిరిగినట్టయ్యాయి. తన భర్త సహృదయుడని, సుగుణ సంపన్నుడని, ఓ కళాకారుడని ఎంతో మురిసిపోయింది. తన అదృష్టానికి లోలోన గర్వపడింది. కాని... కాని... ఇప్పుడా ఆనందం మంచుముక్కలా కరిగిపోయింది. అప్రయత్నంగా ఆమె కళ్లల్లో అశ్రువులు గూడుకట్టినయి. ఎంతగా ఆపుకుందుకు ప్రయత్నించినా కన్నీటి బిందువులు చెక్కిళ్ళపైకి జాలువారినయి.

అయినా నిగ్రహంతో కళ్ళొత్తుకుంది దీప్తి. తలుపు గడియవేసి లోపలికి నడిచింది.

భర్తకు వడ్డించి, ఆయన్ని పిలవడానికి వచ్చింది. మత్తులో వున్న రామరాజు మంచం మీద ఒరిగిపోయి వున్నాడు. అతనికి నిద్ర ముంచుకొస్తోంది.

"భోజనం చేద్దురుగాని లేవండీ" మెల్లగా అంది దీప్తి.

"నేనిప్పుడేం భోంచేయను దీప్తీ! నువ్వు భోంచేయి. నాకు నిద్రముంచుకొస్తోంది" అంటూ పక్కకి తిరిగాడు రామరాజు.

దీప్తికి ఇప్పుడేం చెయ్యాలో బోధపడలేదు. ఇది ఆమెకో కొత్త అనుభవం. ఇటువంటి పరిస్థితిని జీవితంలో ఎదుర్కోవల్సివస్తుందని ఆమె ఎప్పుడూ వూహించనైనాలేదు. ఇటువంటి పరిస్థితుల్లోనే కొందరు స్త్రీలు భర్తలతో పోట్లాటకి దిగడం ఆమె విన్నది. కథల్లో చదివింది. అయితే అట్లా పోట్లాటకు దిగడం, ఆయన్ని నిలదీసి అడగడం ఆమె మనస్తత్వానికే వ్యతిరేకం. జీవితం సాఫీగా, గలగలపారే సెలయేరులా సాగిపోతే చాలనుకునే తత్వం ఆమెది. అందుకే నిస్సహాయంగా మునిపళ్ళతో కిందిపెదివిని నొక్కిపడుతూ, దుఃఖాన్ని దిగమ్రింగుతూ అక్కణ్ణించి వెళ్ళిపోయింది. ఆ రాత్రికి ఆమెకీ భోజనం చెయ్యాలనిపించలేదు. ఓ గ్లాసుడు మంచినీళ్ళు తాగి వంటగది చక్కబెట్టుకుని వచ్చి, భర్త పక్కనే మంచం మీద ఒరిగిపోయింది.

భర్త నిద్రపోతూ వుండటం గమనించింది దీప్తి. ఆమెకి ఏడుపొచ్చింది. కన్నీరు ధారాపాతంగా స్రవించి దిండు తడిసిపోయింది. మౌనంగా ఎంతోసేపు ఏడ్చి ఏడ్చి నిద్రదేవత ఒడిలో విశ్రాంతి తీసుకుంది- జీవితం గురించి ఎన్నెన్నో సుందరస్వప్నాల్ని మనసులో చిత్రించుకున్న దీప్తి.

రామరాజు గురకపెట్టి మరీ నిద్రపోతున్నాడు.

మర్నాడు మామూలుగానే సూర్యోదయానికి ముందే నిద్రలేచింది దీప్తి.

నిద్రలేమివల్లగామోను బలహీనంగా వున్నట్టనిపించిందామెకి. రాత్రి అసలు ఎంగిలిపడలేదు. అదైనా కారణం కావచ్చు- అనుకుంది దీప్తి.

రామరాజు గాఢనిద్రలోనే వున్నాడింకా.

దీప్తి దినచర్యలో పడింది.

భర్తకి బెడ్‌కాఫీ అలవాటయింది. అంచేత కాఫీ తెచ్చి ఆయన్ని మేల్కొలిపింది. "లేవండీ... ఏడు గంటలయింది..." అంది, తట్టి లేపుతూ.

రామరాజు బద్ధకంగా వొళ్ళువిరుచుకుంటూ లేచాడు. గడియారంకేసి చూశాడు. ఏడు గంటలు దాటింది. ఎదురుగా కాఫీ

కప్పుతో నిల్చున్న దీప్తిని చూశాడు. గతరాత్రి తాను ఏ స్థితిలో ఇంటికొచ్చాడో గుర్తుకొచ్చి, మొహం చెల్లక ఆమె మొహంలోకి సూటిగా చూళ్ళేకపోయాడు.

భార్య దగ్గర్నుంచి కాఫీ కప్పు అందుకుని, మొహం దించుకునే కాఫీ సిప్ చేస్తున్నాడు రామరాజు. ఎప్పుడూ చిరుదరహాసంతో నవ్వులరాణిగా, అందాలరాశిగా అగుపించే దీప్తి ఆ క్షణంలో గంభీరంగా వుండటాన్ని గమనించాడు. కనురెప్పలెత్తి ఆమె మొహంకేసి చూశాడు. ఆమె మొహం పాలిపోయివుంది. అందుక్కారణం ఏమిటో అతనికి తెలుసు. ప్రత్యేకించి కారణం అడిగి, తనే దోషిగా నిలబడ్డం అతనికి ఇష్టంలేకపోయింది.

రామరాజు లోలోన బరువుగా ఓ నిట్టూర్పు విడిచాడు. నిజానికి తాను పెద్దపొరపాటు చేశాడేమో. శ్రీపతి, మూర్తిలతోపాటు తాను బార్‌కి వెళ్ళి వుండాల్సింది కాదు. తనని గురించి ఇంతవరకూ ఉన్నత భావాల్ని పెంచుకున్న దీప్తి- ఇప్పుడు తనని ఎంతగా అసహ్యించుకుంటోందో...? -తనని తానే నిందించుకున్నాడు రామరాజు. శ్రీపతిని, భైరవమూర్తిని మనసులో తిట్టుకున్నాడు. కాని ఏం లాభం? ఇప్పటికే తన గురించి దీప్తికి చెడుభావం ఏర్పడి వుంటుంది. తనని ఓ తాగుబోతుగా భావించి, తన వ్యక్తిత్వాన్నే శంకించి వుంటుంది... అనుకున్నాడు.

అలా ఆలోచిస్తూనే కాఫీ తాగడం పూర్తిచేసి కూడా ఖాళీ కప్పుని భార్యకి అందించడం మర్చిపోయాడు రామరాజు.

దీప్తి మౌనంగానే భర్త చేతిలో వున్న ఖాళీకప్పును తీసుకుని వెళ్ళిపోయింది చరచరా.

విస్తుపోయిన రామరాజు మొహం పాలిపోయింది. బరువుగా ఓ నిశ్వాసం వదిలాడు.

మనిషి జీవితంలో కొన్ని చిన్న చిన్న పొరపాట్లు ఎటువంటి వైపరీత్యాలకు దారితీస్తాయో స్వానుభవంతో అర్థం చేసుకున్నాడు.

తాను చేసిన పొరపాటు ఏమిటో రామరాజుకి బాగా తెలుసు. అయితే తన తప్పుకి ప్రాయశ్చిత్తంగా ఇప్పుడు పరిస్థితుల్ని ఎదుర్కోక తప్పదనుకున్నాడు నిబ్బరంగా.

బద్ధకంగా మరోసారి వొళ్ళు విరిచాడు రామరాజు. ఇంతసేపు నిద్రపోయినా ఒళ్లంతా నొప్పులుగానే వున్నట్టనిపించింది. లేని హుషారు తెచ్చుకొని, మంచం మీంచి దిగాడు. కాలకృత్యాలు తీర్చుకుని వాలు కుర్చీలో చేరబడుతూ, ఆనాటి దినపత్రిక చదవడానికుపక్రమించాడు.

రామరాజు ప్రత్యేకించి చెప్పకుండానే, అతని అలవాట్లు తెలుసునుగాబట్టి, మళ్ళీ కాఫీ తెచ్చి అందించింది దీప్తి. ఈ పర్యాయం కూడా ఆమె మౌనంగా వుండటం రామరాజుని ఎంతగానో నిరుత్సాహపర్చింది. అతని మనస్సు చివుక్కుమంది.

"అలా గంభీరంగా, ముభావంగా వున్నావేం దీప్తీ! ఒంట్లో బావుండటంలేదా? లేకపోతే నామీద కోపం వచ్చిందా?'' కాఫీ అందుకుని భార్య మొహంలోకి చూస్తూనే ప్రశ్నించాడు రామరాజు.

దీప్తి క్షణం మౌనంగా వుండిపోయింది.

ఏం సమాధానం చెప్పడమా అని ఆలోచిస్తోంది. అసలు సమాధానం చెప్పకుండా వుంటేనో... అనుకుంది కూడాను. "మౌనం దాల్చావేం దీప్తీ? నాపై కోపం వచ్చిందా?'' మళ్ళీ అడిగాడు రామరాజు.

ఇంక మౌనంగా వుండటం సబబుకాదనుకుంది దీప్తి.

"నాకెందుకండీ- మీమీద కోపం?'' మెల్లగా అన్నా ఆమె గొంతులో జీరరావడం, కళ్ళల్లో నీరు చిప్పిల్లడం గమనించాడు రామరాజు. భార్య మనోవేదనని అవగాహనచేసుకున్నాడు. "నువ్వు అబద్ధం చెబుతున్నావు దీప్తీ! నీ అంతర్వేదన నాకు తెలుసు. రాత్రి నా ప్రవర్తనకి నీకు నావట్ల కినుకరావడం సహజమే! కాని, నిజం తెలుసుకుంటే నన్ను క్షమిస్తావు. స్వతహాగా నాకు నేనుగా ఆ ప్రయత్నానికి పూనుకోలేదు. నా మాట నమ్ము దీప్తీ... నా స్నేహితుల బలవంతంమీద కొద్దిపాటి బీరు తీసుకున్నాను. అంతే! అలవాటు లేకపోవడంవల్ల త్వరగా నిషా ఎక్కింది. ఆ మత్తులో నీపట్ల మరేవిధంగానూ అసభ్యంగా ప్రవర్తించలేదనుకుంటాను. అయినా నా బలహీనతకి, నాలో నేనే సిగ్గుపడుతున్నాను. నన్ను క్షమించు దీప్తీ'' క్షమాపణ చెప్పుకున్నాడు రామరాజు.

దీప్తి సాడిగా నవ్వింది. ఆ నవ్వులో ఎన్నో అర్థాలున్నయ్. బాధ, నిస్సహాయత, కోపం, జుగుప్స... ఇవన్నీ మిళితమై ఒక వింత భావాన్ని ఆమె నవ్వు వెదజల్లినట్టుంది.

"క్షమించడానికి నేనెవర్నండీ! నేను మీ అర్ధాంగిని. నా మెడలో తాళి గట్టి భర్తగా అధికారాన్ని సంపాదించుకున్న మగధీరులు మీరు. అటువంటి భర్త క్షమించమని భార్యను అడిగితే, అర్ధాంగిగా ఆమె సిగ్గుపడుతుంది. అలా ఎప్పుడూ అనకండి. అయితే ఒక్క విషయం - మీపట్ల నాలో జీర్ణించుకుపోయిన ఆరాధనాభావం, రాత్రి మీ ప్రవర్తన కారణంగా కొన్తంత లొణికిసలాడింది. మీ వ్యక్తిత్వం ఇంత బలహీనమైనదని తెలుసుకున్నాక, నా దురదృష్టాన్ని లోలోన తిట్టుకున్నానండీ! వ్యక్తిత్వంలేని మనుషులంటే నాకు గౌరవంలేదండీ" అని దీప్తి చెప్పుకుపోతుంటే ఆమె వాగ్ధాటికి అడ్డొచ్చాడు రామరాజు.

"అదికాదు దీప్తీ... నాకు వ్యక్తిత్వం లేకకాదు... స్నేహితుల ఒత్తిడిని ఎదిరించలేక..". అన్నాడు తడబడుతూ.



దీప్తి భారంగా ఓ నిట్టూర్పు వదిలింది. "స్నేహితుల మాటలకు మైమరచి, వాళ్ళ ఒత్తిడికి తలవొగ్గి ఒక దురలవాటుకి దాసోహ మయ్యే మీవంటివారి మనస్సు ఎంత దుర్బల మైనదో అర్థమౌతోంది. నిజానికి క్షమించమని అర్ధాంగిని అర్థించడం కంటె చెడు అలవా ట్లని ప్రోత్సహించే మీ స్నేహితుల్నే క్షమించ మని కోరుతూ తప్పించుకోవచ్చును కదండీ? మీకంటే వయసులోనూ, విజ్ఞానంలోనూ, అను భవంలోనూ చిన్నదాన్ని. మీకు సలహాయిచ్చే పాటి దాన్నికాదు కూడాను. నా మానసికావేద నని, ఆందోళనని అర్థం చేసుకోండి" అంటూ పెల్లుబికొస్తోన్న దుఃఖప్రవాహాన్ని ఆపుకోడాని కి ప్రయత్నిస్తూ చీరచెరగుతో కళ్ళొత్తుకుంటూ అక్కణ్నించి వంటగదికేసి వెళ్ళిపోయింది దీప్తి.

రామరాజు హతాశుడయ్యాడు. భార్య చీర చెంగుతో కళ్ళు ఒత్తుకోవడాన్ని గమనించాడు. అతని మనస్సు చివుక్కుమంది. ఎంతో ఆనందంగా, వుత్సాహంగా వుండాల్సిన దీప్తి, అలా కంటతడిపెట్టుకోవడం రామరాజు హృద యాన్ని చిందరవందరచేసింది. అతని కళ్ళు చెమ్మగిల్లాయి. పశ్చాత్తాపంతో ఓ నిట్టూర్పు వదిలాడు. అంతకంటె ఏం చెయ్యగలడు గనక. తప్పుజరిగిపోయింది. తనదే తప్పని అంగీకరించాడు కూడాను. అయినా దీప్తి తనని అవగాహనచేసుకుందుకు ప్రయత్నించ డంలేదు. క్రమంగా ఆమే తెలుసుకుంటుంది. కాలమే ఆమెలో మార్పు తీసుకొస్తుంది... అను కున్నాడు.

దీప్తి వంటగదిలో వంట వండుతోందేగాని అన్యమనస్కంగావుంది. ఆమె మనసు పరిపరి విధాల ఆలోచిస్తోంది. ఈ ఒక్క సంఘటనకే తాను ఆయన్ని అసహ్యించుకుంటున్నట్టు గాని, ఆయనపై క్రోధావేశంతో వున్నట్టుగాని ఆయన అనుకుంటే తమమధ్య అంతరం మరింత పెరిగిపోతుందేమోనన్న భీతి ఆవ హించిందామెని. ఆ భయం ఆమెని కది లించివేసింది. అలాంటి అభిప్రాయం ఆయ నలో కలక్కుండా, తను జాగ్రత్త పడాలను కుంది. మంచిగా, మధురవాక్కులతో, మృదుద రహాసంతో ఆయన మనస్సుని గెలవాలని నిశ్చ యించుకుంది దీప్తి.

ఇప్పుడామెలో ఆందోళన తగ్గింది. చకచకా వంటపనులు సాగించింది. కొద్దిసేపట్లో వంట ముగిసింది. గడియారంకేసి చూసింది దీప్తి. తొమ్మిదిన్నర కావస్తోంది. భర్త... అప్పుడే దుస్తు లు వేసుకుంటున్నాడు కూడాను.

"ఏవండీ... వడ్డించేయమంటారా?" భర్తకి దగ్గరగా వచ్చి అడిగింది.

రామరాజుకి ఆ మాటలు మధురసంగీ తంలా వినిపించాయి. ఆమె మొహంలోకి చూశాడు చిరునవ్వుతో.

"ఊఁ... వడ్డించు టైమ్ అవుతోందిగా—" అన్నాడు షర్టటక్ చేసుకుంటూ.

రామరాజు భోజనం ముగించి, ఆఫీసుకి బైలుదేరుతున్నప్పుడు మామూలుగానే చిరున వ్వుతో ఎదురొచ్చింది దీప్తి. రామరాజు హృద యంలో అమృతవర్షం కురిసినట్టయింది.

"శ్రీమతిగారికి కోపం తగ్గినట్లేకదా?" నవ్వు తూ అన్నాడు.

"ఛా... నాకు మీమీద కోపమేమిటండీ? క్షణికమైన అలకలు ఆలుమగలమధ్య పరిపా టేకదా? సాయంత్రం పెందరాళే వచ్చే యండి... సినిమాకి వెడదాం" చిరుదరహా సంతో అంది దీప్తి.

అర్ధాంగి ఆవేశం తగ్గినందుకు మురిసిపో యాడు రామరాజు. ఆమె గులాబీ చెక్కిలిని కొనగోటితో మీటాడు.

"ష్యూర్... తప్పకుండా వస్తాను దీప్తీ. నువ్వు తయారుగా వుండు" అంటూ హుషారుగా ముందుకు సాగిపోయాడు రామరాజు.

దీప్తి తృప్తిగా నవ్వుకుంది.

క్రితంరోజులా ఏ పార్టీకో వెళ్ళిపోకుండా భర్త ఇంటికి పెందరాళే చేరుకుంటాడన్న విశ్వా సంతోనే అలా చెప్పిందిగాని, నిజానికి సినిమా చూడాలన్న కాంక్షతో కాదు.

భర్త త్వరగా వచ్చేస్తే, ఏ సినిమాకి వెళ్ళ డమా అని ఏయే హాల్లో ఏయే సినిమా ప్రద ర్శింపబడుతోందో చూడ్డానికి 'ఈనాడు' దినప త్రిక తిరగెయ్యసాగింది దీప్తి.

★ ★ ★

రామరాజు ఆ రోజు ఆఫీసుకి వెళ్ళిందగ్గ

ర్నించీ తన పనిలో నిమగ్నమయ్యాడు. సాయంత్రం తొందరగా ఇంటికి వెళ్ళాలన్న సంకల్పం అతనిలో ప్రగాఢంగా హత్తుకుని వుండటమే ఆ పట్టుదలకి కారణం.

"ఏవఁటోయ్ రాజూ... ఇవ్వాళ టిఫిన్ అవర్‌లోకూడా నువ్వు బైటికి వెళ్ళినట్టు లేదు?" అన్నాడు వాళ్ళ ఆఫీసు సూపరింటెండెంటు ఆశ్చర్యపోతూనే.

"ఔనుసార్! సాయంత్రం కాస్త తొందరగా ఇంటికి వెళ్ళాలని" సమాధానమిచ్చాడు రామరాజు.

ఆఫీసు సూపరింటెండెంటు ముసిముసిగా నవ్వుకున్నాడు.

"రెండు మూడు నెలలవరకూ ఇట్లాగే వుంటుంది లేవోయ్..." అనేశాడు నవ్వుతూ.

ఆయన అభిప్రాయాన్ని అర్థంచేసుకున్న రామరాజు తనలోతనే సిగ్గుపడుతూ నవ్వుకున్నాడు.

సాయంత్రం నాలుగ్గంటలయింది.

రామరాజు పెన్ను మూసి జేబులో పెట్టుకున్నాడు. టేబులు మీదున్న ఫైళ్ళు సర్దుకున్నాడు.

సరిగ్గా అదే సమయంలో బైరవమూర్తి, శ్రీపతి, మరో కొత్తవ్యక్తి రామరాజు దగ్గరికి వచ్చారు.

ఆ సమయంలో వాళ్ళు రావడం రామరాజుని ఆనందపర్చలేదు. లోలోన విసుక్కున్నాడు.

"ఒరేయ్ రాజూ... ఈయన మిస్టర్ ఆనందాచారి. ఆలిండియా రేడియోలో వుద్యోగం. మంచి నటులు. నాటక ప్రయోక్త, దర్శకులు కూడాను. మన నాటక సమాజానికి బాగా వుపయుక్తులు కాగలవ్యక్తి. ఈయనతో మనకి పరిచయం కావడం మన అదృష్టమే అనుకో. ఆనందాచారిగారూ... వీడు మా మిత్రుడు రామరాజు. మా గ్రూపులో వాడే. మంచి నటుడు, అభ్యుదయభావాలు గలవాడు" అంటూ వారిరువురికీ పరస్పరంపరిచయం చేశాడు శ్రీపతి.

రామరాజు, ఆనందాచారి కరచాలనం చేసుకున్నారు.

"కూచోండి..." సభ్యతకోసం యధాలాపంగా అన్నాడు రామరాజు. నిజానికి వీళ్ళని ఎలా వదిలించుకోవడమా అన్నభావన అతని మనసులో వుంది.

శ్రీపతి నవ్వేశాడు.

"అదనంగా సీట్లే లేవురా? ఎక్కడ కూచోమంటావు?" అన్నాడు.

ఆనందాచారి పరిస్థితిని అర్థంచేసుకున్నాడు. ఆఫీసుల్లో అదనంగా సీట్లు ఎలా వస్తాయి?

"ఫరవాలేదులెండి శ్రీపతిగారూ, ఆయన్ని మనం డిస్టర్బ్‌చెయ్యడం మంచిదికాదు. సాయంత్రం ఎలాగూ కలుసుకుంటున్నాంకదా! అప్పుడు తీరిగ్గా మాట్లాడుకుందాం" అన్నాడు ఆనందాచారి.

"అఫ్‌కోర్స్- అది ఎలానూ వుందనుకోండి... మీరన్నట్టు అక్కడే మనం సావకాశంగా మాట్లాడుకోవచ్చు" అంటూ రామరాజుకేసి తిరిగాడు బైరవమూర్తి.

"ఒరేయ్ రాజూ... ఇవ్వాళ సాయంత్రం ఇంటికి పరుగెత్తకు. ఆనందాచారిగారితో పరిచయమైన శుభతరుణంలో చిన్న పార్టీ ఏర్పాటు చేసుకుంటున్నాం. మరో అరగంట పోయాక ఆఫీసునుంచే నేరుగా వెళ్ళిపోదాం. మరేవీఁ సాకులు చెప్పకేం?" అన్నాడు బైరవమూర్తి ముందరికాళ్ళకు బంధంవేసినట్టుగా.

రామరాజుకి అతని మాటలు విద్యుత్‌షాక్ తగిలినట్టుగా అయ్యాయి. అతని మొహం పాలిపోయింది. ఇరకాటంలో పడిపోయాడు. దీప్తికిచ్చిన మాట గుర్తుకొచ్చి ఏం చెయ్యడమో బోధపడక తికమకపడ్డాడు.

"ఒరేయ్ మూర్తీ... ఇవ్వాళ పార్టీకి నేను రాలేనురా" తడబడుతూ అన్నాడు.

"అనుకున్నాన్రా... నువ్వేదో సాకుచెప్తావని? ఎందుకు రాలేవు?"

"ఉదయమే ఓ ప్రోగ్రాం నిర్ణయించుకున్నాంరా! సాయంత్రం సినిమాకి వెళ్తున్నాం. అందుకనే ఎక్కడికీ కదలకుండా ఇవ్వాల్టి వర్కు త్వరగా పూర్తిచేసుకున్నాను కూడా. అంచేత ఇవ్వాల్టికి నన్ను వదిలెయ్" మెల్లగా ప్రాధేయపడుతున్నట్టుగా అన్నాడు రామరాజు.

రామరాజు చెప్పింది పెద్ద సమస్యగా తీసుకో లేదు భైరవమూర్తీ శ్రీపతీను. తేలిగ్గా నవ్వేశారు ఇద్దరూ. "అదో పెద్ద సమస్య అయినట్టు చెబుతున్నావేంట్రా? మన భవిష్యత్తు కంటే, మన సమాజం పురోభివృద్ధికంటె సినిమా ప్రోగ్రాము ముఖ్యమైనదేవిట్రా రాజూ? ఎవరైనా వింటే నవ్వుతారు తెలుసా? సినిమా ఎక్కడికీ పోదు- రేపు వెళ్ళొచ్చులే" సుమారు డిక్టేట్ చేస్తున్నట్టే అన్నాడు శ్రీపతి.

రామరాజుకి మాట్లాడే అవకాశం ఇవ్వకుండా చప్పున అందుకున్నాడు భైరవమూర్తి-

"ఒరే రాజూ! మా దగ్గర అన్నావు సరిపోయిందిగాని, ఇంకెవరైనా వింటే ఎగతాళి చెయ్యకమానరు. ఆనందాచారి వంటివ్యక్తితో కాస్సేపు కాలక్షేపం చేసే అవకాశం అందరికీ రాదురా? ముఖ్యంగా మనలాంటి కళాకారులకి. మన భవితవ్యానికి ఈ అవకాశం ఒక బంగారు బాటలాంటిదనుకో" శ్రీపతిని బలపరుస్తూ అన్నాడు భైరవమూర్తి.

రామరాజు ఆలోచనల్లోపడ్డాడు. భైరవమూర్తి అన్నట్టు, ఇది తనలాంటి వాళ్ళకి మంచి అవకాశమే. ఒకపక్క తన భవష్యత్తు, మరోవేపు దీప్తికిచ్చిన మాట అతణ్ణి ఊగిసలాడించాయి.

క్రితంరాత్రి సంఘటనంతా గుర్తుకొచ్చింది రామరాజుకి. తెల్లవారిందగ్గర్నించీ దీప్తి ముఖ కవళికలు ఎలా వున్నవీ అతని స్మృతిపథంలో మెదిలినయ్. అయితే నాటకరంగంలో ఉన్నత శిఖరాల్ని అధిరోహించాలన్న అతని ఆకాంక్ష వెన్నుతట్టింది. నాటకరంగంలో తన పురోగమనానికి ఆనందాచారిలాంటి వ్యక్తుల సహకారం అవసరం. ఇటువంటి సదవకాశాన్ని జారవిడుచుకోవద్దని అదృశ్యశక్తి ఏదో హెచ్చరిస్తున్నట్టే అనిపించిందతనికి.

చివరికి రామరాజు అంతర్మథనంలో నాటక రంగ భవిష్యత్తు గురించిన ఆలోచనలే విజయం సాధించాయి. దీప్తికి ఈ ఒక్కరోజు తన వైఫల్యానికి ఏదో సమాధానం చెప్పుకోవచ్చునన్న నిర్ణయానికొచ్చేశాడు రామరాజు.

రామరాజుని నిశితంగా ఆలోచించనివ్వకూడదనుకున్నాడు భైరవమూర్తి.

"వివాహమయ్యాక నువ్వు మారిపోయినట్టున్నావురా రాజూ! ప్రతి చిన్నవిషయానికీ అంతగా ఆలోచిస్తావేంటి? మీ ఆవిడ నిన్ను అప్పుడే గుప్పెట్లో పెట్టేసుకుందా?" చిలిపిగా నవ్వుతూ ఓ ప్రశ్నవేశాడు భైరవమూర్తి.

ఈ ప్రశ్న తనని రెచ్చగొట్టడానికే భైరవమూర్తి వేశాడన్న నిజాన్ని గ్రహించలేకపోయాడు రామరాజు.

నిజంగానే భైరవమూర్తి వేసిన ప్రశ్న రామరాజు గుండెల్ని జివ్వు మనిపించింది. అతని వ్యక్తిత్వం దెబ్బతిన్నట్టుగా ఫీలయ్యాడు. 'భార్య చేతిలో కీలుబొమ్మ' అనే బిరుదు తెచ్చుకోవడం అతనికిష్టంలేదు.

"అబ్బే... అదేం కాదురా! కాకపోతే ముందుగానే ప్రోగ్రామ్ వేసుకున్నామని!" గొణిగాడు.

"ఇంతకీ వస్తున్నట్టా లేదా?" సీరియస్‌గా మొహంపెట్టి అడిగాడు భైరవమూర్తి.

రానని చెప్పగలిగే ధైర్యం, మనోస్థైర్యం లేకపోయాయి రామరాజుకి. నాటకాల్లో తానింతవరకూ నటిస్తూ వస్తున్న హీరో పాత్రలకు గాలివస్తుందేమోనన్న భయం ఓపక్క వున్నా నంటోంది. ఔనుమరి... ఇది రికమండేషన్ల యుగంకదా!

"తప్పుతుందా మరి? పదండి ..." అయిష్టంగానే ఒప్పుకున్నాడు.

"అదీ... అలాఅన్నావు బావుంది. ఇదిరా పురుషలక్షణమంటేనూ. పోదాం పద ..." నవ్వుతూ అన్నాడు శ్రీపతి.

రామరాజు, ఆఫీసు సూపరింటెండెంటుకి చెప్పేసి వాళ్లవెంట నడిచాడు.



**ఆ** సాయంత్రం...

సినిమాకి బైలుదేరాలని సాయంత్రం నాలుగ్గంటల్నించే ముస్తాబు ప్రారంభించింది దీప్తి.

సినిమాకి వెళ్లడం ఆమెకేం కొత్తకాదు. భర్తని మరింత ఆకట్టుకుని, అతణ్ణి తప్పుదారులు పట్టకుండా తిప్పుకోవాలన్న తాపత్రయం ఆమెది. భర్త పెడదార్లు పట్టకండా, ఈ విధంగానయినా తనతో ముడిపెట్టుకోవాలని ఆమె ఆకాంక్ష!

అయిదు గంటలకంతా రెడీఅయి కూచుంది దీప్తి. ఊదా రంగు షిఫాన్ సిల్కు చీర, దానికి మేచింగు బ్లౌజులో ఆమె అపురూపంగా అగుపిస్తోంది. నిలువుటద్దం ముందు కూచుని మరోసారి జడసరిచేసుకుంది. మధ్య మధ్య కూనిరాగాలతో సినిమా పాటలోని చరణాలు ఆలపిస్తోంది. భర్త వచ్చేసరికి టిఫిను అందివ్వాలని, ఆయనకి ఇష్టమైన గోధుమరవ్వ వుప్మా తయారుచేసి వుంచింది. బ్రూ కాఫీ ఫ్లాస్కులోపోసి అట్టేపెట్టింది.

అయిదున్నరయింది. భర్త రాకకోసం ఎదురుచూడసాగింది దీప్తి. ప్రతి పది నిముషాలకీ వీధి గుమ్మం దగ్గరికి వెళ్లిచూసి వస్తోంది. కాని రామరాజు జాడేలేదు. ఆమెలో ఆతృత ఇనుమడించింది.

ఆరుగంటలయింది. ఆయన వస్తోన్న సూచనలే కనిపించడంలేదు. ఇంతవరకూ దీప్తిలోఉన్న వుత్సాహం అణగారిపోయింది. భర్త మళ్లీ ఏదో పార్టీకి వెళ్లివుంటారన్న అనుమానం ఆమెని నిలువునా కృంగదీసింది.

భారంగా ఓ నిశ్వాసం వదిలింది. ఆమె హృదయకుహరంలో చిన్న తుఫాను రేగింది. తన సంసారజీవితం ప్రారంభదశలోనే ఇలా ఒడిదుడుకులకు లోనవుతుందని ఆమె ఏనాడూ వూహించలేదు. ఆమె హృదయం బావురుమంది. తన దురదృష్టాన్ని మనసులోనే తిట్టుకుంది.

గడియారం ఏడుగంటలు కొట్టింది. సోఫాలో అలా కూచునేవుంది దీప్తి నిర్జీవంగా. ఆమె దృష్టి మాత్రం వీధి తలుపుకేసే కేంద్రీకరించి వుంది. సినిమాకి వెళ్లడం మాట ఎలావున్నా ఆమె మనసులోని ఆవేదనవేరు. ఏడుపొస్తోంది కాని, బలవంతంగా అణచివేసుకుంది. పిరికిదానిలా ఏడుస్తూ కూచోవడంలో అర్థంలేదనుకుంది. అయినా, ఓ విధమైన నిర్లిప్తత ఆమెని ఆవరించింది. నిరుత్సాహంగా లేచివెళ్లి బట్టలు మార్చుకుంది.

ఎనిమిది గంటలయింది.

రామరాజు రాలేదు. విసుగు పరాకాష్ఠనందుకుంటోందామెలో.

అదే సమయంలో వీధిలో ఆటో ఆగినచప్పుడు స్పష్టంగా వినిపించింది. బహుశా ఆయనే వచ్చివుంటారని భావించి వెళ్లి తలుపుతెరిచింది.

రామరాజు ద్వారం దగ్గర నిల్చుని, 'బై బై' చెప్తున్నాడు. అప్పుడే స్టార్టవుతోన్న ఆటోలో భైరవమూర్తిని, శ్రీపతిని చూసింది దీప్తి. భర్త ఎందుకు ఆలస్యంగా వచ్చాడో ఎవరూ చెప్పకుండానే అర్థమైపోయింది. బరువుగా, బాధగా ఓ నిట్టూర్పు విడిచింది.

"సారీ దీప్తీ!" ముక్తసరిగా అంటూ లోపలికి నడిచాడు రామరాజు.

దీప్తి హృదయం బావురుమంది. ఆమె కళ్లు చెమ్మగిల్లాయి. ఒక్క పదంలో ఎంత తేల్గ్గా చెప్పారాయన?- అనుకుంటూ కళ్లొత్తుకుంటూ మౌనంగా తలుపు మూసుకుని లోపలికి వచ్చింది.

బట్టలు మార్చుకుంటున్నాడు రామరాజు. గుండెలు మండుతోన్న వేదనతో, దూరంగా నుంచుని ఆయన్నే గమనిస్తోంది దీప్తి.

"దీప్తీ... స్నానంచేసి వస్తాను. త్వరగా నువ్వు తయారవ్వు ... భోజనంచేసి సినిమాకి వెళ్దాం" అన్నాడు- తువ్వాల్ని నడుంకి చుట్టుకుంటూ.

"సినిమాకి మీరు వెళ్లండి ... నేను రాను" విసురుగా అంది దీప్తి.

"కోపం వచ్చిందా డియర్!" ముసిముసిగా నవ్వుకుంటూ, ఆమెకి దగ్గరగావచ్చి అన్నాడు రామరాజు.

"కోపం రాలేదు. చాలా ఆనందంగావుంది. కాని కాస్త దూరంగా వుండండి ... వెధవ్వాసన..." ముక్కు మూసుకుంటూ అంది దీప్తి.

"సారీ దీప్తీ... ఇవాళ ఓ కొత్త వ్యక్తితో పరిచయమయింది. అతనికి రేడియోస్టేషన్లో వుద్యోగం. అతను మా నాటకసమాజానికి వీలైనంత ప్రోత్సాహమిస్తాడని, నాలాంటి నటులకు, మా సమాజానికి ఆకాశవాణిలో అవకాశాలు కలిగిస్తాడని అంటే, అతనితోపాటు చిన్న

పార్టీకి వెళ్లకతప్పలేదు. నీకు తెలునుకదా-నేను వృద్ధిలోకి వస్తోన్న నటుణ్ణి. రేడియో నాటకాల్లో ఎక్కువ అవకాశాలు వస్తే, నానటజీవితానికవి సోపానాలవుతాయన్న ఆకాంక్ష నాది. అందుకే అతనితో వెళ్లడం తప్పలేదు. మరేమీ అనుకోకు ... సినిమాకి నైట్‌షోకి వెళ్లొచ్చును కదా!'' అన్నాడు.

దీప్తి సూటిగా భర్తకేసి చూసింది- ''ఔను మరి! పార్టీకివెళ్లే అవకాశం మరి చిక్కదు- అంతేకదండీ? ఇటువంటి అలవాట్లకులోనై, నాటక కళకు, నాటక సమాజాలకు కళంకం తీసుకురావడం మరీ ఘోరమండీ. నాటకకళను వుద్ధరించండి ... కాదనను. మంచి నటులుగా వినుతికెక్కండి... ఎంతో ఆనందిస్తాను. అంతేగాని నాటకరంగం పేరుచెప్పుకుని చెడు అలవాట్లకు బానిసయ్యి, ప్రశాంతంగా సాగుతోన్న మన సంసారంలో అశాంతిని సృష్టించకండి. అసలు, నాకు తెలీక అడుగుతాను – మీరు ఆ భైరవమూర్తిగారితో అంత సన్నిహితంగా ఎందుకు తిరుగుతారు చెప్పండి?'' మనసులో దోబూచులాడుతోన్న దుగ్ధను బాహ్యంగా వ్యక్తంచేసింది దీప్తి.

భైరవమూర్తి సహచర్యం వల్లనే తనభర్త చెడు అలవాట్లకు లోనవుతున్నాడన్న అనుమానం దీప్తి అంతరంగంలో మెదిలింది. అందుకే అంత నిష్కర్షగా భర్తను నిలదీసి అడక్కుండా వుండలేకపోయింది.

దీప్తి వేసిన ప్రశ్న రామరాజు గుండెల్ని సూటిగా తాకింది. అతని మొహం అప్రయత్నంగా జేవురించింది. అతని కళ్లు అప్పటికే అరుణిమ కాంతిని సంతరించుకునివున్నా ఆ ప్రశ్నతో వుక్రోషం పెరిగి మరింత ఎర్రదనాన్ని పుంజుకున్నాయి. భైరవమూర్తి రామరాజుకి సన్నిహిత స్నేహితుడే కాదు ... ఆప్తుడు ... శ్రేయోభిలాషి. అటువంటి భైరవమూర్తిని ఎవరు విమర్శించినా చిన్నచూపు చూసినా, సహించలేడు రామరాజు. అతనికి చప్పున వుక్రోషం వచ్చేస్తుంది. ఆ విషయం దీప్తికి తెలుసు. కాని గుండెల్లో రగులుతోన్న క్రోధాగ్నిని అదుపులోపెట్టుకోలేక, ఆ క్షణం అలా ప్రశ్నించకుండా వుండలేకపోయింది.

రామరాజు తీక్షణంగా భార్యకేసి చూశాడు.

''చూడు దీప్తీ- ఇంతకుముందోసారి నిన్ను హెచ్చరించాను ... నువ్వు మర్చిపోయినట్టున్నావు. భైరవమూర్తి నాకు అత్యంత సన్నిహితుడని, ఆప్తుడని, అతణ్ణి ఎవరు విమర్శించినా చిన్నచూపు చూసినా నేను సహించనని చెప్పాను. మళ్లీ అదే పొరపాటు చేస్తున్నావు. ఇటువంటి పొరపాటుచేసి నన్ను అనవసరంగా రెచ్చగొట్టకు దీప్తీ! భైరవమూర్తి నా శ్రేయోభిలాషి. నా ఔన్నత్యాన్ని అభిలషించే సన్నిహితుడు. అటువంటివాడితో నాకు పరిచయం అభిలషణీయం. అర్థమయిందా?'' తీక్షణంగా ఆమె మొహంలోకి చూస్తూ అన్నాడు రామరాజు.

భర్త వాదన మొండివాదనే అనిపించింది దీప్తికి. భైరవమూర్తి ప్రభావం అతనిమీద బాగావుందని నిర్ధారించుకుంది.

ఎంత బలవంతంగా అణచుకోవాలని ప్రయత్నించినా, దీప్తికి వుక్రోషం ఆగలేదు. ఆమె మొహం అరుణకాంతిని పుంజుకుంది. కింది పెదవిని ముత్యాల్లాంటి పళ్లతో నొక్కిపెట్టి, మరింత నిగ్రహాన్ని పెంచుకుంది.

''అర్థమయిందండీ- ఆయనతో మీకు పరిచయం ఎంత అవసరమో అర్థమయింది. అంతేకాదు – ఆయన ప్రభావం మీపై ఎంతగావుందోకూడా అర్థమయింది. కానీ అర్థంకానిది ఒక్కటేనండీ ...'' బాధగా ఓ నిట్టూర్పు విడిచి ఆగింది.

''ఏవిఁటది?''

''భైరవమూర్తిగారు మీ శ్రేయోభిలాషి, ఔన్నత్యాభిలాషి అని మురిసిపోతున్నారే – అదే అర్థం కాలేదండీ! అతను మీ శ్రేయోభిలాషే అయ్యుంటే, మిమ్మల్ని ఇలా చెడుఅలవాట్లకి గురికానివ్వడు. మీ ఔన్నత్యాన్ని అభిలషించే వాడేఅయితే, మీ అభ్యున్నతికి అవసరమయ్యే సత్కార్యాలే చేపట్టి వుండేవాడండీ! నేను అంటున్నానని కాదు- మీ మెదడుకి పనికల్పించండి'' ఉద్రిక్తతని ఆపుకోలేక ఆవేశంతో అంది దీప్తి.

అసలే కాస్త తిక్కలో వున్నాడేమో భార్య ఆరోపణల్ని సహించలేకపోయాడు రామరాజు. కేవలం భైరవమూర్తిని నిందించే ప్రయత్నంలోనే ఆమె అలా అంటున్నదని భావించాడు.

"అంటే- ఏమిటి నీ ఉద్దేశం? భైరవమూర్తి నాశ్రేయోభిలాషి కాడనా?" సూటిగా ఆమె మొహంలోకిచూస్తూ అడిగాడు రామరాజు.

దీప్తి సహనం అప్పటికే పట్టుతప్పింది. నిజం చెప్పడానికి సంకోచించనవసరం లేదనుకుంది.

"ఔనండీ... అతను మీ శ్రేయోభిలాషికాడు. ముమ్మాటికీ కాడు..." ధైర్యంగా అంది.

అంతే! దీప్తిచెంప ఛెళ్ళుమంది.

"ఇంకెప్పుడూ ఇటువంటి వాగుడు వాగకు..." అంటూ చరచరా బాత్రూమ్‌వేపు నడిచాడు రామరాజు.

దీప్తి క్షణంపాటు స్థాణువులా వుండిపోయింది. చేతితో చెంప తడుముకుంది. అప్రయత్నంగా ఆమె కళ్ళనుంచి అశ్రువులు చెక్కిళ్ళపైకి జాలువారినయ్. భర్తలాలన, ప్రేమానురాగాల్ని చవిచూడాల్సిన ఈ వయసులో ఆయన వుక్రోషాన్ని, చెంపదెబ్బల్ని చవిచూసినందుకు ఆమెలేత హృదయం తల్లడిల్లిపోయింది. ఆమెకన్న సుందరస్వప్నాలన్నీ దూదిపింజల్లా ఎగిరిపోయినట్టయింది. ఓవక్క దుఃఖం, మరోవక్క ఆవేశం ముంచుకొచ్చినయ్. ఆమె అంతరంగంలో ఓ విధమైన జుగుప్స ఏర్పడింది.

"ఇది నా చెంపమీద పడిన దెబ్బ కాదండీ! నా హృదయాన్ని బద్దలుచేసిన మీ కాఠిన్యానికి, అవివేకానికి ప్రతీక. సున్నితమైన నా మనస్సుపై సమ్మెటపెట్టు. మీరు నన్ను కొట్టారని బాధపడ్డంలేదండీ- కాని... కాని... నా మనస్సుని సరిగ్గా అర్థంచేసుకోలేకపోయారనే బాధపడుతున్నానండీ! నా ఆవేదనని, ఆందోళనని అవగాహనచేసుకోలేకపోయారనే కుమిలిపోతున్నానండీ! ఎప్పటికయినా మీరే నిజాన్ని గ్రహిస్తారండీ... మీరే గ్రహిస్తారు" రుద్ధస్వరంతో విలపిస్తూ, గట్టిగానే అంది దీప్తి.

ఇంక అక్కడ నిల్చోలేక గదిలోకిపోయి, మంచంమీద ఒరిగిపోయింది దీప్తి.

బాత్రూమ్‌లో వున్న రామరాజు భార్య మాటల్ని విన్నాడు. కాని వాటి సారాన్ని గుర్తించలేదు. అతనిలోని ఆవేశం ఇంకా పూర్తిగా తగ్గలేదు.

దిండులో తలపెట్టుకుని, ఎంతసేపు ఏడ్చిందో దీప్తికే తెలీదు. ఆమె మెదడులో ఏవేవో భావాలు గిర్రున తిరుగుతున్నాయి. ఇప్పుడు తానేం చెయ్యాలో స్పష్టంగా నిర్ణయించుకోలేకపోతోంది. ఇదే పరిస్థితి కొనసాగితే, తన జీవితం ఎలా మారుతుందో ఆమె వూహించుకోలేకపోతోంది. అలా ఆలోచిస్తూనే వుంది. ఎప్పుడు నిద్రపట్టిందో ఆమెకి తెలీదు.

ఆ రాత్రి ఆ దంపతులిద్దరికీ ఉపవాసమే! ఎవరి ఆవేశం వారిది! ఎవరి ఆత్మాభిమానం వారిది!

దీప్తి వండిన వంటంతా వ్యర్థమయింది పాపం! రాత్రంతా నిశ్శబ్దంగా సాగిపోయింది.

* * *

తెలవారుతుండగా నిద్రలేచింది దీప్తి. భర్త గాఢనిద్రలో వుండటం గమనించింది. మంచందిగింది. నీరసంగా వున్నట్టనిపించింది. నిత్య కాలకృత్యాలు ముగించుకుంది. తాను బిగుసుక్కూచోవడం మంచిది కాదేమోననిపించింది. అది ఆమె సంస్కారం!

కాఫీ తయారుచేసి భర్తకోసం తీసుకువెళ్లింది.

రామరాజు అప్పటికే నిద్రలేచి, బద్ధకంగా ఇంకా అలా చేరబడే వున్నాడు. సూర్యుని లేతకిరణాలు అతని మొహంమీద పడుతున్నాయి, కిటికీగుండా. బాగా పొద్దెక్కిందేమోననిపించి లేచి కూచున్నాడు.

అప్పుడే వచ్చింది దీప్తి కాఫీ కప్పుతో. "కాఫీ తీసుకోండి..." అంటూ అందించింది.

భార్య మాట్లాడకుండా మౌనంగానే కాఫీ అందిస్తుందేమోనని మొదట్లో వూహించిన రామరాజుకి తన వూహకి విరుద్ధంగా జరిగినందుకు ఆనందంగా వుంది.

రామరాజు కాఫీ కప్పు అందుకుంటూ, దీప్తి మొహంలోకి చూశాడు.

ఆమె పెదాలపై సహజంగా తారట్లాడే చిరునవ్వులేదు.

"రాత్రి నువ్వేమీ తినలేదా దీప్తీ?" ప్రశ్నించాడు.

దీప్తి చప్పున సమాధానం చెప్పలేదు.

"కాఫీ చల్లారిపోతోంది... తీసుకోండి" అంటూ, అక్కణ్ణించి వెళ్ళిపోయింది నిర్లి

వ్తంగా.

రామరాజు నిర్విణ్ణుడయ్యాడు. ఆమె సమాధానం ఛెళ్ళున లెంపకాయకొట్టినట్టయింది. తాను అడిగిన ప్రశ్నకు జవాబు చెప్పకుండా, నిర్లక్ష్యంగా మరోమాట చెప్పడంలో, ఎంత పొగరామెకి? తన అర్ధాంగి అయ్యుండి కూడా అణకువ అన్నది మచ్చుకయినా లేకుండా, అంత నిర్లక్ష్యమా? ఆమె ప్రవర్తనలో ఇంత మార్పు ఎందుకొచ్చినట్టు? ఏం ఆసరా చూసుకుని ఆమెకంత నిర్లక్ష్యం?... తార్కికంగా అనుకున్నాడు మనసులోనే.

క్రితంరాత్రి జరిగిన సంఘటన, అతనికి కళ్ళకు కట్టినట్టుగా గుర్తుకొచ్చింది. భార్య ధోరణి ఆశ్చర్యాన్ని కలిగించింది. ఆమె అంతరంగపు అభిప్రాయం ఏమిటి? తనపై అజమాయిషీ చెలాయించి, తనని ఆమె చెప్పుచేతల్లో తిప్పుకోవాలని ప్రయత్నిస్తోందా? భైరవమూర్తి వల్ల ఆమెకంత వుక్రోషం ఎందుకు?... ఇలా పరిపరి విధాల ఆలోచనలు సాగించాడు రామరాజు కాఫీ సిప్ చేస్తూనే.

ఆలోచనలు సాగిస్తున్నకొద్దీ రామరాజుకి ఆవేశం, ఆత్మాభిమానం ఇనుమడింపసాగినయ్. తన వ్యక్తిత్వానికి దెబ్బతగిలేలా ఏదీ వుండకూడదనుకున్నాడు. తనపట్ల నిర్లక్ష్యం ఎవరు చూపినా తాను సహించలేడు. కాఫీ తీసుకోవడం పూర్తిచేసి ఖాళీకప్పుని పక్కనే బల్లమీదపెట్టాడు.

లేచి కూచుని బద్ధకంగా ఒళ్ళు విరుచుకున్నాడు రామరాజు. గడియారంవేపు చూశాడు. ఏడున్నర దాటింది.

అప్పుడే వచ్చింది దీప్తి. బల్లమీదున్న ఖాళీ కాఫీ కప్పుని తీసుకుని, మౌనంగా వెళ్ళిపోబోయింది.

"ఆగు దీప్తీ!" గంభీరస్వరంతో అన్నాడు రామరాజు. అతని గొంతులో కాస్తంత కరకుదనం ధ్వనించింది.

ఆగిపోయింది దీప్తి. వెనక్కి తిరిగింది. ఆమె మొహంలోకి చూశాడు రామరాజు. ఆ మొహంలో ప్రత్యేకించి ఎటువంటి భావమూ గోచరించలేదతనికి.

"నేనడిగిన ప్రశ్నకి నువ్వేమీ సమాధానం చెప్పలేదు దీప్తీ?" అన్నాడు సూటిగా ఆమె కళ్ళల్లోకి చూస్తూ.

కొద్దిసేపటిక్రితం, ఆయన అడిగిన ప్రశ్న జ్ఞాపకమొచ్చింది దీప్తికి. తాను సమాధానం చెప్పకుండా, మౌనంగా వెళ్ళిపోవడమూ గుర్తుందామెకి.

"ఏం తీసుకోలేదండీ... ఆకలిగా లేకపోవడంవల్ల... మరి మీరూ తీసుకోలేదుగా?" మొహం దించుకుని మెల్లగా అంది.

"ఈ సమాధానమే ఇంతకుముందు నేను ప్రశ్నించినప్పుడు వెంటనే చెప్పి వుండాల్సింది దీప్తీ! బహుశా నీకింకా తెలీదేమో, నన్ను ఎవరయినా నిర్లక్ష్యంచేస్తే నేను సహించలేను..." గంభీరత, అతని మొహంలోనూ, స్వరంలోనూ ప్రస్ఫుటమయింది.

"నేను మిమ్మల్ని నిర్లక్ష్యం చేశానని మీరెందుకనుకోవడమండీ? మీ అర్ధాంగిగా నేను నిర్లక్ష్యం చెయ్యడమేమిటి? అది నాలో పేరుకున్న నిర్లిప్తతకి, నాలో రగులుతోన్న ఆవేదనకి ప్రత్యక్ష నిదర్శనం. అంతేగాని అది నిర్లక్ష్యంకాదు."

"కాని, నువ్వు చెప్పినట్టుగా ఎదుటివాళ్ళకు అనిపించాలి కదా?"

"అర్థం చేసుకునే హృదయముంటే తప్పకుండా అలా అనిపిస్తుందండీ! అంతేకాదు- రాత్రి నాకొచ్చిన కల నా మనసుని పాడుజేసింది. ఆ పరధ్యానంలోనే ఇంకా వున్నాను. అనవసరంగా నన్ను అపార్థంచేసుకోవద్దని మనవి చేసుకుంటున్నాను" సౌమ్యంగానే చెప్పింది.

"ఏమిటా కల?"

"ఏదో అస్పష్టమైన కల... అవ్యక్తమైన కల. మా అమ్మా నాన్న గుర్తుకొచ్చారు"

"కలలంటే నమ్ముతావా?"

"నమ్మలేనంతగా ఎదగలేదండీ!"

"అస్పష్టంగా వచ్చిన కలకి నువ్వెందుకు కంగారుపడాలి? పరధ్యానమెందుకు?"

"ఏమోమరి... అమ్మానాన్నా గుర్తుకొచ్చారుగాబట్టి, వాళ్ళనోసారి చూసి రావాలనుకుంటున్నానండీ!" అంది.

నిజంగానే దీప్తి ఏదో పరధ్యానంలో వున్నట్టనిపించింది రామరాజుకి. ఆమెకి వున్న నమ్మకా

ల్ని తను నిరసించడమెందుకు...

"నీకు వెళ్ళాలని వుంటే నేను అవరోధపర్చను దీప్తి! కాని నీతోపాటు నేను రావాలంటే మాత్రం నాకిప్పుడు సెలవు దొరకదు. వారం పదిరోజులుపోయాక వెళ్తే?"

"పోనీ నన్ను ఇప్పుడు వెళ్ళనివ్వండి. సెలవు దొరికాక మీరు వద్దురుగాని"

భార్య ఆకాంక్షని అర్థంచేసుకున్నాడు. ఆమె కేసి సూటిగా పరికించాడు.

"ఒంటరిగా వెళ్ళగలవా?"

"ఏం పెద్ద దూరమండీ! మెయిల్లో అయితే ఆరుగంటల ప్రయాణమేగా? చదువుకున్నదాన్ని- ఆపాటి ఒంటరిగా ప్రయాణం చెయ్యలేనా?"

"సరే... నీ ఇష్టం. నువ్వంతగా వెళ్ళాలనుకుంటే వెళ్ళిరా- కాదనను"

ఆ అంగీకారం కోసమే ఎదురు చూస్తోంది, దీప్తి. భర్త వెళ్ళొద్దంటాడేమోనని మొదట్లో వూహించింది. అది కేవలం ప్రస్తుత పరిస్థితుల దృష్ట్యా ఆమె అపోహ మాత్రమే! ఇప్పుడామె హృదయం వుల్లాసంగా గంతులు వేసింది. భర్తను విడిచిపెట్టి వెళ్ళేందుకు ఓ పక్క ఆమె మనసు పీకుతున్నా, అలా వెళ్ళడం ప్రస్తుతానికి అవసరమేననిపించింది. భర్తకు దూరమై కొద్ది రోజులపాటు ఆ విరహాన్ని భరించక తప్పదనుకుంది. ఆమె అంతరంగంలో ఏదో నిర్ణయం జరిగేవుంది.

"అయితే రేపే వెళ్తానండీ..."

"అలాగే కానియ్ దీప్తీ! మళ్ళీ త్వరగా వచ్చేస్తావుకదా?"

"అక్కడి పరిస్థితులు చూసుకుని వస్తానండీ! మీకు కాస్తంత ఇబ్బంది అవుతుందనుకోండి. అయినా మీరు భరించాలి. ఏదో మంచి హొటల్లో భోంచేయండి"

"భోజనం సంగతి విడిచిపెట్టు. కాని నీ వియోగాన్ని ఎలా భరించేది? అయినా కొద్దిరోజులు భరిస్తాన్లే... ఏం చెయ్యను?"

"మీరు చాలా మంచివారండీ..." గోముగా అంటూ అక్కణ్ణించి వెళ్ళిపోయింది.

తాను తీసుకున్న నిర్ణయం సరైనదో కాదో నిర్ధారణ చేసుకోలేక సతమతమౌతోంది దీప్తి. అయినా మొండి పట్టుదల ఆమెను ముందుకు నడిపించింది.

రామరాజు దినచర్య ప్రారంభించాడు.

మామూలు సమయానికే భోజనం చేసి, ఆఫీసుకి బయల్దేరాడు. మరుసటి రోజు దీప్తి వెళ్తుందంటేనే అతనికి ఇప్పట్నించే నిరుత్సాహం ముంచుకొచ్చింది.

తలుపు వేసుకుందుకు వచ్చిన భార్యతో అన్నాడు-

"ఇవ్వాళ సాయంత్రం సినిమాకి వెళ్దాం. తయారుగా ఉండుదీప్తి" అని.

దీప్తికి నవ్వాగిందికాదు. నవ్వేసింది. ఆ నవ్వులో వెటకారం ధ్వనించింది రామరాజుకి.

"నవ్వుతున్నావేంటి?" సూటిగా ప్రశ్నించాడు.

"మీరు అర్థం చేసుకోకుండానే అలా అడుగుతున్నారా? కాదేమో! మీరు అలా చెబుతూ వెళ్ళడం మామూలే కదండీ. కాని పాపం మీరయినా ఏం చేస్తారు? సాయంత్రం అయ్యేసరికి ఏ భైరవమూర్తిగారో, మరో ఫ్రెండో ఇరకాటంలో పడేస్తారు. కథ మళ్ళీ మామూలే! అందుకే నవ్వొచ్చిందండీ!" సన్నగా నవ్వుతూనే అంది దీప్తి.

రామరాజు సిగ్గుపడిపోయాడు. భార్య ఇలా దెప్పి పొడిచినందుకు బాధపడలేదుగాని, ఆమె తెలివితేటల్ని మనసులోనే అభినందించుకున్నాడు. ఇటువంటి అవకాశాన్ని కలిగించినందుకు తనని తానే తిట్టుకున్నాడు. తప్పుచేసిన వ్యక్తి ఎన్ని విమర్శలకు గురవుతాడో ఇప్పుడు తెలుసుకున్నాడు.

"ఈరోజు అలా జరగదులే దీప్తీ! తప్పకుండా వెళ్దాం. నా మాట మీద నమ్మకం ఉంచు" హామీ ఇస్తూ నిష్క్రమించాడు రామరాజు.

దీప్తి బాధగా నవ్వుకుంది. ఆ హామీ విలువెంతో ఆమెకి బాగా తెలుసు. తలుపు గడియ వేసి పనుల్లో నిమగ్నమయ్యింది.

* * *

సాయంత్రం అయిదుగంటలు కొట్టింది గడియారం. అప్పుడే నిద్రలేచి టీ తీసుకున్న దీప్తి, ముస్తాబవ్వడం ప్రారంభించింది. భర్త

పెందరాళే వస్తానని హామీ ఇచ్చినా అతని హామీపై నమ్మకం లేక, రాడన్న అనుమానం మనసులో మెదులుతూనే ఉంది. అయినా ఆ రోజు పట్టుదలతో రావచ్చునేమోనన్న ఆశా బీజం మొలకెత్తిందామెలో. అందుకే తొందరగా ముస్తాబయి కూచుంది.

కాని ఆమె దురదృష్టం- ఆరోజూ నిరాశే ఎదురయ్యింది దీప్తికి. వేళకి రాలేదు రామరాజు. దీప్తి మనోభావాలు షరా మామూలే. ఆమెలో నిరాశతోబాటు ఉక్రోషం చోటుచేసుకున్నాయి. కట్టుకున్న చీర ఆమెను పరిహసించినట్టయింది. వెంటనే దుస్తులు మార్చేసుకుంది. తన దురదృష్టాన్ని తిట్టుకుంది. చెమ్మగిల్లిన కళ్ళను ఒత్తుకుంది. ఆయన ఎందుకిలా ప్రవర్తిస్తున్నారో ఆమెకి అర్థం కాలేదు. కావాలనే ఆయనలా ప్రవర్తిస్తున్నారా?... సందేహమొచ్చింది. ఏవీ తేల్చుకోలేకపోయింది. నీరసంగా సోఫాలో చేరబడింది.

రామరాజు ఇంటికి వచ్చేసరికి ఎనిమిది గంటలు దాటింది.

తలుపుతట్టిన తప్పుడు కాగానే చప్పున వెళ్ళి తెరిచింది దీప్తి. ఎదురుగా రామరాజు- అతని పరిస్థితి క్రితంరోజులానే ఉంది.

"సారీ దీప్తీ... నేను..." అని ఇంకేదో చెప్పబోతున్నాడు రామరాజు.

దీప్తి ముక్కు మూసుకుంది. మత్తువాసన భరించలేకపోయింది.

"సంజాయిషీ అక్కర్లేదులెండి... పదండి లోపలికి- భోజనం చేద్దురుగాని..." అంటూ భర్త లోపలికి రాగానే తలుపు గడియవేసింది.

రామరాజు తృప్తిగా ఓ నిట్టూర్పు వదిలాడు. తాను ఇల్లు చేరగానే భార్య తప్పకుండా రాద్ధాంతం చేస్తూ, ఓ సీను సృష్టిస్తుందనుకున్నాడు మొదట్లో. కాని అతను ఊహించినట్టుగా దీప్తి ఏ విధమైన రభసా చెయ్యకపోవడం, సౌమ్యంగా ప్రవర్తించడం అతనికి ఆనందాన్ని కలిగించింది. భార్య కనబర్చిన ఇంగితానికి, మనసులోనే సంతోషించాడు. అర్ధాంగి అంటే ఇలాగే వుండాలి... అనుకున్నాడు. తన గదిలోకి పోయి బట్టలు మార్చుకుందుకుపక్రమించాడు.

దీప్తి తనలో రగులుతున్న ఆవేదనని, ఆక్రోశాన్ని బలవంతంగా చల్లార్చుకుంది. ప్రస్తుతానికి గుండెను రాయిగా మార్చుకుంది. తాను ఎంత బాధపడినా, ఆవేశం తెచ్చుకున్నా వర్థి కంఠశోష తప్పించి, ప్రస్తుతానికి మరో ప్రయోజనం అగుపించలేదనుకుంది. అందుకనేమో ఏ విధమైన రభసా చెయ్యదల్చుకోలేదు. ఎట్లాగూ ఆమె మర్నాడే కన్నారింటికి ప్రయాణం కడుతోందాయె. భవిష్యత్తులో ఏం చెయ్యాలో తర్వాత నిర్ణయించుకోవచ్చుననుకుంది.

భార్య మౌనాన్ని ఆమె సహనంగా, ఓర్పుగా అర్థంచేసుకున్నాడు రామరాజు. భారత గృహిణిగా ఆమె పాత్ర చక్కగా నిర్వహిస్తోందనుకున్నాడు. అంతేగాని, ఆమె అంతరంగంలో అగ్నిపర్వతం బుసలుకొడుతున్నట్టు భావించలేకపోయాడు.

"రండి... భోంచేద్దురుగాని..." పిల్చుకుపోయింది దీప్తి.

"నువ్వు భోంచేయవా?" ప్రశ్నించాడు రామరాజు- డైనింగ్ టేబులు మీద తనొక్కడికే వడ్డించి వుండటాన్ని గమనించి.

"నేను తర్వాత భోంచేస్తాన్లెండి..."

"ఊహూ... నువ్వూ వడ్డించుకో. ఇద్దరమూ ఒకేసారి భోంచేద్దాం" మొరాయించినట్టు అన్నాడు రామరాజు.

భర్త అంతగా చెబుతూ వుంటే, తాను మొండికేసి భోజనం మానేయడం మంచిదికాదేమోననిపించింది దీప్తికి. అందుకే తానూ వడ్డించుకుని భోంచేసింది.

రామరాజు తృప్తిగా నవ్వుకుని, భోజనం ముగించాడు. పడకగదిలోకి వెళ్ళి మంచంమీద ఒరిగిపోయాడు. అతనికి చప్పున నిద్రపట్టేసింది.

దీప్తి వంటగది చక్కబెట్టుకుని వచ్చి భర్త హాయిగా నిద్రపోతున్నట్టు గమనించి ఓ నిట్టూర్పు విడిచింది.

భర్త పక్కనే చేరబడింది.

ఆమె హృదయం మౌనంగా బావురుమంది.

రామరాజు ఇవేమీ పట్టించుకోనట్టుగా గురకతీస్తూ, నిశ్చింతగా నిద్రపోతున్నాడు.

దీప్తికి ఒక పట్టాన నిద్రపట్టలేదు. తాను విజయవాడ వెళ్ళిపోవాలని నిశ్చయించు

చమత్కార ప్రపంచం

# ఎడారి పోస్ట్‌మెన్

"బతుకు ఎడారి మయమాయె-వెతల ఎండమావిగా మారె...' అంటూ కవిత్వాలు రాసి పాడుకోవడం కాదు... స్వయంగా ఎడారికి వెళ్ళి ఒక్కరోజు గడిపితే అర్థమవుతుంది ఎడారి బతుకులెంత సెగలు గక్కుతుంటాయో, రాజీవడి పొగలే వెన్నెలనుకుంటాయో!

ఎడారిప్రాంతాలలో చిన్నచిన్న పల్లెలనేకం. అక్కడ లైటు స్థంభాల్లేవు. టెలిఫోన్



తీగలు లేవు. బ్యాంకింగ్ వ్యవస్థ లేదు. పోస్టాఫీను సౌకర్యం లేదు. మరి నాగరికతకు దూరంగా, సమస్త అసౌకర్యాలతో ఎడారుల్లో మనుషులు ఎలా జీవిస్తున్నారు?

సైకిళ్ళూ, మోటార్లూలాంటి వాహనాలేవీ ఆ ఎడారిదారుల్లో పయనించలేవు. కాబట్టి ఎడారి ఓడగా పేరు సంపాదించుకున్న ఒంటెయే ప్రస్తుతం పోస్టాఫీసు చేరవేత కార్యక్రమాన్ని దిగ్విజయంగా నిర్వహించి ప్రశంసలందుకుంటోంది.

థార్‌ఎడారిలో హునంగ్సర్ అనే మారుమూల గ్రామం ఉంది. ఈ గ్రామస్థులకి బాహ్యప్రపంచంతో ఎలాంటి సంబంధాలూ లేవు. ఏకొద్దో ఉన్నా అవి ఒంటె కారణంగానే అని చెప్పుకోవచ్చు. బికనీర్ జిల్లా గెర్సర్ నుంచి ఈ ఒంటె బయల్దేరుతుంది. హునంగ్సర్ గ్రామ పరిసరాల్లో, చిన్నచిన్న పల్లెటూళ్ళలో 700కు పైగా ఎడారి తెగలవారు జీవిస్తున్నారు. ఈ ప్రాంతాల్లో పోస్టాఫీను లేదు కాబట్టి ఈ ఒంటె పోస్టల్ సర్వీసుల్ని నిర్వహిస్తోంది.

ఒంటె మూపుభాగంలో ఎర్రని పోస్టల్ పెట్టెను కట్టి ఉంచుతారు. మరోపెట్టెలో స్టాంపులూ, కవర్లూ వగైరా స్టేషనరీ వుంటాయి.

ఈ ఒంటె నెక్కిన పోస్ట్‌మన్ మామూలు పోస్ట్‌మన్ కంటే అధికంగానే విధుల్ని నిర్వహిస్తాడు. అతను గ్రామీణులతో చక్కని అవగాహనా, స్నేహం పెంచుకున్నాడు. అతను ఉత్తరాలూ, మనీ ఆర్డర్లు అందించి నిరక్షరాస్యులైన ఆ గ్రామీణులకు ఉత్తరాలు చదివి చెబుతాడు కూడా. ఆవిధంగా స్వల్పకాలంలోనే స్థానికులకు ఆత్మీయుడయ్యాడు. ఎడారి గుడిసెల్లో అతనికెప్పుడూ ఆహ్వానమే. ఈ ఒంటె వాహనపు తపాలా బట్వాడా నష్టంలో నడుస్తున్నా ప్రస్తుతానికి ఎలాగో నిర్వహిస్తున్నారు. ఈ ఒంటెపై ఎక్కి టపాలు పంచే పోస్ట్‌మెన్‌కి నెలకి 165 రూపాయలు వేతనం లభిస్తుండగా ఒంటెకి 80 రూపాయలు జీతం. ★

కుందిగాని, భవిష్యత్తులో తన కార్యక్రమం ఏమిటో నిర్ణయించుకోలేదు. ఈ వాతావరణం నుంచి మొదట బైటపడితే, కొంతంత మన శ్శాంతి అయినా వుంటుందనుకుంది. అక్కడి కి వెళ్ళాక ఏం చెయ్యాలో నిర్ణయించుకోవాల నుకుంది.

మెల్లగా నిద్రదేవత ఒడిలోకి జారుకుంది దీప్తి.



మర్నాడు ఆఫీసుకి వెళ్ళిన రామరాజు చక చకా పనిచేస్తున్నాడు. ఎవరు పలుకరించినా తలెత్తకుండానే సమాధానం చెబుతున్నాడు.

"ఏమిటి రామరాజూ... ఇవ్వాళ మరీ శ్రద్ధగా పన్జేస్తున్నావు? నీకున్న శ్రద్ధలో నాలుగో వంతు మిగిలినవాళ్ళకు వుంటే పెండింగు కేసులు మచ్చుకయినా కనిపించకుండా వుండునోయ్" అన్నాడు ఆఫీసు సూప రింటెండెంటు రామారావు.

"మధ్యాహ్నం మెయిలుకి మా ఆవిడ వూరి కి వెళ్తోంది సార్! నేను వెళ్ళాలి- కాస్త పర్మిషను కావాలి"

"తప్పకండా వెళ్ళవోయ్- నీకు పర్మిషనివ్వ డానికి నాకు ఎప్పుడూ అభ్యంతరం ఉండదు" అన్నాడు రామారావు.

"థాంక్స్‌సార్..."

అప్పుడే అక్కడికి వస్తోన్న భైరవమూర్తి ఆ మాటలు విని, మళ్ళీ వెనక్కి మళ్ళిపోయాడు. రామారావుగారు ఏమైనా అంటారేమోనని అతని భయం.

కాస్త ముందుగానే ఇంటికి వెళ్ళాడు రామ రాజు. అప్పటికి దీప్తి రెడీగా ఉంది. ఇంటికి తాళంవేసి, భర్తకి అందించింది దీప్తి.

ఇద్దరూ ఆటోలో బయల్దేరి స్టేషన్‌కి వచ్చేశా రు. "టిక్కెట్టు తీసుకుని వస్తానుండు..." అంటూ బుకింగు కౌంటరుకేసి వెళ్ళాడు రామ రాజు.

దీప్తి ప్లాట్‌ఫామ్‌మీద ప్రయాణీకులకోసం వేసివున్న కుర్చీలో కూచుంది. రైల్వే డిపార్టు మెంటువారు ప్రయాణీకుల సౌకర్యంకోసం మంచి ఏర్పాట్లే చేశారనుకుంది.

రామరాజు టిక్కెట్టు తీసుకుని వచ్చాడు భార్య ఉన్నచోటుకి.

"దీప్తీ... ఈ టిక్కెట్టు నీ బాగ్‌లో పెట్టుకో" అని టిక్కెట్టు అందించి, జేబులోంచి పర్సు తీసి అందులోని అయిదు పదిరూపాయల నోట్లు కూడా ఇస్తూ"- "ఈ యాభై రూపాయలు కూడా ఉంచు" అన్నాడు.

దీప్తి టిక్కెట్టుని, ఆ పైకాన్ని భద్రంగా బాగ్‌లో పెట్టుకుంది.

మెయిలు వస్తున్నట్టు అనౌన్స్‌మెంట్ చేశా రు.

"రైట్ టైమ్‌కే వచ్చేస్తోంది... బతికాం..." అన్నాడు రామరాజు. మెయిల్‌వచ్చి ఆగింది.

సెకెండ్‌క్లాసు కంపార్టుమెంట్లలో పెద్దగా రద్దీలేదు. ఓ కంపార్టుమెంటులో కిటికీ దగ్గర సీటు దొరికింది. అక్కడ భార్యను కూచోబెట్టి, సూట్‌కేసుని ఆమె సీటుకిందనే పెట్టాడు రామరాజు.

"సూట్‌కేసు జాగ్రత్త దీప్తీ!" కంపార్టు మెంటులోంచి బైటికొచ్చి కిటికీ దగ్గరే నిల్చుంటూ మెల్లగా అన్నాడు.

"అలాగేనండీ!" ముక్తసరిగా అంది.

"కిటికీ దగ్గరే కూచున్నావు... నీ మెళ్ళో వస్తువులు జాగ్రత్త" అన్నాడు.

దీప్తి భర్తమాటలు విన్నవెంటనే, చీరచెంగు తీసి భుజమ్మీంచి కప్పేసుకుంది. తాను మెళ్ళో వేసుకున్న బంగారు వస్తువులు, రైళ్ళో కూడా అందరికీ అగుపించాలన్న తాపత్రయం భార్యకు లేనందుకు ఎంతో సంతోషించాడు రామరాజు.

"నువ్వు విజయవాడ వెళ్తానంటే నేను కాద నలేకపోయానుగాని, నా ధ్యాసంతా నీపైనే ఉంటుంది దీప్తీ! మీ అమ్మా నాన్నా కలలో

కనిపించారని, ఓసారి చూసి రావాలని నువ్వు వెళ్తానంటే వద్దని వారించేటంత మూర్ఖుణ్ణికాదు నేను. అయితే నేనిక్కడ ఒంటరితనాన్ని భరించాల్సి వస్తుంది. నువ్వులేని ఇల్లు బోసిగా ఉంటుంది. నీ ఎడబాటు ఎలా భరించడమా అని ఇప్పట్నుంచే భయంపట్టుకుంది. త్వరగా వచ్చేస్తావనే నమ్ముతున్నాను దీప్తీ'' అన్నాడు రామరాజు.

భర్త మాటల్లో ఎంతో ఆప్యాయత, అనురాగం ధ్వనించాయి. ఏదో బలహీనత కారణంగా తాత్కాలికమైన ఎడబాటు వచ్చింది గాని, వాస్తవానికి ఆయన ఎంత మంచివారు; ఆ మాటల్లో సౌమ్యత, మనసులోని మార్దవం, చూపుల్లో చల్లదనం ఎంతమంది మగవాళ్ళకి ఉంటాయని... అనుకోకుండా ఉండలేకపోయింది దీప్తి.

ఆమె హృదయం ఆర్ద్రమయింది. కళ్ళు చెమర్చినయ్. తాను వెళ్ళిపోతూఉండటం తనకీ బాధగానే ఉంది. కానీ ఏం చేస్తుంది- తప్పనిసరి ప్రయాణమిది!

''అట్లాగేనండీ- త్వరలో వచ్చేస్తాను. మీరోసారి రండి... ఇద్దరం కలిసే వచ్చేద్దాం. మీ మనస్సేమిటో నాకు తెలుసునండీ; కానీ నన్నే మీరు అవగాహన చేసుకోలేకపోయారేమోనని పిస్తోందండీ! నేను మిమ్మల్ని అర్థించేది ఒక్కటేనండీ- నేను లేనపుడు ఒంటరిగా కూచుని, మీ గురించి మరోసారి ఆలోచించుకోండి, ఆత్మ విమర్శ చేసుకోండి. అంతకంటే నేను చెప్పాల్సిందేమీలేదు'' ముక్తసరిగా అంది. ఆమె కళ్ళు చెమర్చాయి. రుమాలుతో ఓసారి కళ్ళొత్తుకుంది.

భార్య అలా అన్నందుకు, ఈసారి కోపం తెచ్చుకోలేదు రామరాజు. భార్య ఎందుకలా అన్నదో అర్థమయిందతనికి. సన్నగా మందహాసం చేశాడు.

''తీరిగ్గా ఉంటానుకదా, ఆలోచిస్తాలే...''

సరిగ్గా అదే సమయంలో భైరవమూర్తి అలా వెళ్తూ రామరాజుని చూశాడు.

''హల్లో రా...జూ ఎక్కడికి ప్రయాణం?'' అంటూ అతనికి దగ్గరగా వచ్చాడు.

''నేనెక్కడికీ వెళ్ళడంలేదురా- దీప్తి వాళ్ళ వాళ్ళింటికి వెళ్తుందని చెప్పానుకదా?'' సమాధానం చెప్పాడు రామరాజు.

''ఔనౌను... చెప్పావుకదూ- మర్చేపోయానురా. మా బంధువులు రాజమండ్రి వెళ్తూవుంటే, వీడ్కోలు చెప్పడానికి స్టేషనుకి వచ్చాను. ఔనూ- దీప్తిగారూ... మీరిలా మావాణ్ణి ఒంటరివాణ్ణిచేసి వెళ్ళిపోతే ఎలా చెప్పండి. మీ వివాహమై ఎన్నాళ్ళయిందని? అనుక్షణం ఆనంద తరంగాలలో తేలియాడాల్సిన నూతన దంపతులు ఇలా తాత్కాలికంగానయినా ఎడబాటుకావడం, ఎంత బాధగా ఉంటుందండీ! ఇది మీకు సబబుకాదండీ దీప్తిగారూ'' మెల్లగా నవ్వుతూ అన్నాడు భైరవమూర్తి.

భైరవమూర్తి మాటల్లో, ఎకసెక్కెపుపాళ్ళు అధికంగా ఉన్నట్టు గ్రహించింది దీప్తి. నిజానికి భైరవమూర్తిని చూస్తేనే చాలు, దీప్తికి ఒళ్ళు కంపరమెత్తుతుంది. ఇప్పుడేమో అతనలా నవ్వుతూ, తనేదో తప్పు చేస్తున్నట్టుగా తన ప్రయాణం గురించి వ్యాఖ్యానించినందుకు మరింత మండిపోయింది. కోపంతో ఆమె మొహం ఎర్రబారింది. అయితేనేం- భర్త సమక్షంలో కటువుగా ప్రవర్తించకూడదనుకుంది. ఇంతకుమునుపు ఆయన తనని హెచ్చరించడం గుర్తుంది. అందుకే కోపాన్ని దిగమింగుకుంది.

''మనసులు కలిశాక మనుషులు ఎక్కడున్నా ఇబ్బంది లేదండీ మూర్తిగారూ! ఎంత దూరంలోవున్నా ఒకరి మనసు, మరొహరి మనసుతో మాట్లాడుకుంటుంది గాబట్టి, విరహబాధ ప్రసక్తే ఉండదండీ! అయినా మా ఈ తాత్కాలికమైన ఎడబాటు మీకు ఆనందాన్ని కలిగించాలే...'' కృత్రిమమైన నవ్వు పెదాలపై తెచ్చుకుంటూ అంది దీప్తి.

భైరవమూర్తికి దీప్తి మాటలు అంకుశపు పోటుల్లానే తగిలినయ్. అయితే ఆ అనుభూతిని బాహ్యంగా కనిపించనివ్వలేదు. ఆమె ఏ భావంతో అలా అన్నదో గ్రహించాడు మూర్తి. ఏం సమాధానం చెప్పాలో అతనికే బోధపడలేదు. అదోలా నవ్వేశాడు.

అసలు భైరవమూర్తి స్టేషనుకి రావడానికి కారణం రాజమండ్రి వెడుతోన్న బంధువులకు వీడ్కోలు చెప్పడానికాదు అటువంటివాళ్ళెవరూ లేరుకూడా- అదో సాకుగానే చెప్పాడు.

కేవలం దీప్తి వెళ్ళిపోతోందని చూడ్డానికే వచ్చాడు. సాగనంపే సద్భావంతోకాదు అతను రావడం తన సంసార జీవితంలో సుఖశాంతులు లోపిస్తున్నందుకు బాధతో కుమిలిపోతూ, మనోవేదనతో తల్లడిల్లిపోతూ దీప్తి అగుపిస్తుందని, అటువంటి దీప్తిని తన మాటల ఈటెలతో మానసికంగా బాధించవచ్చునన్న కసితో, కక్షతో వచ్చాడు.

కాని భైరవమూర్తి ఆశించిన అనుభూతి దీప్తిలో అగుపించలేదు సరికదా, సరదాగా, ఆనందంగానే ఉంది. అతనికి ఆశ్చర్యం కలిగింది. దీప్తిలో అంత ఓర్పు, సహనం ఉందా?



లేక ఆమె ఏవీ పట్టించుకోవడంలేదా?... అతనిలో సందేహాలు మెదిలాయి. ఇంక అక్కడ ఒక్కక్షణం ఉండలేకపోయాడు.

"బండి విడిచిపెట్టే సమయం కావస్తోంది. మా వాళ్ళను కలిసి వస్తాలే రాజూ? వస్తానండీ దీప్తిగారూ" గబగబా అనేసి జనంలో కలిసిపోయాడు భైరవమూర్తి.

"అదేమిటి దీప్తీ, అలా అన్నావు? నువ్వు నాకు తాత్కాలికంగా దూరమైతే భైరవమూర్తికి

ఆనందంగా వుండటమేవిఁటి చెప్పు? నీమాట లకి వాడెంతగా బాధపడివుంటాడో యోచించావా? అసలు వాణ్ణి చూడగానే నువ్వు ఏహ్యభావంతో, ద్వేషభావంతో ప్రవర్తిస్తావెందుకు?'' ప్రశ్నల వర్షం కురిపించాడు రామరాజు.

''అబ్బే... అతనంటే నాకెందుకండీ ఏహ్య భావం? మూర్తిగారు పరిహాస ధోరణిలోనే అన్నారు. నేను మాత్రం తక్కువతిన్నానా? నేనూ పరిహాస ధోరణిలోనే సమాధానం చెప్పాను. నేను లేకపోతే మీరూ, ఆయనా విచ్చలవిడిగా తిరగొచ్చు... అది అతనికి ఆనందంకాదా? ఇందులో ఆయన బాధపడాల్సిందేవిఁటో నాకు అర్థంకాదు. అయినా ఆయనకంటే మీరే ముందుగా బాధపడిపోతున్నారేవిఁటి?'' నవ్వుతూనే చురక తగిలించింది దీప్తి.

గార్డు విజిల్ వూదుతూ, ఆకుపచ్చజెండా వూపాడు. మెయిలు కూతకూసుకుంటూ కదిలింది.

''వెళ్ళొస్తానండీ! మీ ఆరోగ్యం జాగ్రత్త, మీరు ఎప్పుడు వస్తున్నదీ ఉత్తరం రాయండి. రాత్రిళ్ళు ఇంటిపట్టున ఉండండేం...'' భార్యగా తన కర్తవ్యాన్ని నిర్వర్తించింది దీప్తి.

''మీ నాన్నగారికి, అమ్మగారికి నా నమస్కారములు చెప్పు. నాకు సెలవు దొరక్కపోతే ఇప్పట్లో రాలేను. ఉత్తరం రాస్తాలే వివరాల్తో. జాగ్రత్తగా వెళ్ళు'' అన్నాడు రామరాజు.

ఇరువురూ చిరునవ్వుల్తో వీడ్కోలు పలుక్కున్నారు. మెయిలు వేగాన్నందుకుంటోంది. రామరాజు చేయి వూపుతూ జనంలో కలిసిపోయాడు.

దీప్తి తన చేతిని లోపలికి తీసుకుంది. బరువుగా ఓ నిశ్వాసంవదిలింది. ఊహించని విధంగా తామిద్దరూ పరస్పరం తాత్కాలికంగా నయినా దూరమవుతున్నందుకు ఎంతో బాధనిపించిందామెకి. ఈ ఎడబాటు పరిణామం ఎలా వుంటుందో కాలమే నిర్ణయిస్తుందనుకుంది. ఆమె కళ్ళు అప్రయత్నంగా అశ్రుపూరితాలయ్యాయి. రుమాలుతో ఒత్తుకుంది.

భర్తని విడిచిపెట్టలేకనే అలా పరితపిస్తోందని, ఆ కేబిన్‌లో వున్నవాళ్ళనుకున్నారు. కాని ఆమె అంతరంగం వాళ్ళకేం తెలుసు?

మెయిలు మరింత వేగాన్ని అందుకుంది.

★ ★ ★

ఆటోలో సురక్షితంగా ఇంటికి చేరుకుంది దీప్తి. స్టేషనుకి దగ్గర్లోనే ఇల్లుగాబట్టి నిబ్బరంగా వెళ్ళిపోగలిగింది.

తలుపు తట్టింది.

తల్లి దేవకి వచ్చి తలుపు తెరిచింది. ఎదురుగా కూతుర్ని చూసి ఆశ్చర్యపోయింది. హఠాత్తుగా ఇలా వచ్చేసిందేవిఁటా అనిపించిందామెకి.

''ఉత్తరం ముక్కయినా రాయకుండా వచ్చేశావేవిఁటే? అల్లుడు రాలేదా?'' ప్రశ్నలు వేసింది దేవకి.

''ఆయన తర్వాత వస్తానన్నారే. మిమ్మల్ని చూడాలనిపించి నేనే బయల్దేరి వచ్చేశాను...'' అంటూ లోపలికి నడిచింది దీప్తి.

దేవకి తలుపు గడియపెట్టుకుని వచ్చింది.

పుస్తకం చదువుతున్న దేవరాజు కళ్ళద్దాలు సర్దుకుంటూ-

''హఠాత్తుగా వున్నపాటున ఇలా వచ్చేశావేవిఁటమ్మా? అదీ ఒంటరిగా వచ్చావు... మీ ఇద్దరి మధ్యా రభసేం జరగలేదుకదా?'' అనుభవజ్ఞుడు గాబట్టి బాధ్యతాయుతంగా అడిగాడు దేవరాజు.

''అబ్బే... అటువంటిదేంలేదు నాన్నా! మిమ్మల్ని చూడాలనిపించి వచ్చేశాను. ఆయనకి సెలవు దొరకలేదు గాబట్టి తర్వాత వస్తారు...'' తడుముకోకుండా చెప్పేసింది.

తృప్తిగా చిరునవ్వు నవ్వుకున్నాడు దేవరాజు.

''చాలా సంతోషమమ్మా'' అంటూ కళ్ళద్దాలు తీసి బల్లమీదపెట్టి- ''నేనే అనుకుంటున్నానమ్మా, ఓసారి వచ్చి నిన్నూ, అల్లుణ్ణీ చూసిరావాలని. ఇంతలో నువ్వే వచ్చేశావు. చాలా సంతోషం'' అన్నాడు దేవరాజు.

దీప్తి సూట్‌కేసు పక్కనపెట్టి సోఫాలో కూచుంది.

దేవకి కూతురుకేసి పరికించి చూస్తోంది. ''బాగా చిక్కిపోయావేవిఁటమ్మా?'' లాలనగా

కూతురు తల నిమురుతూ అంది.

దీప్తి సన్నగా నవ్వింది.

"ప్రతి తల్లికీ తన పిల్లలు ఎప్పుడూ చిక్కిపోయినట్టే అగుపిస్తారులే అమ్మా, అది సహజం! తల్లిప్రేమ అట్లాంటిది. నిజానికి నాలో ఏవీఁ మార్పులేదు. ఎప్పటిలానే వున్నాను..." మందస్మిత వదనంతో అంది.

దేవరాజు కలిగించుకున్నాడు- "బాగా చెప్పావమ్మా దీప్తీ!"

"సరేగాని... నిన్ను మా అల్లుడు బాగా చూసుకుంటున్నాడా?" వుండబట్టలేక అడిగింది దేవకి.

"ఆయనకి నేనంటే వల్లమాలిన అభిమానమమ్మా. ఎప్పుడూ దీప్తీ దీప్తీ అనుకుంటూనే నా చుట్టూ తిరుగుతూ వుంటారు. అసలు ఇప్పుడు నేనిలా ఆయన్ని వదిలి రావడం, ఆయనకి సుతరామూ ఇష్టంలేదమ్మా! కాని ఏంచెయ్యడం? మిమ్మల్ని చూడ్డానికి వస్తున్నానంటే కాదనలేకపోయారు"

"మీ ఇరువురిమధ్య అటువంటి అనురాగమే మేం కోరుకునేదమ్మా! అప్పుడే స్త్రీజన్మ ధన్యమైనట్టు. మాకెంతో ఆనందంగా వుందమ్మా..." మురిసిపోతూ అంది దేవకి.

అంతా వింటోన్న దేవరాజు మనసులో ఆనందంతో పరవశుడయ్యాడు. ఆడపిల్ల తండ్రికి అంతకంటె కావల్సిన తృప్తి ఏముంటుంది?

"సరేనమ్మా... స్నానం చేస్తావేమో చేసిరా అమ్మా! భోజనం చేద్దువుగాని..." అంది దేవకి వంటగదికేసి వెళ్తూ.

దీప్తి సూట్‌కేసు పట్టుకుని గదిలోకి వెళ్ళింది. టవలు, బట్టలు తీసుకుని బాత్రూమ్‌వేపు నడిచిందామె.

కూతురు తమపై ధ్యాస పుట్టడంవల్లనే తమని చూసిపోవాలని వున్నపాటున బైలుదేరి వచ్చిందని దేవరాజు దంపతులు భావించారు. పాపం, వారికి ఎలా తెలుస్తుంది, దీప్తి ఎటువంటి పరిస్థితుల్లో ఇక్కడికి వచ్చిందో?

దీప్తి కావాలనే అబద్ధం చెప్పింది కొంతమేరకు. నిజాన్ని బైటపెట్టి, తన సంసారిక జీవితం గురించి ఎన్నో కలలుగని, ఆశల్ని పెంచుకున్న తలిదండ్రులకు మనస్తాపం కలిగించడం ఆమెకి ఇష్టంలేకపోయింది.

అయితే తాను తీసుకున్న నిర్ణయాన్నిబట్టి, నిజం వారికి తెలీక మానదు ఎప్పుడో ఓసారి. అప్పుడు వారికి క్షమాపణ చెప్పుకోవాలనుకుంది.

స్నానంచేసి, బట్టలు మార్చుకుని వచ్చింది దీప్తి. వంటగదిలోకి వెళ్ళి, తల్లితో కబుర్లు చెప్పుకుని చాలాసేపు కూచుంది. తనలో దాక్కున్న బాధని, ఆవేదనని సూచాయగానయినా వ్యక్తం కానీయకుండా జాగ్రత్తపడుతోంది.

★ ★ ★

రామరాజు వివాహం జరిగి నాలుగు నెలలు నిండింది.

ఈ నాలుగునెలలకాలంలో రామరాజు ఇల్లు కళకళలాడుతుండేది- గృహిణిగా దీప్తి ఆఇంట్లో మసలడంవల్ల.

దీప్తి ఆ ఇంటిని స్వర్గతుల్యంగా మార్చింది. కాని, ఆమె వెళ్ళిన తర్వాత ఆ ఇల్లు కళావిహీనంగా, నిశ్శబ్దవాతావరణంలో బోసిపోయినట్టుగా వుంది.

నాలుగు నెలల సంసార జీవితంలో మధురానుభూతుల్ని పొందిన రామరాజుకి, దీప్తి లేనిలోటు స్పష్టంగా తెలిసొస్తోంది. అతనికి ఒంటరిగా బతుకునీడ్చడం కష్టసాధ్యమే అవుతోంది. జీవితం సారహీనంగా, ఓ ఎడారి బతుకులా తోస్తోంది. సంసారంలో గృహిణి ఎంత ఆవశ్యకమో రామరాజు గ్రహించుకున్నాడు.

దీప్తి విజయవాడ వెళ్ళి నాలుగురోజులే అయినా, ఎన్నో యుగాలయినట్టుగా ఫీలవుతున్నాడు రామరాజు.

ఆరోజు సాయంత్రం ఆరున్నర దాటింది.

బైట చిన్న వర్షపుజల్లు పడుతోంది. ఆ జల్లు ఓ వింత సంగీతాన్ని ఆలపిస్తున్నట్టుగా అనిపిస్తోంది రామరాజుకి. కిటికీలోంచి చల్లటిగాలి వీస్తోంది.

సోఫాలో కూచున్నాడేగాని, అతని మనసు నిండా దీప్తే ఆక్రమించుకుంది. ఎప్పుడొస్తుందా, అన్న ఆలోచనే అతని మెదడులో నిండిన ప్రశ్న. త్వరలో వచ్చేస్తే బావుండునని

అతని ఆశ.

రాత్రికి వంటచేసుకునే ఓపికలేదు రామరాజుకి. అంతగా నిస్సత్తువ ఏర్పడిందతని ఒంటరితనంవల్ల. హోటలుకిపోయి భోజనం చెయ్యాలంటే వర్షం పడుతోందాయె. బిస్కెట్లు, చిప్సు, మిక్చర్... ఇవన్నీ వున్నాయి ఇంట్లో. వాటితో కడుపు నింపుకుని పాలు తాగేయొచ్చనుకున్నాడు. అందుకే గేస్‌స్టవ్‌మీద పాలు వేడిచేస్తున్నాడు.

వీధిలో ఆటో ఆగిన చప్పుడయింది. స్టవ్ ఆఫ్‌చేసి, బహుశా దీప్తి వచ్చేసుంటుందన్న భావనతో ఆత్రంగా వెళ్ళాడు వీధి గుమ్మంకేసి. ఎవరూ తలుపు తట్టకండానే తలుపు తెరిచాడు.

నిరాశే ఎదురయింది రామరాజుకి. దీప్తి రాలేదు. కాని ఆటోలోంచి దిగుతోన్న భైరవమూర్తి, శ్రీపతిని చూసి దీర్ఘంగా ఓ నిట్టూర్పు విడిచాడు. ఆ సమయంలో వాళ్ళు రావడం అతనికి నచ్చలేదు.

"ఈవేళప్పుడు వచ్చారేవిట్రా?" ప్రశ్నించాడు ఉత్సాహరహితంగా.

"వాతావరణం చూశావా ఎట్లా వుందో? ఇటువంటి వాతావరణం ఎప్పుడూ వుండదురా. ఈ వాతావరణాన్ని సద్వినియోగం చేసుకోవాలి. అందుకే వచ్చేశాం..." అంటూ చేతిలోని సంచితో లోపలికి నడిచాడు భైరవమూర్తి. శ్రీపతి సన్నగా నవ్వుకుంటూ మూర్తిని అనుసరించాడు.

తలుపు గడియవేసుకుని లోపలికి వచ్చాడు రామరాజు.

భైరవమూర్తి, శ్రీపతి అప్పుడే సోఫాలో తిష్టవేశారు. రామరాజు వారికి అభిముఖంగా కూచున్నాడు. "కాఫీ తీసుకుంటారా, లేక హార్లిక్సా?" అడిగాడు రామరాజు.

"రెండింటిలో ఏదీ వొద్దులే" జవాబిచ్చాడు భైరవమూర్తి.

"ఔనూ- మీరు వస్తున్నట్టు మాటవరసకయినా ఆఫీసులో చెప్పలేదేంరా?" భైరవమూర్తి కేసి చూస్తూ అన్నాడు రామరాజు.

భైరవమూర్తి చిన్నగా మందహాసం చేశాడు.

"అప్పటికి ఆ శుభవార్త మాకు తెలిస్తేగా?" అన్నాడు.

ఆ శుభవార్త ఏమిటో తెలుసుకోవాలన్న ఆసక్తి రామరాజులో ఉత్పన్నమయ్యింది.

"ఏవిట్రా ఆ శుభవార్త!" కాస్త ముందుకు వంగి మరీ ప్రశ్నించాడు.

"మేం ఆఫీసునుంచి వెళ్తూవుంటే ఆనందాచారి అగుపించాడు. మనకోసమే వస్తున్నట్టు చెప్పాడు. విషయం ఏవిటని అడిగితే, మన శ్రవ్య నాటిక పదిహేనో తేదీన రికార్డ్ చేస్తారన్న శుభవార్త చెప్పాడు. ఆవార్త విన్నాక, నా ఆనందానికి అవధుల్లేకపోయాయనుకో. శ్రీపతికి అయితే క్షణంసేపు నోటమాటరాలేదు- సంతోషంతో వుక్కిరి బిక్కిరవుతూ" అంటూ భైరవమూర్తి చెబుతుంటే రామరాజు అడ్డొచ్చి, అతని రెండు చేతులూ పట్టుకున్నాడు వుద్వేగంతో.

"చాలా సంతోషంరా మూర్తీ. నిజానికి ఇది ఆనందాచారిచలవే. ఆయన రాలేదా" వుత్సాహంగా అన్నాడు.

"ఆయనా రావల్సిందేన్రా. కాని, అతనికేదో అర్జంటుపనుందంట ... మరోసారి కలుసుకుందామని హామీఇచ్చాడు. ఈ శుభతరుణంలో మనం సెలిబ్రేట్ చేసుకోవాలనిపించి ఇలా వచ్చేశాం. వాతావరణం ఇప్పుడెంత అనుకూలంగా వుందో చూశావా. సరంజామా అంతా ఏర్పాటుచేసి, తీసుకొచ్చాంలే. సమయానికి మీఇంట్లో మీ ఆవిడలేకపోవడం కూడా మన అదృష్టమే! బార్‌కి వెళ్లే బాధ తప్పింది" అంటూ, అసలు విషయాన్ని బైట పెట్టాడు భైరవమూర్తి.

"ఔన్రా రాజూ! ఇటువంటి అనుకూలవాతావరణం, ప్రశాంతంగావుండే నీఇల్లు ... ఇలాంటి అవకాశం, మనం కోరుకుంటే మాత్రం దొరుకుతుందా చెప్పు? భైరవమూర్తి సమయస్ఫూర్తికి హేట్సాఫ్! వాడు గొప్ప ఆర్గనైజరు. మన సమాజంలో వాడుండటం మన అదృష్టమనుకో!" భైరవమూర్తిని పొగుడుతూ సపోర్ట్‌చేశాడు శ్రీపతి.

రామరాజు బరువుగా ఓ నిట్టూర్పు విడిచాడు. దీప్తి అతని కళ్లముందే నిల్చున్నట్టుగా లీలగా కనిపించింది. ఆరోజు స్టేషన్లో, ఆమె భైరవమూర్తితో అన్న మాటలు స్ఫురణకొ

చ్చాయి. ఆమె ఊహ కరక్టే అయ్యిందనిపించింది.

"మన శ్రవ్యనాటిక రేడియోలో ప్రసారంకోసం రికార్డు కాబోతున్నందుకు ఆనందంగానే వుందిగాని, ఇలా ప్రతీదానికీ సెలిబ్రేట్ చేసుకుంటూ, మనం ఒక దురలవాటుకి బానిసలమవుతున్నామేమో ననిపిస్తోందిరా మూర్తీ! ఇది నాకేం నచ్చలేదు" నిరుత్సాహపడుతూ అన్నాడు రామరాజు. ఇటువంటి పార్టీలే తనని తన భార్యకి దూరం చేశాయేమోనని భావించాడు కూడా. అతనికి జ్ఞానోదయం అయినట్టుంది.

భైరవమూర్తి, శ్రీపతి వింతగా చూశారు రామరాజువైపు. రామరాజుకి, అటువంటి ఆలోచనే రాకూడదని వాళ్ల అభిప్రాయం. ముఖ్యంగా భైరవమూర్తి దృఢసంకల్పం అదే.

"ఏవిఁట్రోయ్ రాజూ, ఇవ్వాళ కొత్తగా మాట్లాడుతున్నావు?" సూటిగా రాజు కళ్లల్లోకి చూస్తూ అన్నాడు మూర్తి.

"కొత్తేవిఁటిరా? వింతగా మాట్లాడుతున్నాడను. లేకపోతే ఇటువంటి ఆలోచన వాడికెప్పుడయినా వచ్చిందా ఇంతకుముందు?" వంతపాడాడు శ్రీపతి.

"కొత్తాకాదు- వింత అంతకంటె కాదురా! కొన్ని రోజులుగా నా మనసులో మెదుల్తున్న విషయమిది. ఏదో ఒకసాకుతో మనం ఇలా పార్టీలు కొనసాగిస్తే, మనం తప్పకుండా తాగుబోతులుగా మారే ప్రమాదం ఎంతోదూరంలో లేదనిపిస్తోంది. నేను ఎందుకు చెబుతున్నానో మీరూ ఆలోచించండిరా"

భైరవమూర్తి ఆశ్చర్యంతో రాజువేపు చూశాడు. రామరాజు తన పట్టులోంచి తప్పిపోతున్నాడేమోననిపించింది.

"ఏవిఁట్రోయ్ నువ్వు రామకృష్ణపరమహంసలా మాట్లాడుతున్నావు? లేకపోతే గాంధీ మహాత్ముని ఆత్మ నీలో ప్రవేశించి, ఇలా చెప్పిస్తోందా? అసలు, ఈ ఆలోచనలన్నీ నీస్వంతమేనా? లేక మీఆవిడ ఇవన్నీ నీ బుర్రలోకి ఎక్కించిందా?"

భైరవమూర్తి అలా ప్రశ్నించినందుకు బాధపడలేదు రామరాజు. వాడి తత్వమే అంత అనుకున్నాడు. సన్నగా నవ్వేడు.

"నాకేం మెదడులేదు గనకనా, మా ఆవిడ నాబుర్రలోకి ఏ ఆలోచనలయినా ఎక్కించడానికి? నేనంత అల్లాటప్పయ్యలా నీకు కనిపిస్తున్నానా? అదికాదురా. ఈమధ్య మనం సుమారు ప్రతిరోజూ ఏదో ఒక సందర్భాన్ని పురస్కరించుకుని పార్టీ జరుపుకుంటూ ఇంటికొస్తున్నాం. ఈ విషయాన్ని మాఆవిడ పసిగట్టేసింది. మా వైవాహిక జీవితప్రారంభదశలోనే ఇలా జరగడం నాకూ బాధగానే వుంది. ఆమెకి అంటే నాభార్యామణికి నాపట్ల వుండే గౌరవం, అనురాగం, ఆరాధన ... ఇవన్నీ క్రమంగా తగ్గిపోతాయేమోనని నాకు భయంగావుంది. అదే నా ఆందోళన" మనసులోనిమాట వ్యక్తంచేశాడు రామరాజు.

భైరవమూర్తి రామరాజుకేసి పరీక్షగా చూశాడు. అతని అంతరంగంలో ఎక్కడో కాస్తంత ఆనందం పొడజూపింది.

"అంటే, మీ ఇంట్లో మన విషయంగురించి రభస జరిగిందన్నమాట? అందుకేనా మీఆవిడ కన్నవారింటికి ప్రయాణం కట్టింది" నిజాన్ని తెలుసుకోవాలని ఆ ప్రశ్నవేశాడు భైరవమూర్తి.

"నిజంగానే గొడవ జరిగిందట్రా రాజూ?" అనుమానాస్పదంగా అడిగాడు శ్రీపతి.

భైరవమూర్తికి అనుయాయుడిగా, శ్రీపతి అతనివెంట తిరుగుతున్నాడే తప్పించి, మూర్తి మనసులోవున్న 'కసి' అతనికి తెలీదు. రామరాజు సంసారంలో గొడవలొచ్చాయంటే, అందుకే కాస్తంత బాధపడుతున్నాడు.

"అబ్బే... అటువంటిదేంలేదురా! వాళ్లమ్మా, నాన్నల్ని చూసి రావడానికే వెళ్లిండి. నిజం చెప్పాలంటే మా ఆవిడ ఇటువంటివేం పట్టించుకోదు. మనం పార్టీలు చేసుకుంటున్నామని పసిగట్టినా, మా ఆవిడ ఆవిషయంలో నన్నేమీ అనలేదు తెలుసా?" వచ్చి అబద్ధం చెప్పాడు రామరాజు తన వ్యక్తిత్వాన్ని కాపాడుకునేందుకు.

అయితే భైరవమూర్తి రామరాజు మాటల్ని నమ్మలేదు. వాడు అబద్ధం చెబుతున్నాడనిపించిందతనిమొహం చూస్తుంటే.

"నువ్వు నిజం చెప్పడం లేదురా రాజూ! ఆరోజు మీ ఆవిడ విజయవాడ వెళ్తున్నప్పుడు

ఆమె మొహంచూస్తే ఎంత గంభీరంగావుందో నాకు తెలుసు. నేను ఏదో అంటే బలవంతంగా నవ్వుతెచ్చుకుని, సమాధానం చెప్పింది. ఆ సమాధానమయినా ఎంత విసురుగా, ఎంత భావగర్భితంగా చెప్పిందో నీకూ తెలుసు. నువ్వు దగ్గరేవుండి కూడా ఏవీఁ అనలేకపోయావు. అంతే మీ ఆవిడ నిన్ను డామినేట్ చెయ్యడాని కి ప్రయత్నిస్తోందని ఆరోజే నేను అనుకున్నా ను. ఒరేయ్ రాజూ, పురుషాధిక్యత ప్రబలంగా వున్న ఈరోజుల్లో, నువ్వు మీఆవిడ భావాలకి విలువిస్తున్నావంటే, నువ్వామె గుప్పెట్లోకి వెళ్లి పోతున్నావనే భావన ఎవరికయినా వస్తుంది. అదే నిజమైతే నువ్వు తప్పుత్రోవలో పయనిస్తు న్నావనే అంటాను ...'' అంటూ ఒక త్రుటి కాలం ఆగాడు.

రామరాజు చప్పున అందుకున్నాడు- ''అ దికాదురా మూర్తీ! నన్ను నువ్వు తప్పుగా అంచనా వేస్తున్నావు...'' అని ఇంకేదో అనబో యాడు రామరాజు.

కాని భైరవమూర్తి అతణ్ని చెప్పనివ్వలేదు. ''ఎదుటివ్యక్తిని అంచనా వెయ్యడంలో నాది అందె వేసిన చెయ్యిరా బాబూ! కొత్తగా వివాహ మయిందని, నీ అర్ధాంగి అందగత్తె అని మరీ ఆమెని అభిమానంతో, అనురాగంతో ఆరా ధించకు. అట్లా ఆరాధిస్తే నువ్వు లోకువైపో తావు. నీ బలహీనతని ఆధారం చేసుకొని కొన్నాళ్ళకి నిన్నో పురుగును చూసినట్టుగా చూ స్తుంది. ఆడదానికి అలుసిచ్చావా నిన్ను ఆమె అలక్ష్యం చేస్తుందన్న సత్యాన్ని నువ్వు విస్మరి స్తున్నావు. బివేర్ రామరాజూ!'' అంటూ హెచ్చ రించి, శ్రీపతివేపు చూశాడు. ''ఏంరా శ్రీపతీ... నేను చెప్పింది కరెక్టేనంటావా?''

శ్రీపతి కాదనలేదు- అతని స్వభావమే అంత!

''ఖచ్చితంగా కరెక్ట్! నువ్వు చెప్పిందాంట్లో ఒక్క అక్షరమైనా అబద్ధంలేదు. మన వ్యక్తిత్వం నిలబెట్టుకోవాలి. అది... చాలా అవసరం. సరే గాని అసలు మనం ఇక్కడికి ఎందుకొచ్చామో అది మర్చిపోతున్నాంరా మూర్తీ'' అనవస రంగా కాలయాపన అతనికిష్టంలేదు.

''నా ఉపన్యాసమంతా దానికి సంబంధించిందేన్రా బాబూ! మర్చిపోవడం ఎలా అవుతుంది?''

''నీ వుపన్యాసం అయిందికదా! ఈరోజు సెలెబ్రేషన్ జరగాల్సిందే కదా! ఒరేయ్ రాజూ... మరేం ఆలోచించకుండా గ్లాసులు, జార్‌తో నీళ్ళూ తీసుకురారా! ఇంత చక్కని వాతావరణాన్ని వృథా చెయ్యకు. ఇహమీదట ఈ పార్టీలు జరుపుకోవచ్చునో లేదో నువ్వు తీరిగ్గా తర్వాత ఆలోచించుకొని ఒక నిర్ణయాని కి రావొచ్చున్లే...'' అన్నాడు శ్రీపతి.

శ్రీపతి చెప్పింది కొంతమేరకు సబబుగానే తోచింది. అందుకే మారు మాటాడకుండాలేచి, లోపలికి నడిచాడు రామరాజు.

బైట వర్షం అధికమయింది. కిటికీలోంచి చల్లనిగాలి వీస్తోంది.



రామరాజు లోపల్నించి మూడు గాజు గ్లాసులు, జార్‌తో మంచినీళ్ళు తీసుకొచ్చి, టీపాయ్ మీద పెట్టాడు.

భైరవమూర్తి మొహం విప్పారింది.

"అదీ- ఇట్లా వుండాలిరా మగతనమంటేను! మగాడికి వుండాల్సింది గుండెనిబ్బరం, చొరవాను. అంతేగాని బొత్తిగా బేలతనంతో, భార్యామణికి బానిస కాకూడదు. ఆమె కన్నుసన్నలలో మసలకూడదు. స్త్రీల మనస్తత్వం నీకింకా తెలీదులే! ప్రవరాఖ్యుడిలాంటి వాడివి నువ్వు. నీకెలా తెలుస్తుందిలే రకరకాల స్త్రీల మనస్తత్వం! అయితే అనుభవం వున్నవాళ్ళం మేం చెప్పాలికదా! ఆడవాళ్ళకి ఒకసారి అలుసిచ్చామా, ఇంక వాళ్ళని అదుపులోకి తీసుకురావడం చాలా కష్టం. అందులోనూ మీ ఆవిడ మనస్తత్వం విచిత్రంగా వుంటుందిరోయ్. ఇలా అంటున్నానని నువ్వేమీ అనుకోకు. మేం నీకు సన్నిహితులమని తెలిసినా, మమ్మల్ని పురుగుల్ని చూసినట్టే చూస్తుంది. ఆమెకి సభ్యత తెలీదో లేక సుపీరియారిటీ కాంప్లెక్సో అర్థం చేసుకోలేక ఛస్తున్నాం. అప్పుడప్పుడూ వ్యక్తిత్వం దెబ్బతిని, బాధనిపిస్తుంది కూడాను. కాని నీ మొహం చూసి సర్దుకుపోతున్నాం" మామూలు ధోరణిలోనే నవ్వుతూ అన్నాడు భైరవమూర్తి.

శ్రీపతిఏమీ అనలేదుగాని, సన్నగా నవ్వేడు.

వాళ్ళిద్దరి నవ్వు, భైరవమూర్తి మాటలు రామరాజుకి చుర్రుమనిపించాయి. దీప్తి మన



స్తత్వం గురించి వాడి విశ్లేషణ సబబుగానే వున్నట్టు తోచిందతనికి. అతని అంతరంగంలో ఆజ్యం పోసినట్టయింది. తన బలహీనతని, దీప్తి ఆధిక్యతని భైరవమూర్తి మాటలు స్పష్టంచేస్తున్నట్టే అనిపించింది.

''ఒరేయ్ మూర్తీ... నా దగ్గర ఇంకెవరి సుపీరియారిటీ కాంప్లెక్సూ పనిచెయ్యదురా! నీకు నా మనస్తత్వం తెలుసుకదా? ఆడవాళ్ళకు పైచేయినిచ్చే ప్రసక్తే వుండదసలు. ఇహపోతే మా ఆవిడ ప్రవర్తన నీకు బాధకలిగించి వుంటే, అందుకు క్షమాపణ చెప్పుకుంటున్నాను. అయామ్ సో సారీరా...'' నిబ్బరంగా అన్నాడు రామరాజు.

భైరవమూర్తికి కావల్సిన సమాధానమూ అదే! ''మనలో మనకి సారీ లెందుకుగానీ, నీ వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోమనే మా హెచ్చరిక. మేమందరం అప్పుడప్పుడూ అదే చర్చించుకుంటూ వుంటాం'' అన్నాడు భైరవమూర్తి.

భైరవమూర్తి చెబుతున్నదంతా వింటున్నాడేగాని, రామరాజుకి ఓ విషయం గుర్తుకు రాలేదు. పురుషాధిక్యత గురించి ఇన్ని చెబుతోన్న మూర్తి, అతని భార్య ప్రేమ సమక్షంలో పిల్లికూనేనని, పల్లెత్తుమాట కూడా అనలేడని; ఆ ప్రసక్తిని రామరాజు తీసుకురానందుకు లోలోన మురిసిపోయాడు భైరవమూర్తి.

అనవసర ప్రసంగాలతో కాలయాపన జరుగుతున్నందుకు విసుగుపుడుతోంది శ్రీపతికి. టీపాయ్ మీదున్న విస్కీబాటిల్ ఆహ్వానిస్తోందతనిని. అందుకే ఆ విసుగేమో!

''ఆ టాపిక్ ఇంక ఆపండిరా బాబూ!'' విసుక్కున్నాడు శ్రీపతి.

శ్రీపతి అసహనాన్ని అర్థంచేసుకున్నాడు భైరవమూర్తి. విస్కీబాటిల్ మూతవిప్పి మూడు గ్లాసుల్లో సగంవరకూ పోశాడు. రామరాజు మాత్రం కంగారుగా తన గ్లాసులోని కాస్తంత ద్రవాన్ని భైరవమూర్తి గ్లాసులో పోశాడు. భైరవమూర్తి నవ్వుకుంటూ మూడు గ్లాసుల్లో మంచినీళ్ళు పోశాడు, నిండుగా. తనతోపాటు తెచ్చిన మిరపబజ్జీలు, కారపువడలు, వేపిన జీడిపప్పు పొట్లాలు విప్పి రెడీగా పెట్టాడు.

'ఛీర్స్' చెప్పుకుని, ముగ్గురూ గ్లాసుల్ని అందుకున్నారు.

''రియల్లీ దిసీజె గ్రేట్ డే! ఎందుకూ అంటే, మన నాటక సమాజం,మూడు పువ్వులూ ఆరు కాయలుగా పురోగమిస్తోంది. రామరాజు గొప్పనటుడిగా ఆంధ్రదేశంలో పేరుతెచ్చుకుంటాడు. అందులో సందేహంలేదు. వాతావరణం బ్రహ్మాండంగా వుంది. రామరాజు ఇల్లు ఖాళీగా వుండి, తీరిగ్గా ఇలా పార్టీ జరుపుకోడానికి అవకాశం దొరికింది. అందుకే ఇది గొప్పరోజు!'' గుక్క తిప్పుకోకుండా చెప్పుకుపోయాడు భైరవమూర్తి.

ముగ్గురూ గ్లాసుల్లోని ద్రవాన్ని సిప్ చేస్తున్నారు. రామరాజు కొద్దికొద్దిగా తీసుకుంటున్నాడు. భైరవమూర్తి మాటలకి అతను వుప్పొంగిపోలేదు. అతనికి దీప్తి పదేపదే గుర్తుకొస్తోంది. వెళ్తూ వెళ్తూ ఆమె అన్నమాటలు, అతని చెవుల్లో గింగురుపెట్టినయ్. అవన్నీ జ్ఞప్తికి తెచ్చుకుంటే అతనికి ముచ్చెమటలు పోసినయ్.

''ఒరేయ్ మూర్తీ- మనం ఇలా మా ఇంట్లో మందుపార్టీ జరుపుకున్నామని మా ఆవిడకి తెలిస్తే, ఇంకేమయినా వుందా? నిప్పులు చెరుగుతుందనుకో. ఏదో ఈసారికి నీమాట కాదనలేక, ఇక్కడ పార్టీ జరుపుకుందుకు అడ్డుచెప్పలేదు. ఇక ముందెప్పుడూ ఇలా ఏర్పాటు చెయెద్దురా బాబూ'' తన మనసులోని భయాన్ని వ్యక్తంచేశాడు రామరాజు.

రామరాజు గ్లాసు పూర్తిగా ఖాళీ చెయ్యలేదుగాబట్టి, నిషా పూర్తిగా పట్టలేదు. రామరాజు మాటలకు భైరవమూర్తి, శ్రీపతి పరస్పరం మొహాలు చూసుకున్నారు. సన్నగా నవ్వుకున్నారు. ''అబ్బబ్బ... మళ్ళీ అదే ధోరణేమిట్రా రాజా! కొద్దిసేపటిక్రితమేకదా నువ్వన్నావు, భార్యకి భయపడే మనస్తత్వం నీదికాదని! ఇంతలోనే మళ్ళీ ఏమొచ్చిందిరా? నీ భయాన్నే పిరికితనం అంటారు. అయినా నువ్వు మూడు ముళ్ళూవేసిన నీ భార్యకి నువ్విలా భయపడి గడగడలాడుతున్నావంటే, మాకే నవ్వొస్తోందిరా! నువ్వింత పిరికివాడివని ఈరోజే గుర్తించాం. నిజానికి నువ్వో హీరోవిరా! నాటకాల్లో హీరో వేషాలు వేస్తోన్న హీరోవి. ఈ విషయాన్ని విస్మరించకు. హీరోకి వుండాల్సిన ధీరోదాత్తత నీలో వుండాలి. లేకపోతే తెచ్చిపెట్టుకోవాలి. అంతేగాని పిరికితనాన్ని, బేలతనా

న్ని గుండెల్లో నింపుకోకూడదురా బ్రదర్..." ధైర్యం చెప్పాడు భైరవమూర్తి.

"అయినా నీకు ఈ పిరికితనం ఎలా అబ్బిందిరా రాజూ! హీరో అంటే ఎంత డాషింగ్‌గా వుండాలి?" శ్రీపతి అన్నాడు.

అప్పటికే భైరవమూర్తి, శ్రీపతీ గ్లాసులు ఖాళీచేశారు. రామరాజు సగం గ్లాసు మాత్రం ఖాళీచేశాడు. రామరాజుకి అలవాటు లేదుగా బట్టి బితుకుబితుగ్గా తీసుకుంటున్నాడు. అప్పటికే రామరాజుకి నిషా ఎక్కింది క్రమంగా. భైరవమూర్తి, శ్రీపతి స్టడీగా వున్నారు.

"అయితే హీరోకి ఈ మందు వ్యసనం వుండాలంటావా?" కాస్తంత మత్తుగానే అన్నాడు రామరాజు.

భైరవమూర్తి చప్పున మాట్లాడలేదు. తనే ఎప్పుడూ వసపిట్టలా మాట్లాడ్డం బాగులేదనిపించింది గామోసు. శ్రీపతికేసి చూశాడు. శ్రీపతి అందుకున్నాడు-

"ఒరేయ్ రాజూ... నీకు తెలీదురా- ఇది వ్యసనం కాదు. గొప్పగొప్ప నటులంతా దీని సాయంతోనే గొప్పవాళ్ళయ్యారు. వాళ్ళ కీర్తి చిరస్థాయిగా నిలిచి పోయింది. అలాగని అలవాటు లేనివాళ్ళు గొప్పనటులుగా కీర్తి పొందలేదనను. వాళ్ళూ కొందరున్నారు. ఇంతకీ చెప్పొచ్చేదేవిఁటంటే, నటులన్న వాళ్ళకి, ఈ అలవాటు ఓ దురలవాటు కానేకాదు. ఉత్తేజాన్ని, వుత్సాహాన్ని కలిగించే ఒక ఔషధంలాంటిది మాత్రమే. ఎటొచ్చీ హద్దుమీరకూడదు- అంతే! మనం లిమిట్‌లోనే వుంటాం. హద్దుమీరే ప్రసక్తేవుండదు. అంచేత ఇదేం తప్పుకాదంటాన్నేను" అన్నాడు శ్రీపతి రామరాజుని వుత్సాహపరుస్తూ.

రామరాజు గ్లాసు ఖాళీ చేశాడు. అతనికి బాగా మత్తెక్కింది. మాటలు తడబడ్డాయి. "ఓ.కే- శ్రీపతి చెప్పింది వేదమేకదా! నేను నటుణ్ణి... అందునా, హీరోని! గొప్పగొప్ప నటులంతా, ఈ మందుని సేవించారుగాబట్టి... నేను తాగితే తప్పేవిఁటి? తప్పులేదు... నేను... గొప్ప నటుడిగా పేరుప్రఖ్యాతులు తెచ్చుకోవాలి... తెచ్చుకుంటాను కూడా. ఒరేయ్ మూర్తీ... మన శ్రవ్యనాటిక రికార్డింగులో నేనెంత గొప్పగా నటిస్తానో చూడండ్రా! 'రామరాజు నాటక రంగంలో... రారాజు' అనిపించుకునేలా... నటిస్తాను. కొత్తగా మనం ప్రాక్టీసు చేయబోయే నాటకంలో నాదేపైచేయి..." మందు కలిగించిన వుత్తేజంలో ఏమేమో అనేశాడు రామరాజు.

భైరవమూర్తి ఆనందానికి అవధుల్లేకపోయాయి. "భేష్‌రా రామరాజూ! ఆత్మవిశ్వాసం అంటే అలా వుండాలి. మాకు తెలుసునురా- నువ్వు బ్రహ్మాండంగా నటిస్తావని. కాస్తంత మందు పుచ్చుకున్నావా, ఇప్పుడు నీ నటన ఎంత అద్భుతంగా వుందో ఎదుటనున్న మాకు తెలును- కీపిటప్..." అభినందించాడు భైరవమూర్తి.

రామరాజు పెదాలపై సన్నని మందహాసం చిందించాడు. ఆ మందహాసం, అసహజంగా వుంది. సోఫాలో వెనకి చేరబడ్డాడు.

భైరవమూర్తి, శ్రీపతి మిగిలిన మందును తమ గ్లాసుల్లో పోసుకున్నారు. రామరాజుకి ఇంకా ఇవ్వడం ప్రమాదమనిపించి మానేశారు.

"ఔనూ... మీ ఆవిడ ఎప్పుడొస్తుందిరా?" భైరవమూర్తి ప్రశ్న.

"త్వరగా వచ్చేయమని చెప్పి మరీ... పంపించాన్రా! వచ్చేస్తుంది"

"కొద్దిరోజులపాటు అక్కడే వుండనియ్యరా రాజూ..."

రామరాజు కాస్త ముందుకు వంగాడు.

"ఏ... ఎంరా? అ... అలా అ... అంటున్నావు?" మూర్తి మొహంలోకి సూటిగా చూస్తూ అన్నాడు రామరాజు మత్తుగా.

"మరేం కాదురా-"

"మనం అప్పుడప్పుడూ ఇలా పార్టీలు జరుపుకుందుకు, అనువుగా వుంది కదా మీయిల్లు! అదీగాక మన శ్రవ్యనాటిక రిహార్సిల్సు నిరవధికంగా సాగుతూ వుంటాయి కదా? నీకూ, మాకూ తీరికే వుండదు. అప్పుడు నువ్వు త్వరగా ఇంటికి రావడంలేదని మీ ఆవిడతో గొడవుండొచ్చు" అన్నాడు భైరవమూర్తి చాలా తెలివిగా.

భైరవమూర్తి చెప్పిందాంట్లో నిజం లేకపోలేదనుకున్నాడు రామరాజు- అంత మత్తులోనూ. రిహార్సిల్సు ప్రారంభించాక, తాను ఆలస్యంగా ఇంటికి రావడం తప్పదు, అప్పుడు దీప్తితో రభసా తప్పదు. అంచేత, మూర్తి చెప్పిందే

సబబుగా వున్నట్టు తోచింది. కాని, ఎన్నాళ్ళిలా ఒంటరి జీవితం?

"అయితే... అంతవరకూ... ఒంటరిగానే... వు..వుండమంటావా?" ప్రశ్నించాడు రామ రాజు.

భైరవమూర్తి మొహంలో కాస్తంత రంగు మారింది. నిరుత్సాహం అతనిలో చోటుచేసు కుంది. కొంపదీసి ఒంటరిగా వుండనంటాడే మోననిపించింది.

"నువ్వంతగా భార్యా విధేయుడిగా వుంటా నంటే, నేనేం చెప్పలేనుగాని నేను చెప్పిన సమస్యలన్నీ దృష్టిలోపెట్టుకో! కొద్దిరోజులేగా? ఈలోగా మరో బ్రహ్మాండమైన పార్టీ ఇక్కడే జరుపుకుందాం. ఆనందాచారిగారు ఇవ్వాళ మనపార్టీలో పాల్గొనలేదుకదా? ఆయన్తోపాటు ఓ పార్టీ ఏర్పాటు చేసుకోవడం మన విధి... ఏమంటావ్?"

రామరాజు భైరవ మూర్తి ట్రాప్‌లో పడ్డాడు. "సరే- నువ్వంతగా... చెప్తుంటే... నేనే మంటా ను? మా ఆవిణ్ణి మరో పదిరోజులు అక్కడే వుండమని వుత్తరం రాస్తాలే. పార్టీ ఏర్పాటేదో త్వరగా చెయ్యరా!"

భైరవమూర్తి బ్రహ్మానందపడిపోయాడు.

"ఓకే... మగాడంటే అలా వుండాలిరా రాజూ! అయితే ఈ ఆదివారం మీ ఇంట్లోనే పార్టీ ఏర్పాటు చేస్తున్నాను"

"మరి శ్రీపతి ఏమంటాడో?" రామరాజు ప్రశ్న.

"నాకేం అభ్యంతరం లేదురా రాజూ! ఆనందాచారిగారికి నేను తెలియ జేస్తాలే?"

"మరింకేం? అన్నీ సవ్యంగానే వున్నాయి. పార్టీకి కావల్సిన సరంజామా అంతా నేను తెస్తాన్లే..." అన్నాడు భైరవమూర్తి.

రామరాజు ఖాళీ విస్కీ సీసాను ఓ సారి ఎత్తి చూశాడు.

"అంతా... అయిపోయిందిరా?" మత్తుగా అన్నాడు.

భైరవమూర్తి నవ్వుకున్నాడు.

"శ్రీపతి అన్నాడా, లిమిట్స్‌లో వుండమని? మళ్ళీ ఆదివారమే."

"ఓకే"

బైట వర్షం కాస్త తగ్గింది. మరో గంటవరకూ ముగ్గురూ అక్కడే వున్నారు.

తర్వాత భైరవమూర్తి, శ్రీపతి వెళ్ళి పోయారు.

రామరాజు తలుపు గడియవేసుకుని వచ్చి మంచంమీద వాలిపోయాడు. అతనికి చప్పున నిద్రపట్టేసింది. ఆ రాత్రంతా గదిలో ట్యూబ్‌లై టు వెలుగుతూనే వుంది.



**క**క్ష మనసుని రాయిగా చేసి, మనిషిని విచక్షణారహితుణ్ణి చేస్తుంది. కొన్ని సందర్భా ల్లో పశువుగా మార్చేస్తుంది.

"పరిస్థితులతో రాజీపడిన వ్యక్తుల్లో కక్ష శాశ్వ తంగా వుండదు. కాలక్రమేణా మార్పు చెందు తుంది. కాని రాజీపడనివాళ్ళతోనే వచ్చిన చిక్కంతాను. తమ కక్షని ఏదోవిధంగా సాధించాలన్న పట్టుదల, ఉద్రిక్తత వాళ్ళని నిద్రపోనీయదు.

భైరవమూర్తి రెండో కోవకు చెందినవాడు.

భైరవమూర్తి ఇప్పటికీ మర్చిపోలేకపోతున్నా డు- ఆనాడు దీప్తి తనని ఘోరంగా అవమా నించిన విషయాన్ని. అంతేకాదు- తాను ఏమని ప్రతిజ్ఞ చేశాడో కూడా అతనికి బాగా గుర్తుంది. ఆ సంఘటనంతా సినిమా రీళ్ళలా పదే పదే అతని కళ్ళ ముందు మెదుల్తూనే వుంది. తన ప్రతిజ్ఞ తీరడమెలా?- అదే ప్రశ్న అతనిలో ఇన్నాళ్ళూ అగ్నిజ్వాలలా రగిలింది. చివరికి ఓ నిర్ణయానికొచ్చాడు. ఓ పథకం వేశాడు.

ఆ పథకమే రామరాజుని మద్యవ్యసనానికి బానిసచేసే ప్రయత్నం! ఆ విధంగా దీప్తి జీవనరాగంలో అపస్వరాలు పలికించి, ఆమె




# బంగారం!

స్వర్ణసుందరి, స్వర్ణమంజరి స్వర్ణలత ... ఇలా వుంటాయి మన ఆడపడుచుల పేర్లు. స్వర్ణం అంటే బంగారం. బంగారంతో తయారైన ఆభరణాలు అలంకరించుకోవటంలో మనదేశపు స్త్రీలకు మరొకరు సాటిరారనే వ్యాఖ్యానాలు వింటూ ఉంటాం. నేటి అంతర్జాతీయ కరెన్సీ విలువ కూడా బంగారం నిలవల పైనే ఆధారపడి ఉందని మనకు తెలును.

క్రీస్తుపూర్వం మూడువేల సంవత్సరానికి పూర్వమే బంగారం ఈజిప్టులో, ఇరాక్‌లోని మెసాపొటేమియాలో చలామణిలోకి వచ్చింది. క్రీ.పూ.600లో తొలిసారిగా బంగారునాణాలు తయారుచేయబడ్డాయి- ఆస్ట్రేలియాలోని మొయినిహాంలో 7560 ఔన్సుల బరువున్న బంగారం ముక్క భూమిలో కనిపించింది. ఇది అఖండంగా దొరికిన పెద్ద ఒకే ఒక బంగారపు ముక్క.

ప్రపంచంలోని డెబ్బయి దేశాల్లో నేడు బంగారాన్ని పరిశోధించి వెలికి తీస్తున్నారు. ప్రపంచంలో లభిస్తున్న బంగారంలో ఎనభై శాతం వరకు దక్షిణాఫ్రికా, రష్యాల్లోనే లభిస్తోంది. రష్యాలో పదకొండవ శతాబ్దం నాటికే బంగారు నాణేలు వాడుకలో వున్నాయి. ప్రపంచంలోనే అతిపెద్ద బంగారు గని దక్షిణాఫ్రికాలో ఉంది. దీని వైశాల్యం పన్నెండువేల ఎకరాలు.

1984లో ఇంగ్లండులో బంగారంతో స్నానం తొట్టిని నిర్మించారు. దీని ఖరీదు దాదాపు ఏడుకోట్ల రూపాయలుంటుంది.

1986లో కెనడాలో తయారైన అతిపెద్ద బంగారు నాణెం 38 అంగుళాల వ్యాసంతో 3/4 అంగుళం మందంతో ఉంది. దీనివెల 1102107 డాలర్లు ఉంటుంది. ప్రపంచంలో ఇదే అతిపెద్ద నాణెం.

15వ శతాబ్దంలో బాంకాక్‌లో తయారైన గౌతమబుద్ధుని స్వర్ణప్రతిమ 15 అడుగుల పొడవుంది. ఆరుటన్నుల బరువుతూగే ఈ విగ్రహం ఖరీదు 62.4 మిలియన్ డాలర్లు.

14వ శతాబ్దంలో ఓ మహిళ కోసం 243 పౌండ్ల బంగారంతో శవపేటికను తయారుచేశారు. ఈజిప్టులోని కైరోలోని ఓ మ్యూజియంలో దీన్ని భద్రపరిచారు.

మనదేశంలోని పంజాబ్‌లో స్వర్ణాలయం పేరుతో ఒక ఆరాధనా మందిరమే ఉంది. అనేక గుడిగోపురాలు బంగారంతోనే తాపడం చేయబడి ఉన్నాయి. ★

కంటతడి పెట్టుకుంటుంటే, కళ్ళారాచూసి తాను సంతోషించిననాడే ప్రతీకార వాంఛతో ప్రజ్వలిస్తోన్న తన హృదయం చల్లారుతుందని అప్పుడే వుపశమనం కలుగుతుందని, భావించాడు భైరవమూర్తి. ప్రత్యక్షంగాకాకపోయినా పరోక్షంగానయినా ఈ విధంగా దీప్తిపై కక్షసాధించాలనుకున్నాడు.

భైరవమూర్తి ప్రయత్నం కొంతమేరకు ఫలించిందనే చెప్పాలి. ఇప్పటికే దీప్తి తన భర్త గురించి చెడుగా అంచనావేసుకుని ఆయన్ని వివాహం చేసుకున్నందుకు, తన దురదృష్టానికి పరితపిస్తూ వుండొచ్చునని, ఆ నిస్పృహతోనే, ఆ నిరాశతోనే, ఆ పరితాపంతోనే కన్నవారింటికి వెళ్ళి వుండొచ్చునని భైరవమూర్తి వూహించాడు. రామరాజు మరే ఇతర కారణం చెప్పినా అతను నమ్మటం లేదు.

భైరవమూర్తి ఇలా ఆలోచిస్తూనే తన ప్రయత్నం వమ్ముకానందుకు, విజయగర్వంతో కూడిన ఓ చిర్నవ్వు చిందించాడు పెదాలపై. తాను వూహించిందే నిజమని అతని అంతరాత్మ చెబుతోంది. ఇటువంటి తరుణంలోనే, ఎలాగయినా విజయవాడలో వున్న దీప్తిని తాను కలుసుకుని, సానుభూతి వాక్యాలు పలుకుతూనే, మర్మగర్భితంగా ఎగతాళి చేస్తే, తన కక్ష కొంతవరకయినా తీరుతున్నట్టేనని, మనసుకి కొంతయినా వూరట కల్గినట్టేనని అనుకున్నాడు.

అయితే దీప్తిని కలవడం ఎలా? విజయవాడ వెళ్ళాలి. అనుకున్నదే తడవుగా, విజయవాడ ప్రయాణం కట్టాడు.

భర్త విజయవాడ ఎందుకు వెళ్తున్నాడో, ప్రేమకి తెలీదు.

"ఇంత హఠాత్తుగా విజయవాడ ఎందుకండీ?" ప్రశ్నించింది.

"ఆఫీసు పని మీద వెళ్ళాలి ప్రేమా! అట్లా మీవాళ్ళనీ చూసి రావొచ్చును కదా..." తొణక్కుండా సమాధానం చెప్పాడు.

ప్రేమ మరేం ప్రశ్నించలేదు.

★ ★ ★

భైరవమూర్తి విజయవాడ చేరుకున్నాక అత్తారింటికి వెళ్ళి, సూట్‌కేసు అక్కడ పడేశాడు. కాఫీ తీసుకున్నాక బయల్దేరాడు.

"ఈ వేళప్పుడు ఎక్కడికోయ్?" అడిగారు మావఁగారు.

"ఓ స్నేహితుడింటికి వెళ్ళి త్వరగా వచ్చేస్తానండీ" అంటూ నిష్క్రమించాడు.

నేరుగా శమంత ఇంటికి వెళ్ళాడు. ముందు గదిలో సుందరంగారు కూర్చున్నారు.

"నమస్కారం సార్..." అన్నాడు సవినయంగా.

"నమస్కారమోయ్... రా రా... కూచో..." ఆహ్వానించాడు.

భైరవమూర్తి కూచున్నాడు.

"ఎప్పుడు రావడం?"

"ఈ వేళేనండీ"

"ఇద్దరూ వచ్చారా?"

"లేదండీ... ఆఫీసు పనిమీద ఒంటరిగానే వచ్చాను"

"ఓ... అలాగా"

"శమంత ఈమధ్య వచ్చిందాండీ?"

"ప్రస్తుతం ఇక్కడే వుందోయ్ ..." అంటూ శమంతని కేకవేశాడు సుందరం.

శమంత వచ్చింది లోపల్నుంచి. భైరమూర్తిని చూసి లోలోపల ఇష్టంలేకపోయినా, కృత్రిమపు నవ్వొకటి నవ్వింది.

"ఎప్పుడు రావడమండీ?"

"ఇవ్వాళే..."

"ప్రేమ వచ్చిందా?"

"లేదు. నేనొక్కణ్ణే ఆఫీసుపనిమీద వచ్చాను"

ఒంటరిగా వచ్చినపుడు భైరవమూర్తి తమ ఇంటికిరావడం శమంతకి సుతరామూ ఇష్టంలేదు. ఆరోజు దీప్తిపట్ల అతను ప్రవర్తించినతీరు చూశాక మరీ ఏహ్యాభావం పెరిగింది.

"ప్రేమ కులాసాగా వుందాండీ?"

"కులాసాయేనండీ..."

శమంత తల్లి కాఫీ తెచ్చిఇచ్చింది మూర్తికి. కాఫీ తీసుకున్నాక అన్నాడు-

"దీప్తిగారు కూడా ఇప్పుడిక్కడే వున్నారు కదా? మిమ్మల్ని కలిసారా?"

భైరవమూర్తి దీప్తి ప్రసక్తిని తీసుకురావడం, ఆశ్చర్యం కలిగించింది శమంతకి. ఒకనాడు ఆమెచేత అవమానింపబడినవాడు మూర్తి. మళ్లీ ఆమె గురించి ఎందుకు అడుగుతున్నాడో అర్థంకాలేదామెకి. బహుశా ఇప్పుడు అవన్నీ మర్చిపోయి పరిచితులయ్యుంటారనుకుంది.

"నిన్ననే వచ్చి కలిసిందండీ! అనుకోకుండా నేనురావడం, దీప్తి కూడా ఈవూరు వచ్చి వుండటం కాకతాళీయంగా జరిగింది. రేపు సాయంత్రం వస్తానంది మళ్లీ" అంది శమంత.

"ఓ... అట్లాగా! అయితే రేపు సాయంత్రం మళ్లీ వస్తాల్లెండి. వాళ్లాయనకి ఏమైనా కబురు చెబుతుందేమో అడగాలి. మీకు తెలుసోలేదో గాని, వాళ్లాయన, నేను సన్నిహిత స్నేహితులం"

"నాకా విషయం తెలుసులెండి. వాళ్ల వివాహం సందర్భంలో గమనించాను. అంతేకాదు ఓ ఉత్తరంలో మాదీప్తి కూడా మీగురించే రాసింది"

"ఏం రాసిందండీ?" కంగారుగా అడిగాడు భైరవమూర్తి.

అతని కంగారు గమనించి నవ్వుకుంది శమంత. "మరేంకాదులెండి. మీరూ, వాళ్లాయనా ఒకే ఆఫీసులో పన్జేస్తున్నారని, ఒకే నాటకసమాజంలో సభ్యులని, మీరిద్దరూ బాగా సన్నిహితులనీ రాసింది. పైగా ప్రేమ భర్తగారుగా పరిచయం మరింత బలపడిందనీ రాసిందండీ!" సన్నగా నవ్వుతూ అంది శమంత.

"అది నిజమేనండీ! మేం ఇద్దరం పన్జేస్తున్నది ఒకే ఆఫీసు ... మాది ఒకే నాటకసమాజం ... అందుకే మా ఇరువురిమధ్య సాన్నిహిత్యం అధికం" రిలీఫ్ వచ్చినట్టుగా అన్నాడు.

సుందరం ఏదో పనుండి అక్కణ్ణించి వెళ్లిపోయాడు, భైరవమూర్తికి చెప్పేసి.

శమంతకి మంచి అవకాశం చిక్కింది, అతణ్ణి ఆటాడించటానికి.

"దీప్తి భర్త కథానాయకుడి వేషాలు వేస్తాడావిటండీ?" ప్రశ్నించింది.

"ఔనండీ! మా సమాజంలో వాడొక మంచిన టుడు"

"మరి మీరు ప్రతినాయకులా? అంటే విలన్ పాత్రలు ధరిస్తూవుంటారా?" నవ్వునాపుకుంటూ అడిగింది.

"మీరు ఖచ్చితంగా వూహించారే!" విస్తుపోతూ అన్నాడు భైరవమూర్తి.

శమంత మెల్లగా నవ్వింది. "ఊహించడానికి ఇందులో కష్టమేముందండీ? వ్యక్తుల రూపాల్నిబట్టీ, నైజాన్ననుసరించి ఎవరేం వేషాలు వేస్తారో, వెయ్యగలరో ఇట్టే చెప్పెయొచ్చును కదండీ?"

భైరవమూర్తి మొహంలో రంగుమారింది. శమంత మాటలు అతని గుండెల్లో అంకుశాల్లా గుచ్చుకున్నట్టయ్యాయి. రూపంమాట ఎలావున్నా ముఖ్యంగా తన నైజం విషయంలో ఆమె అలా వ్యాఖ్యానించడం కాస్తంత బాధకలిగించింది కానీ, ఏం చెయ్యగలడు?

"మీరు సూక్ష్మగ్రాహ్యులండీ!" బలవంతంగా చిర్నవ్వు తెచ్చిపెట్టుకుని అన్నాడు భైరవమూర్తి.

"నా స్నేహితులూ ఆమాటే అంటుంటారులెండి..." అంది శమంత.

శమంత మాటల్లోని వెక్కిరింపును అర్థంచేసుకోలేనంత బడుద్ధాయికాదు భైరవమూర్తి. అందుకే ఇంకా అక్కడ వుండటం ఇష్టంలేకపోయిందతనికి.

"వస్తానండీ మరి..." అంటూ లేచాడు.

"అంత తొందరేమిటండీ?"

"ఆఫీసుపని చూసుకోవాలి కదండీ?" ఏదో అనేశాడుగానీ, ఆ వేళప్పుడు ఆఫీసులేం వుంటాయన్న జ్ఞానం లేకపోయిందతనికి.

"ఈ వేళప్పుడు ఆఫీసులేమిటండీ బాబూ" పకపకా నవ్వేసింది.

తల కొట్టేసినంత పనయింది భైరవమూర్తికి. "ఇక్కడ ఆఫీసులోని ఓ ఫ్రెండుని కలవాలండీ ఇప్పుడు వాళ్లింటికి వెళ్లాలి ...", తన తప్పుని కప్పుకున్నాడు.

"అలాగా ... సరేనండీ రేపు దీప్తిని కలుసుకోడానికి వస్తారుకదా?"

"అలాగేనండీ" అంటూ నిష్క్రమించాడు

భైరవమూర్తి వడివడిగా.

శమంత ముసిముసిగా నవ్వుకుంటూ లోప లికి వెళ్లిపోయింది. ఆమెకి ఒక్కవిషయం ఇంకా అర్థంకాలేదు- దీప్తిని కలుసుకుందుకు అతను వస్తాననడంలోని అంతరార్థం ఏమిటో?

★ ★ ★

మర్నాడు ఉదయం పదిగంటలు కావ స్తోంది. ఎండ అంత తీవ్రంగాలేదు.

భైరవమూర్తి ట్రిమ్ముగా తయారై వీధిలోకి బయల్దేరాడు. ఆఫీసుపనిమీదే వెళ్తున్నట్టు అత్తా, మామలకు చెప్పాడు.

ఆరోజు సాయంత్రం శమంత ఇంటికి వెళ్లా ల్సివుంది. అక్కడే దీప్తిని కలుసుకోవచ్చునను కుని మొదట్లో ప్లానువేసుకున్నాడు. కాని



శమంత వుండగా దీప్తిపై సానుభూతినెలా ప్రకటించడం? తనే తప్పుకి దొరికిపోయే అవకా శంవుంది. అదీగాక, వుక్రోషంతో దీప్తి తనని అవమానించినా ఆశ్చర్యం వుండదు... అంచేత ఆ భయంతోనే సాయంత్రం శమంత ఇంటికి వెళ్లకూడదనుకున్నాడు. కాని దీప్తిని కలుసుకోవడంఎలా? దీప్తి ఇంటికి వెళ్తే?

భైరవమూర్తి బీసెంటురోడ్డు పరిసరాల్లో ఓ లక్ష్యమంటూ ఏమీలేకుండా తిరుగుతున్నాడు. నిజానికి అతనికి సొంతపనంటూ ఏమీలేదు. అతని ధ్యేయం దీప్తిని కలుసుకోవడమే. దీప్తి ఎక్కడయినా అగుపించకపోదా అన్న ధ్యాసతోనే తిరుగుతున్నాడు. అప్పటికీ అగుపించకపోతే దీప్తి ఇంటికి వెళ్లాలని నిర్ణయించుకున్నాడు.

చేతి వాచీ చూసుకున్నాడు మూర్తి. పదకొండు గంటలుదాటి అయిదు నిమిషాలు కావస్తోంది సమయం. అప్పటికే మూడుసార్లు పచార్లుకొట్టాడా రోడ్డుమీద. ఒకపక్క విసుగు పుడుతున్నా పట్టుదల వదల్లేదు. అతని దృష్టంతా షాపులపైనే వుంది.

కొన్ని సంఘటనలు ఊహించనివిధంగా జరిగిపోతాయి.

ఓ బట్టలకొట్లోంచి బైటికొస్తోన్న దీప్తిపై భైరవమూర్తి దృష్టిపడింది. అతని హృదయం గంతువేసింది. వెదకబోయినతీగె కాళ్లకి తగిలినట్టయిందతనికి. ఆమె ఒంటరిగానే వుండటం మరీ మంచిదయింది. అతని గుండెల్లో ఆరనిమంటల్లా రగులుతోన్న కసి తానున్నానంటూ అతని భుజం తట్టింది. ఇలా ఆమె కలవడం తన అదృష్టమేననుకున్నాడు. తన ప్రయత్నం ఫలించినందుకు మురిసిపోయాడు.

నాలుగడుగులు వడివడిగావేసి, ఆమెను కలుసుకున్నాడు భైరవమూర్తి.

"నమస్కారమండీ దీప్తిగారూ..." చిరునవ్వుతో ఆప్యాయత వుట్టిపడుతున్నట్టుగానే అన్నాడు.

భైరవమూర్తిని ఆ తరుణంలో అక్కడచూసి గతుక్కుమంది దీప్తి. ఆమె హృదయం జోరుగా కొట్టుకోసాగింది. అంతరంగంనుండి ఆక్రోశం పెల్లుబికొస్తున్నా బలవంతంగా అణచుకుంది. అతనితో మాట్లాడాలన్న అభిప్రాయం ఆమెకి లేకపోయినా సభ్యత దృష్ట్యా మౌనంగా వుండలేకపోయింది.

"ఎప్పుడొచ్చారు?" ఏదో మాట్లాడాలిగాబట్టి ప్రశ్నించింది.

"నిన్నొచ్చానండీ ..." ఉత్సాహంగా చెప్పాడు.

తన పక్కనే అతనూ నడుస్తూవుండటం దీప్తికి చిరాగ్గా వుంది. తనపక్క పులి నడుస్తున్నట్టే ఫీలయింది. కాని, ఏం చెయ్యగలదు?

"ప్రేమగారు కూడా వచ్చారా?"

"లేదండీ... నేనొక్కణ్ణే ఆఫీసుపనిమీద వచ్చాను"

దీప్తి మరేం మాట్లాడలేదు. ఆమె చూపులు అసహనంతో ఖాళీ రిక్షాకోసం వెదుకుతున్నాయ్. ఖాళీ రిక్షా ఒక్కటీ అగుపించడంలేదు. ఆమెలో విసుగు, కోపం తలెత్తాయి. కాని ఏం చెయ్యగలదు? బరువుగా ఓ నిట్టూర్పు మాత్రం విడిచింది.

"మీ తిరుగు ప్రయాణం ఎప్పుడండీ దీప్తిగారూ?" ఆమెలా తనూ మౌనంగా వుండలేకపోయాడు భైరవమూర్తి. అందుకే ఆ ప్రశ్నవేశాడు.

దీప్తి అతనికేసి ఎర్రగాచూసింది. అంత చొరవగా ఆ ప్రశ్న వెయ్యడానికి ఎన్నిగుండెలున్నాయతనికి? ఎంత ధైర్యం? ... అనుకుంది. అసలు ఆ వివరాలు అతనికెందుకు?

"ఈ వివరాలు మీకు అనవసరమేమోనండీ" కరకుగా భైరవమూర్తికేసి చూస్తూ అడిగింది. ఆమె స్వరంలో అసహనం ధ్వనించింది.

భైరవమూర్తి మనస్సు చివుక్కుమంది. ఆమె మాటలు ఎవరైనా విన్నారేమోనని చుట్టూ చూశాడోసారి. దగ్గర్లో ఎవరూ లేకపోవడంతో తృప్తి కలిగించింది. వెంటనే తమాయించుకున్నాడు. మెల్లగా నవ్వేడు.

"వ్యక్తిగతంగా నాకా వివరాలు అనవసరమేననుకోండి కాని రామరాజుకి సన్నిహిత స్నేహితుణ్ణి నేను. అతడి శ్రేయోభిలాషిని. మీరు ఎప్పుడొస్తారో తెలుసుకుని వాడికా విషయం చెబుదామన్న సదుద్దేశంతోనే అడిగాను. మీరు నన్ను అపార్థంచేసుకుంటే ఏం చెయ్యనండీ?" చాలా సౌమ్యంగా అన్నాడు.

భైరవమూర్తి మాటలు దీప్తిని రెచ్చగొట్టాయి. అతని కపటబుద్ధిని బైటపెట్టాలనుకుంది. పొడిగా నవ్వింది. "సన్నిహిత స్నేహితుడిగా ఆయన శ్రేయస్సు, మీరెంతగా కాంక్షిస్తున్నారో నాకు తెలుసునండీ భైరవమూర్తిగారూ! మీరు చెప్పేదానికి చేసేదానికి, ఎక్కడా పొత్తు కుదర

దు. చెబుతున్నవి శ్రీరంగనీతులే. కాని మీరు చేస్తున్నవి మాత్రం వెధవపన్లు..." ఆవేశంగా చెప్పుకుపోతోంది దీప్తి.

నిర్ఘాంతపోయాడు భైరవమూర్తి. తన నిజ స్వరూపం ఆమె తెలుసుకుంటున్నదేమోనన్న అనుమానం కలిగింది. "ఏవిటండీ దీప్తిగారూ... అంత ఆవేశం తెచ్చుకుంటున్నారు?" తానెంతో సౌమ్యుడిలా, ఉత్తముడిలా మెల్లగా అన్నాడు.

దీప్తి అతనికేసి ఎర్రగా చూసింది. "ఆవేశం కాదండీ ఇది– నా హృదయంలో రగులుతున్న జ్వాల. మీ సన్నిహిత స్నేహితుడిగా ఆయన శ్రేయస్సు కాంక్షించేవారయితే ఆయన్ని మీరు పార్టీల పేరుతో మద్యం వ్యసనానికి బానిసచెయ్యరు; ఆయన సంసారజీవితంలో అశాంతిని రేకెత్తించరు; ఆయన బతుకులో చిచ్చుపెట్టరు. అందుకే మీరాయన శ్రేయోభిలాషులంటే ఎలా నమ్మమంటారు? మీరు శ్రేయోభిలాషులుకారు... శత్రువులు. మేకతోలు కప్పుకున్న వ్యాఘ్రం మీరు. ఇంకా నన్ను రెచ్చగొట్టకండి.. వెళ్ళండి" ఉద్రిక్తతతో రొప్పుతూ అంది.

దీప్తి ఆవేశం వెనుక అదృశ్యంగా ఉన్న ఆవేదన అర్థమయింది భైరవమూర్తికి. ఆ ఆవేదన పరిణామమే ఆమె ఆవేశం. అతను ఆశించిందీ అదేకదా! అతని హృదయం ఆనందంతో వుయ్యాలలూగింది. మౌనంగా చిందులు వేసింది. నిండుగా నవ్వుకున్నాడు.

"దీప్తిగారూ... ఆనాడు శమంతగారింట్లో నన్ను అవమానించారు. ఆ అవమానం మాటలతోకాదు– చెంపదెబ్బకొట్టిమరీ అవమానించారు. అదీ, శమంత సమక్షంలో– మీకు జ్ఞాపకం ఉందా?

మీరు మర్చిపోయినా నేను మర్చిపోలేదు... మర్చిపోలేను. ఆనాటి అవమానపు జ్వాలలు నా అంతరంగంలో ప్రజ్వలిస్తూనే ఉన్నాయి. దానికి ప్రతీకారచర్యగా పరోక్షంగా ఎలా దెబ్బతీశానో ఇప్పుడు మీరు అర్థంచేసుకున్నారనుకుంటాను..." విషపు నవ్వొకటి విసురుతూ మళ్ళీ మొదలు పెట్టాడు.

"రామరాజు అనునిత్యం నిషాలో, మత్తులో ఇంటికి వస్తుంటే నవవధువుగా మనసులో ఎన్నో మధురోహల్ని నింపుకొని, ఆసక్తితో ఎదురు చూసే మీరు ఆనందానికి దూరమై, కన్నకలలు చిన్నాభిన్నమౌతూవుంటే నిరాశతో, నిస్పృహతో, జీవితంమీద విరక్తిని పెంచుకున్న మీరు మరో మార్గం లేక ఏం చెయ్యాలో తోచక భర్తమీద కోపంతో, కళ్ళల్లో కన్నీరుని దాచుకుని భర్తకి దూరంగా వచ్చేశారు. వివాహమైన కొద్దిరోజులలకే అనురక్తికి దూరమై ఆవేదనకి గురయ్యారు. ఇటువంటి పరిస్థితి ఏ వివాహస్త్రీకి అయినా తటస్థపడితే భరించగలదా? ఆమె గుండె పగిలిపోదూ? సరిగ్గా అదే పరిస్థితిలో మీరున్నారు! ఇది అంతంకాదు... ఆరంభం! ముందుంది ముసళ్ళపండుగ! ఈ విధంగా మీపై కక్ష తీర్చుకున్నాను. ఆనాటి అవమానపు మరకల్ని ప్రక్షాళితం చేసుకుంటున్నాను" వెటకారంగా నవ్వుతూ అన్నాడు భైరవమూర్తి.

దీప్తి మొహం వివర్ణమయింది. హఠాత్తుగా ఆనాడు తాను భైరవమూర్తిని అవమానించిన రోజు, అతను చేసిన ప్రతిజ్ఞ ఇప్పుడు జ్ఞాపకమొచ్చిందామెకి. భైరవమూర్తి మాటల్లోను, ఆ విషపునవ్వులోనూ ప్రతీకారధోరణి సుస్పష్టంగా గోచరించిందామెకి.

భర్త మామూలుగా పార్టీలకు వెళ్తూ వ్యసనపరుడవుతున్నాడనే అనుకుంది. అదీ భైరవమూర్తి సాహచర్యంలో అలాంటి అలవాటుకి పాల్పడుతున్నాడనే భావించింది. కాని ఆయన అలాంటి తప్పుతోవపట్టడానికి భైరవమూర్తి ప్రోద్బలం, ప్రోత్సాహం ఉన్నాయని, అతనిప్పుడు చెప్పినవరకూ తెలుసుకోలేకపోయిన తన తెలివితక్కువతనానికి తిట్టుకుంది లోలోన. అసలు అటువంటి అనుమానమే రాలేదామెకి.

దీప్తి హృదయం కోపంతో భగ్గుమని జ్వలించింది. ఆమె కళ్ళు, చింతనిప్పుల్లా మండుతున్నాయి. ఉద్రేకంతో, ఉద్విగ్నతతో పెదాలు వణుకుతున్నాయ్. కనుబొమలు ముడివడినాయ్. మొహం జేవురించింది. ముందుకు సాగకుండా ఆగిపోయి తీక్షణంగా భైరవమూర్తికేసి చూసింది.

"మీరు ఎంతటి దుర్మార్గులో మిమ్మల్ని ప్రప్రథమంగా చూసిన క్షణంలోనే గ్రహించాను మూర్తిగారూ... అయితే, మీ సన్నిహిత స్నేహితుణ్ణే నేను వివాహం చేసుకోవడం కాకతాళీ

యమే అయినా, ఒకవిధంగా అది నా దురదృష్టమే అనుకుంటాను. సాఫీగా ఓ సెలయేరులా సాగిపోతున్న నా సంసారజీవితంలో తాత్కాలికంగానయినా అశాంతిని రేకెత్తించి, అలజడిని సృష్టించి నా మానసిక వ్యధకు కారకులై, ఆ విధంగా నాపై కక్ష తీర్చుకుంటున్నట్టు అంతులేని సంతృప్తితో మీరు సంతోషించడం-- మీ రాక్షసప్రవృత్తిని వెల్లడిచేస్తోంది. 'చెరపకురా చెడేవు' అన్న లోకోక్తిని మీరు వినే ఉంటారు... చదివేవుంటారు. మీ ఈ చర్యకు ఎప్పుడో ఓసారి మీరు తప్పకుండా ఫలితాన్ని అనుభవిస్తారు. అప్పుడు పశ్చాత్తాపపడి ప్రయోజనం ఉండదు. మా సంసారంలో చెలరేగిన అశాంతి, మీలో, వెల్లివిరిసిన ఆనందం తాత్కాలికమైన అనుభూతులేనన్న విషయాన్ని మర్చిపోకండి. మావారు మీ గురించి వాస్తవాన్ని తెలుసుకున్ననాడు మీ పరిస్థితి ఎలా ఉంటుందో ఓసారి ఊహించుకోండి. ఆరోజు చాలా దగ్గర్లోనేవుంది..'' ఆవేశంతో చెప్పుకుపోయింది దీప్తి.

దారినపోతున్న వ్యక్తులు వాళ్ళిద్దరివేపూ వింతగా చూస్తూ ఉండటం ఒకరిద్దరు దూరంగా ఆగి తమవేపే చూస్తూ ఉండటం గమనించాడు భైరవమూర్తి. దీప్తి ఇంకా ఉద్రిక్తురాలైతే పైవారెవరయినా కలిగించుకునే అవకాశం ఉందని, అది తనకే ప్రమాదమని వూహించిన భైరవమూర్తి పైకి చిన్నగా నవ్వాడు.

''ఆవేశపడకండి దీప్తిగారూ! పాపం, దయనీయమైన మీ పరిస్థితికి నాకు జాలేస్తోంది. కాని ఏంచేస్తాం? మీరు ఆశిస్తోన్నరోజు రాదులెండి! వస్తామరి...'' అంటూ వెనక్కి తిరిగివెళ్ళిపోయాడు భైరవమూర్తి.

దీప్తి ఓ నిట్టూర్పు విడిచింది. 'దుర్మార్గుడు... ఎంత నాటకమాడాడు?' అనుకుంటూ, అప్పుడే అలా పోతోన్న ఖాళీ రిక్షాని కేకవేసింది. రిక్షాలో కూచుని తాను వెళ్ళవల్సినచోటు చెబుతూ పోనీయమంది.

రిక్షా కదిలింది.

దీప్తి మెదడు ఆలోచనలతో చిందరవందరయింది. భైరవమూర్తి రాక్షసప్రవృత్తిని భర్తకు ఎలా తెలియజెయ్యడం; అతను ఆడుతోన్న కపటనాటకాన్ని, కక్షతోకూడిన నాటకాన్ని ఎలా బైటపెట్టడం? తాను స్వయంగా ఏం చెప్పినా ఆయన నమ్మరే-- మరేం చెయ్యడం?... రిక్షా సాగిపోతోంది. ఆమె ఆలోచనలూ సాగుతున్నయ్...



దీప్తి ఇల్లు చేరుకుంది. ఆమె మొహంలో అసహనం, ఆవేశం సూచాయగా ఇంకా అగుపిస్తూనే ఉన్నాయి.

''ఏవిటమ్మా... ఇంత ఆలస్యం?'' అంది తల్లి.

''షాపులో మా స్నేహితురాలొకామె కలిసిందమ్మా! మాటా మంతీ చెప్పుకుని వచ్చేసరికి ఆలస్యమైపోయింది'' అబద్ధం చెప్పింది. తప్పదుమరి.

బట్టలు మార్చుకుని, భోజనానికి కూచుంది. కాని భోజనం చెయ్యాలని బుద్ధిపుట్టలేదు. తల్లి బలవంతంమీద కాస్తంత ఎంగిలిపడింది.

కాస్సేపు నిద్రపోవాలని ప్రయత్నించింది దీప్తి. కాని కంటికి కునుకే పట్టలేదు. భైరవమూర్తి, అతని మాటలే ఆమెకి పదేపదే గుర్తుకొస్తున్నాయి. అతని కుట్రనుంచి ఎలా బైటపడ్డమా అని యోచించసాగింది.

సాయంత్రం నాలుగు దాటింది. ఎంత అంతగాలేదు. దీప్తి టీ తీసుకున్నాక ముస్తాబై బయల్దేరింది.

''అమ్మా... అలా శమంత ఇంటికి వెళ్ళొస్తానే'' అంది.

''కాస్త తొందరగా వచ్చేయమ్మా! రోజులేవీ బాగులేవు'' అంది తల్లి-- ఈ మధ్య చెదురుముదురుగా జరుగుతోన్న సంఘటల్ని నెమరువేసుకుంటూ.

దీప్తి చిన్నగా నవ్వింది.

"నీకు మరీ ఛాదస్తమమ్మా– చదువుకున్నాం, ఆపాటి ధైర్యం మాకు లేకపోతే ఎట్లా? అయినా త్వరగా వచ్చేస్తాలే!" అంటూ నిష్క్రమించింది దీప్తి.

బస్సుకోసం కొద్ది నిముషాలు నిల్చుని, బస్సు రాకపోయేసరికి విసిగిపోయి, రిక్షాచేయించుకొని శమంత ఇంటికి వెళ్ళింది దీప్తి.

"రావే దీప్తీ... నువ్వొస్తావనే ఎదురుచూస్తున్నాను– కూచో" చదువుతున్న పుస్తకాన్ని పక్కన పెట్టి, ఆప్యాయంగా ఆహ్వానించింది శమంత.

దీప్తి మందహాసవదనంతో లోపలికివచ్చి, శమంత పక్కనే ఆశీనురాలయింది.

"నా కోసమే ఎదురుచూస్తున్నానన్నావు-- ఏవిఁటే విశేషం?" ప్రశ్నించింది దీప్తి.

"మీ ఆయన ఫ్రెండు- అదే ప్రేమ భర్త, ఆనాడు నువ్వు చెంపదెబ్బకొట్టి అవమానించిన శాస్త్రీ వచ్చాడే దీప్తీ! ఇప్పుడు వస్తానని కూడా చెప్పాడు. కాని ఇంతవరకూ రాలేదు. వస్తాడేమోనే... మీ ఆయనకి, నువ్వేమైనా కబురు చెబుతావేమోనని నిన్ను కలుస్తానన్నాడు" చెప్పింది శమంత, సన్నగా నవ్వుతూ.

తనని కలుసుకోడానికే అతను ప్రయత్నించినట్టు ఇప్పుడర్థమైంది దీప్తికి. అంటే ఈరోజు అతను తనని కలుసుకోవడం కాకతాళీయం కాకపోవచ్చుననుకుంది. బరువుగా ఓ నిశ్వాసం వదిలింది.

"ఓ... ఆ భైరవుడా? కలిశాడులేవే! నా కబురు మా ఆయనకి అందజేసే సదుద్దేశం ఎక్కడేడ్చింది ఆ శాస్త్రీకి? అదేంకాదులే– నన్ను కలుసుకోవాలనుకున్నాడంతే... కలిశాడు" చిరుకోపంతో అంది దీప్తి.

శమంత నివ్వెరపోయింది.

"నిన్ను కలిశాడా? ఎక్కడేవిఁటీ? మీ ఇంటికొచ్చాడా?" ఆసక్తికరంగా ప్రశ్నలు వేసింది శమంత.

"లేదే... మా ఇంటికి వచ్చేటంత ధైర్యం అతనికి లేదు. నాచేత అవమానించబడ్డాడు కదా! ఏ మొహంపెట్టుకుని వస్తాడు? నేనతణ్ణి ద్వేషిస్తున్నానని తెలుసు"

"అయితే ఎక్కడ కలిశాడు?"

"ఈవేళ ఉదయం బీసెంట్‌రోడ్డులో నేనో బట్ట

లపావులోంచి రావడం చూశాడేమోమరి- చక చకా వెనుకనించి వచ్చి నన్ను పలకరించాడు, ఎంతో పరిచయం ఉన్నవ్యక్తిలా. సిగ్గు అనే పదం అతని డిక్షనరీలో లేదేమో! లేకపోతే తనని అవమానించిన నన్ను పలకరించడమే విటా అనుకున్నాను. కాని అతని అభిప్రాయమే వేరని తర్వాత అర్థంచేసుకున్నాను. అతని పలకరింపుకి నాకు వొళ్ళు మండిపోయిందనుకోవే! కాని ఏం చెయ్యను? మాట్లాడక తప్పలేదు''

''ఇంతకీ ఏమంటాడు?'' చెక్కిలిపై చేతినానించి, ఆసక్తిగా అడిగింది శమంత.

దీప్తి భారంగా ఓ నిట్టూర్పు విడిచింది.

''ఏమంటాడు? ఆనాడు మీ ఇంట్లో అతన్ని నేను అవమానించిన వైనం ఇంకా మర్చిపోలేదట. ఆ అవమానజ్వాలలు, అతని హృదయంలో ఇంకా చల్లారలేదట. ఆరోజు ప్రతిజ్ఞ చేసినట్టుగానే ఇప్పుడతను పరోక్షంగా ప్రతీకారం తీర్చుకుంటున్నాడు. అది చెప్పడానికే ప్రత్యేకంగా ఇప్పుడు వచ్చి నన్ను కలిశాడట. నేను బాధపడుతూ ఉంటే చూడ్డం అతనికి సరదాట. అతను నీకు బంధువేగాని మరేం అనుకోకు. అతనో రోగే. నీకింకా ఆ విషయాలేవీ చెప్పలేదుగాని, ఆ భైరవుడు చెప్పిందాన్ని బట్టిచూస్తే ప్రస్తుతం నా సంసారజీవితంలోని అపశ్రుతులకు అతనే కారకుడనిపిస్తోంది'' ఆవేదనతో అంది దీప్తి.

దీప్తి మొహం కళావిహీనమవ్వడం, శమంత గమనించి విస్తుపోయింది. కళ్ళింతలు చేసుకుని, దీప్తికేసి చూసింది. ఆమెకి అర్థం కాలేదు దీప్తిచెబుతున్నదేమిటో!

''ఏమిటే నువ్వు చెబుతున్నది? నీ సంసార జీవితంలో అపశ్రుతులా? నేను నమ్మలేకపోతున్నానే...'' తెల్లబోతూ ప్రశ్నించింది శమంత.

''కాని నువ్వు నమ్మాలి. నా సంసార జీవితంలో ఇప్పుడిప్పుడే అపశ్రుతులు వినవస్తున్నాయి. అసలు ఇటువంటి పరిస్థితులు ఏర్పడతాయని కలలో కూడా ఊహించలేదే శమంతా? ఎవరితోనూ చెప్పుకోలేకపోతున్నాను. ఏం చెయ్యడమో నిర్ణయించుకోలేకపోతున్నాను. మా అమ్మానాన్నలకు కూడా ఇంతవరకూ చెప్పలేదు. దీనికంతటికీ కారకుడు భైరవమూర్తి అని ఇప్పుడు తెలుస్తోందే''

జీరపోయిన స్వరంతో అంది దీప్తి. ఆమె కళ్ళల్లో నీరు గిర్రున తిరుగుతూ ఉండటం గమనించింది శమంత.

''ఇంతకీ జరిగిందేమిటే? భైరవమూర్తి అక్కడా పిచ్చిపిచ్చి వేషాలు వేశాడా ఏమిటి?'' ఆమె ఒక కోణంలోనే ఆలోచించి ప్రశ్నించింది.

దీప్తి కళ్ళొత్తుకుంది.

''అతడికి అంత ధైర్యం లేదనుకో! అప్పట్లో ఇక్కడ మీ ఇంట్లో నా కోపాన్ని నా చేతి దెబ్బనీ చవిచూశాడుకదా, మళ్ళీ ఆ ధోరణిలో సాహసించలేకపోయాడు. కాని నామీద కక్షగట్టాడు. పగ ఏదోవిధంగా సాధించాలనుకున్నాడు. దుష్టులకు దుష్టచింతలు కరువా? ఒక వ్యక్తిపై కక్షసాధించాలంటే మార్గాలెన్నో వెదుకుతారు. ప్రత్యక్షంగా హానిచెయ్యలేకపోతే పరోక్షంగానైనా తలపెడతారు. ఇలా అతడు ప్రవర్తిస్తాడని ఈరోజు అతను చెప్పేవరకూ నేను ఊహించలేదు...'' అని ఇంకా చెప్పుకుపోతూంటే, శమంత చప్పున అందుకుంది అసహనంతో.

''అసలింతకీ ఏం జరిగిందో చెప్పకుండా, ఈ ఉపోద్ఘాతం ఎందుకే?'' అంది.

''అసలు విషయానికే వస్తున్నానే'' అంటూ అన్నీ వివరించింది దీప్తి.

ఆశ్చర్యంతో ఆలోచనల్లోపడింది శమంత. ఎంతో హాయిగా, సుఖంగా సరదాగా ఓ సెలయేరులా సాగాల్సిన దీప్తి సంసారజీవితం ప్రారంభదశలోనే ఇటువంటి ఒడిదుడుకులకు గురైనందుకు బాధనిపించింది. స్నేహితురాలి పట్ల సానుభూతి ఉత్పన్నమయింది.

''ఈ భైరవమూర్తే మీ ఆయన్ని ఈ మద్యం రొంపిలోకి దింపాడని, నువ్వెట్లా ఊహిస్తున్నావే దీప్తీ?'' న్యాయవాదిలా ప్రశ్నించింది శమంత.

''నేను నిలదీసి అడిగిన ప్రతిసారీ భైరవమూర్తివాళ్ళంతా బలవంతం చేశారని మా ఆయన చెబుతూ ఉండేవారు. మా ఆయన ఎంత నిగ్రహంతో తప్పించుకోవాలని చూసినా ఏదో సాకు కల్పిస్తూ ఆయన్ని తీసుకుపోయేవారట. మావారి మాటలు నేను మొదట్లో నమ్మకపోయినా, ఈరోజు భైరవమూర్తి చెప్పిందాన్నిబట్టి మా ఆయన చెప్పింది అక్షరాలా నిజమని నమ్ముతున్నానే. మావారి మంచితనాన్ని ఆధా

రంచేసుకుని భైరవమూర్తి ఈ దుర్మార్గానికి పాల్పడ్డాడు''

శమంత సొంతం అర్ధంచేసుకుంది. ఆనాటి సంఘటన మూలంగా దీప్తి జీవితంలో అకారణంగా అపశ్రుతులు మోగుతున్నాయని పించిందామెకి. భైరవమూర్తి ఎంత దుర్మార్గుడో, ఎంతటి కపటి వ్యక్తో ఆమెకిప్పుడు తెలిసింది. అతనిపై వల్లమాలిన క్రోధం ఏర్పడింది. అతని దుష్టబుద్ధిని సహించలేకపోయింది. 'చేసిన వెధవపనికి నోరు మూసుకొని ఊరుకోకుండా ఇంత ప్రతీకారచర్యొకటా?' అనుకుంది ఉద్రిక్తతతో.

"భైరవమూర్తి దుష్టుడని తెలుసుగాని ఇంతటి దుర్మార్గుడని తెలీదే దీప్తీ! ఆ రోజు ఆ వెధవపని చేసింది చాలక ఇంక ప్రతీకార వాంఛ ఒకటా. సిగ్గులేకపోయిందిగామోసు వెధవకి! ముందే ఇలా విషయాలన్నీ తెలిసివుంటే నిన్న సాయంకాలం అతడు మా ఇంటికి వచ్చినప్పుడే మొహం వాచిపోయేలా కడిగేసి ఉందును. బతికిపోయాడు! అయినా ఎక్కడికిపోతాడులే? తప్పు చేసినవాడు ఎప్పుడూ తప్పించుకోలేడు. బహుశా ప్రేమకి ఈ వివరాలన్నీ తెలిసుండవు. మీ ఆయనకీ తెలీవుకదా? అందుకే మీ ఆయన దృష్టిలో భైరవమూర్తి ఒక సన్నిహిత స్నేహితుడి రూపంలో వెలిగిపోతున్నాడు. వీళ్ళిద్దరికీ ఆనాటి సంఘటన భైరవమూర్తి ప్రతీకార చర్య చెప్పి ఈ భైరవుణ్ణి బజారునపడేయాలి. అప్పుడుగాని మీ ఆయనకి జ్ఞానోదయం కలగదు. నిజం నిప్పులాంటిది. ఆ నిజాన్ని బైటపెడితే అది భైరవమూర్తినే దహిస్తుంది. అదొక్కటే మార్గం మనకి'' ఉద్రిక్తతతో అంది శమంత.

స్నేహితురాలి మాటలకు దీప్తి మొహం విప్పారింది. ఈ సమస్యని ఎలా పరిష్కరించడమా అని తను పరితపిస్తున్న తరుణంలో శమంత మాటలు గుండె నిబ్బరాన్ని పెంచాయి. చీరచెంగుతో కళ్ళొత్తుకుంది.

"ఔనే శమంతా! అదొక్కటేమార్గంలా కనిపిస్తోంది. నేనూ మొదట్లో అనుకున్నానోసారి- మావార్ని ఇక్కడికి రప్పించి, విషయాన్ని వివరించాలని. కాని మావారు నా మాటల్ని నమ్మకపోతేనో? అసలే ఆయనకి భైరవమూర్తంటే అంతులేని అభిమానమూ, గౌరవమూను. అతనిమీద ఈగ వాలనివ్వరు. అటువంటిది. స్నేహితుడిపై ఇలా నిందలు వేస్తే నమ్ముతారా అన్న అనుమానంతో ఊరుకున్నాను. సమయానికి నువ్వూ ఇక్కడే ఉండటం నా అదృష్టమే అనుకో. ఆనాటి సంఘటనకి ప్రత్యక్షసాక్షివి నువ్వు. నువ్వు చెబితే అప్పుడైనా ఆ సన్నిహిత స్నేహితుడి దుర్బుద్ధిని అర్థం చేసుకుంటారేమో మావారు. అందుకు మావారిని, ప్రేమను ఇక్కడికి రప్పిద్దామంటావా?'' ఆసక్తితో అంది దీప్తి.

శమంత క్షణం యోచించింది.

"అబ్బే... ఇక్కడికి రప్పించొద్దులేవే! నువ్వు ఏ కారణంవల్ల ఇక్కడికిప్పుడు వచ్చావో మీ అమ్మా, నాన్నలకు తెలీదుకదా?''

"ఔను- తెలీదే. ఇంకా చెప్పలేదని చెప్పానుగా. చెబితే వాళ్ళెంతగా కుమిలిపోతారో వూహించలేం''

"చెప్పకపోవడమే నువ్వు చేసిన మంచిపని. అల్లుణ్ణి ఓ ఉత్తమ వ్యక్తిగా గుండెల్లో నిలుపుకుని ఆనందిస్తున్న మీ అమ్మానాన్నా నిజం తెలుసుకుంటే తట్టుకోలేరు''

"అయితే మరేం చేద్దామంటావు?''

"నేనప్పుడే ఓ నిర్ణయానికి వచ్చేశాన్లే...''

"ఏమిటి?''

"మనిద్దరం కలిసి మీ వూరు వెళ్దాం...''

దీప్తి మొహంలో కొత్త వెలుగు తళుక్కుమంది. ఆనందంతో ఆమె కళ్ళు మెరిసినయ్. పెదాలపై చిరునవ్వు తొణికిసలాడింది.

"నిజంగానా?'' నమ్మలేనట్టుగా, ఉత్సుకతతో అంది దీప్తి.

"ఔనే... నిజంగానే! నీ స్నేహితురాలిగా, బంధువుగా ఆపాటి ఆదుకోకపోతే ఇంకేవిఁటి? ఈ సమస్యని ఇప్పుడే పరిష్కరించుకోకపోతే ఇది క్రమంగా వేళ్ళు నాటుకుని మహావృక్షంగా పెరిగిపోయిననాడు, మనం నిస్సహాయులమై, నిస్పృహతో మౌనందాల్చడం మినహా ఏమీ చెయ్యలేం''

దీప్తి కళ్ళు చెమర్చాయి. 'శమంత అన్నట్టు ఈ సమస్య మహావృక్షంగా పెరిగిపోకుండా చూడాలి...' అనుకుంది.

"అదేనే శమంతా, నా భయంకూడాను''

అంది ఉద్విగ్నతతో. ఆమె స్వరం కంపించింది. "ఈ తరుణంలో నువ్విలా నన్ను ఆదుకుంటున్నందుకు, ఎలా నీకు కృతజ్ఞత చెప్పుకోవాలో అర్థం కావడంలేదు"

శమంత నవ్వింది.

"పిచ్చిదానా మనలో మనకి కృతజ్ఞతలేవిఁటే? నిన్ను ఆదుకోవడం నా బాధ్యతగా భావిస్తున్నాను. దిక్కుతోచని నిన్ను ఈ పరిస్థితిలో వదిలేస్తే, ఇంక స్నేహానికి అర్థం, పరమార్థం లేదు. సరేగాని... ఎప్పుడు బయల్దేరుదామంటావు?"

"ఆ నిర్ణయాన్ని నీకే విడిచిపెట్టాను శమంతా! నువ్వెప్పుడు బైలుదేరుతానంటే అప్పుడే నేను నీతో వస్తాను. నీ వీలునుబట్టి చూసుకో."

"'శుభస్య శీఘ్రం' అన్నారు పెద్దలు. ఎల్లుండి వెళదామా?" అంది శమంత.

"అంతకంటేనా? నువ్వెంత మంచిదానివే శమంతా?" సుమారు స్నేహితురాలిని కౌగలించుకుంది దీప్తి. ఆమె కళ్ళల్లో ఆనందభాష్పాలు చిప్పిల్లినయ్.

శమంత తృప్తిగా మందహాసంచేసింది. దీప్తిమొహంలో వెల్లివిరిసిన కొత్తకాంతి చూసి, ఆమెకి ఎంతో ఆనందం కలిగింది.

శమంత తల్లి అప్పుడే రెండు కప్పుల హార్లిక్సుతో లోపల్నించి వచ్చి, వాళ్ళిద్దరికీ చెరో కప్పు అందించింది.

"ఏవిఁటి విశేషం, అంత ఆనందంగా వున్నారు?" ముసిముసిగా నవ్వుతూ ప్రశ్నించింది చారుమతి.

"మరేం కాదమ్మా- ఎల్లుండి నేను దీప్తితోపాటు విశాఖపట్నం వెళ్తున్నాను. ఎప్పట్నుంచో అంటోంది- వాళ్ళ వూరు రమ్మని. నాకూ వెళ్ళాలనే వుందమ్మా... రెండురోజుల్లో తిరిగి వచ్చేస్తాన్లే"

"ఓ... అందుకటమ్మా అంత ఆనందం! సరే... వెళ్ళిరా. దీప్తి మనకి పరాయి వ్యక్తి కాదుకదా! ఓ మాటగా నాన్నగారిక్కూడా చెప్పి వెళ్ళమ్మా" అంటూ అక్కణ్ణించి వెళ్ళిపోయింది చారుమతి.

"హమ్మయ్య- అసలు విషయం చెప్పేస్తావేమోనని నా గుండెలు కొట్టుకున్నాయే శమంతా" రిలీఫ్ వచ్చినట్టుగా ఊపిరి పీల్చుకుంటూ అంది దీప్తి.

"మంచిదానివేనే! నేనంత తెలివితక్కువదాన్ననుకున్నావా ఏమిటి? హార్లిక్స్ తీసుకో... చల్లారిపోతోంది" చిన్నగా నవ్వుతూ అంది శమంత.

ఇద్దరూ హార్లిక్స్ తీసుకున్నారు.

"భైరవమూర్తి మరి రానట్టేనే..." అంది దీప్తి.

"ఇంకెందుకొస్తాడు? అనుకున్నపని అయిపోయినట్టేగా! నువ్వు కలిశావు, నీతో చెప్పాల్సిందేదో చెప్పేశాడు. ఇంక ఇక్కడికి రావలసిన అగత్యం ఏముందని?"

"అదీ నిజమే. అతడనుకున్నది సాధించాడు. మరింక ఇక్కడికెందుకు వస్తాడు? మరి నేను వెళ్తానే శమంతా... గుర్తుంచుకో-ఎల్లుండి నేను- ఇక్కడికే వచ్చేస్తాను ఇద్దరం కలిసి స్టేషనుకి పోదాం... రెడీగా వుండు" అంటూ లేచింది దీప్తి.

"అలాగేనే!"

దీప్తి ఇంటికి బైలుదేరింది. ఆమె మొహంలో కొత్త ఉత్సాహం ప్రస్ఫుటమౌతోంది. హుషారుగా ముందుకు సాగిపోయింది.

శమంత బాధగా ఓ నిట్టూర్పు విడిచింది. స్నేహితురాలిపట్ల జాలి కలిగింది. 'ఏవిఁటో ఈ మగవాళ్ళు? ఎప్పుడూ ఏదో సమస్య తెచ్చిపెడుతూనే వుంటారు'... అనుకుంది.

★ ★ ★

శమంత దగ్గర్నించి వెళ్ళిన దీప్తి ఇల్లు చేరుకునేసరికి ఆరున్నర కావస్తోంది.

"ఇదిగోనమ్మా... నీకో ఉత్తరం వచ్చింది. నీ పేరన వుందిగాబట్టి మీ నాన్నగారు కవరు చించలేదు. మీ ఆయన రాసిన ఉత్తరమేననుకుంటాను" అంటూ ఓ ఉత్తరాన్ని కూతురికి అందించింది దేవకి.

దీప్తి కవరుమీది అడ్రసు చూసింది. అది భర్త రాసిన ఉత్తరమే. సోఫాలో కూచుంటూ ఆత్రంగా కవరుచించి, ఉత్తరాన్ని బైటికితీసింది. చదవడానికి ఉపక్రమించింది.

"ప్రియాతి ప్రియమైన దీప్తికి,

నువ్వు క్షేమంగా చేరావనుకుంటాను. నీ దగ్గర్నించి ఉత్తరం వస్తుందని రోజూ ఎదురు చూసేవాణ్ణి. నువ్వు వెళ్ళిన దగ్గర్నించీ నిన్ను తలవనిక్షణం లేదంటే నువ్వు నమ్మవేమో!

మీ అమ్మానాన్నా కులాసాయేననుకుంటాను.

ఒంటరిజీవితం దుర్భరంగా వుంది. పెళ్ళికాకముందు ఒంటరి జీవితానికి అలవాటు పడినవాణ్ణేకాని, ఇప్పుడు కాదుగా? క్షణమొక యుగంలా వుంటోంది. నీపై ధ్యాసవల్ల రిహార్సల్సు కూడా సరిగ్గా వేయలేకపోతున్నాను. అబద్ధంకాదు... ఇది నిజం. అందుకే రిహార్సిల్సు కొద్దిరోజులపాటు ఆపాం.

ప్రతి వ్యక్తిలోనూ చిన్నచిన్న బలహీనతలు ఏవో వుంటాయి. వాటిని గోరంతలు కొండంతలుగా భూతద్దంలో చూసుకొని, మనశ్శాంతిని పాడుచేసుకోవడం బుద్ధిమంతుల లక్షణం కాదు. ముఖ్యంగా గృహిణులకు!

ఇంటికి సుఖశాంతుల్ని అందించేది గృహలక్ష్మే! వారిలో అంతులేని ఓర్పు, సహనం వుండాలి. ఎందుకిలా రాస్తున్నానో నువ్వు గ్రహించుకోగలవు.

నేను విజయవాడ రావాలనే ప్రయత్నించాను. ప్రస్తుతం ఆడిటింగ్ అవుతోందిగాబట్టి నాకు సెలవు దొరకలేదు. సెలవు దొరికినపుడు, మనిద్దరం కలిసి వెడదాం. ఇది నా మాటగా మీ అమ్మానాన్నలకు చెప్పు.

నీ రాకకోసం తపించిపోతూ వేయికళ్ళతో ఎదురుచూస్తుంటాను. ఎప్పుడొస్తావో ఉత్తరం రాస్తే స్టేషనుకి వస్తాను.

నువ్వు ఇంటిపట్టున ఉండి హాయిగా భోంచేస్తున్నావు. అదే నాకు కరువయింది. హోటలుకి వెళ్ళాలని బుద్ధిపుట్టడంలేదు. స్వయంపాకం చేసుకునే ఓపిక లేదు.

వెంటనే బయల్దేరుతున్నావుకదూ?

మీ అమ్మానాన్నగార్లకు నా హృదయపూర్వక వందనాలు.

నీకు నా తియ్యని ము... ము... సిగ్గుపడుతున్నావుకదూ? రాయనులే...

నీ
రాజు

పరా: సుదీర్ఘమైన ఈ ఉత్తరానికి విసిగిపోకేం—

రాజు.

ఉత్తరాన్ని మరోసారి చదువుకుంది. నన్నగా నవ్వుకుంది దీప్తి. ఆయన ఎంత సౌమ్యుడో, ఆ హృదయం ఎంత నవనీత సదృశమో మరోసారి అవగాహన చేసుకుంది.

ఆ వుత్తరం అమ్మానాన్నల చేతిలో పడితే ఇంకేమన్నా వుందా? ఆరాలన్నీ తీస్తారు. వాళ్ళ చేతిలో పడకూడదనుకుని, దాన్ని కవర్లోపెట్టి లోపలికి వెళ్ళి తన సూట్‌కేసులో దాచుకుంది బట్టల అడుగున.

"అల్లుడేం రాశాడమ్మా?" దేవకి కూతుర్ని ప్రశ్నించింది.

"ఇంకేం రాస్తారమ్మా? ఒంటరిగా ఉండలేక పోతున్నారట... సరైన భోజనం లేదట. వెంటనే వచ్చేయమని రాశారు"

"ఔనులే మరి! ఎప్పుడూ అలవాటులేనిది వంటేం చేసుకోగలడు? హోటలు భోజనం సహించదేమోమరి. ఆయన వస్తాడన్నావు... ఇప్పుడు రాడా?"

"సెలవు దొరకడం లేదటమ్మా- లేకపోతే వచ్చేవారే! ఎంతో ఇబ్బంది పడకపోతే, ఇలా రాయరమ్మా. అందుకే ఎల్లుండి వెళ్ళిపోదామనుకుంటున్నాను"

"అప్పుడే వెళ్ళిపోవడమేవిఁటే! మరో నాలుగురోజులుండి వెళ్ళు"

"లేదమ్మా... ఆయన భోజనానికి ఇబ్బందిపడిపోతారు..."

"సరే... ఏంచేస్తాం! నాన్నతో చెప్పావా?"

"చెబుతాలే!"

"ఒంటరిగా వెళ్ళగలవా?"

" ఒంటరిగానేవచ్చాను కదమ్మా అయినా నాతోపాటు శమంత వస్తోంది"

"శమంత వస్తోందా? ఎందుకూ?"విస్తుపోయింది దేవకి.

ఏం చెప్పడమా అని ఆలోచించింది దీప్తి.

"వాళ్ళ బంధువులెవరో వున్నారట అక్కడ... వాళ్ళింటికి వెళ్తుందట" అబద్ధం చెప్పేసింది. తప్పదుమరి.

"అలాగా అయితే మీరిద్దరూ సరదాగా వెళ్ళిపోవచ్చు. బట్టలు సర్దుకున్నావా?"

"ఏదీ ఇప్పుడేగా ఆ నిర్ణయాన్ని తీసుకుంది- సర్దుకుంటాను" అంటూ ముందు గదిలోకివెళ్ళి తండ్రితో తన నిర్ణయాన్ని చెప్పింది.

దేవరాజు ఆమె నిర్ణయాన్ని హర్షించాడు. "భార్యాభర్తలు ఒకరి అభిప్రాయాల్ని ఒకరు గౌరవించుకున్నప్పుడే సంసారజీవితం సుఖమయంగా సాగుతుందమ్మా- వెళ్ళిరా..."

దీప్తి బట్టలు సర్దుకుందుకు వుపక్రమించింది.

★ ★ ★

సాయంత్రం ఏడు గంటలుకొట్టింది గోడగడియారం.

రామరాజు ఇంట్లో మందుపార్టీ ప్రారంభమయింది. ఆరోజు పార్టీకి ఆనందాచారి అతిథిగా విచ్చేశాడు.

ఆనందాచారి అభిమానాన్ని సంపాదించడానికి అందరూ ప్రయత్నిస్తున్నారు ముఖ్యంగా భైరవమూర్తి.

రేడియోనాటకాల్లో అవకాశాలు కొట్టేసి, పెద్ద పేరు సంపాదించాలని అతని అభిలాష.

అందుకనే ఆ రోజు ఏర్పాట్లన్నీ భైరవమూర్తే చేశాడు.

ఆనందాచారికి ఆ వాతావరణం బాగా నచ్చింది.

"పార్టీకి మీ ఇల్లు ఎంతో అనువుగా వుందండీ రాజుగారూ! బార్‌లో అయితే తెలిసినవ్యక్తులు ఎవరు వుంటారోనని ఓపక్క భయం పీక్కు తింటుంది. నిర్భయంగా మందు తీసుకోలేం. ఇక్కడైతే అటువంటి భయానికి ఆస్కారమే లేదు" ప్రశంసించాడు ఆనందాచారి.

భైరవమూర్తి మురిసిపోయాడు.

"మీరన్నది అక్షరాలా నిజం ఆచారిగారూ! అందుకే ఇక్కడ ఏర్పాటు చేశాను. కాని మా రామరాజు మాత్రం ఇబ్బంది ఫీలవుతూ ఇటువంటి. పార్టీలను వ్యతిరేకిస్తున్నాడు. వాడు ఒంటరిగా వున్నాడనే, మనం ఈ ఏర్పాట్లు చేసుకుంటున్నాంగాని, వాడి ఫామిలీ వుంటే ఈ ఛాయలకే రాము" చిరునవ్వుతో రామరాజు కేసి క్రీగంట చూస్తూ అన్నాడు.

రామరాజు ఏమీ అనలేదు. కాని, ఆనందాచారి వూరుకోలేదు.

"ఏమిటండీ రామరాజుగారూ... ఇది నిజమేనా? మీవంటి ఓ ఉత్తమ కళాకారుడికి స్పోర్టివ్ స్పిరిట్ లేదా! నేను నమ్మను" అన్నాడు.

రామరాజు ఇప్పుడు ఏం సమాధానం చెప్పలేదు. ఏం చెబుతాడు గనక? తనింట్లో పార్టీలు జరుపుకోవడం మొదట్నుంచీ అతనికి ఇష్టంలేదు- ఒంటరిగా వున్నప్పుడైనా సరే! ఉన్నది వున్నట్టుగా చెప్పడానికే ఇష్టంలేకపోయింది. బాగా మొహమాటస్తుడు మరి!

"ఆచారిగారూ... ఇంక మనం కబుర్లుకట్టిపెట్టేద్దామండీ! గ్లాసులోని ద్రవం ఎలా వూరిస్తోందో, మీరెటువంటి అనుభూతిని పొందటంలేదా?" అన్నాడు శ్రీపతి ఇంక వుండబట్టలేక.

"మీరన్నది నిజం శ్రీపతిగారూ- లెటజ్ సెలిబ్రేట్..." అంటూ గ్లాసు అందుకున్నాడు ఆనందాచారి.

ఎవరి గ్లాసు వాళ్లందుకున్నారు.

"ఫర్ బ్రైట్ ఫ్యూచర్ ఆఫ్ ది హీరో రామరాజు...." అంటూ భైరవమూర్తి ఛీర్స్ చెప్పి మందుని సిప్ చేయడం ప్రారంభించాడు. మిగిలిన ముగ్గురూ అతణ్ణి అనుసరించారు.

ఆరోజు రెండు విస్కీ బాటిల్స్ ఖాళీ అయ్యాయి. అధికభాగం ఆనందాచారి, భైరవమూర్తి సేవించారు.

"ఈరోజు నేను జోస్యం చెబుతున్నాను చూడండి- మన రామరాజుగారు పెద్ద హీరో అవుతారు. కొన్నాళ్ళు పోయాక వెండితెరమీద కన్పించినా, ఆశ్చర్యపోనక్కర్లేదు" అన్నాడు ఆనందాచారి.

భైరవమూర్తి, శ్రీపతి చప్పట్లు కొట్టారు.

"మేం కోరుకుంటున్నదీ అదేనండీ ఆచారిగారూ" అన్నాడు భైరవమూర్తి.

రామరాజు చిన్నగా నవ్వుకున్నాడు. ఆనందాచారివన్నీ భైరవమూర్తి చెప్పిన చిలకపలుకులేనని రామరాజుకి తెలీదు.

తొమ్మిది గంటలకి భైరవమూర్తి బృందం వెళ్ళిపోయారు. మత్తుగా వున్న రామరాజు

తలుపు గడియవేసి లైటార్పి మంచంపై ఒరిగి పోయాడు. క్షణంలో నిద్రపట్టేసిందతనికి.

★ ★ ★

రామరాజు సోమవారం మామూలుగానే ఆఫీసుకి వెళ్ళాడు.

సహోద్యోగులు అతణ్ణి ఓ వింతమనిషిని చూసినట్టుగా చూస్తున్నారు.

"ఏవిటండీ రామరాజుగారూ, ఇలా చిక్కిపో యినట్టు అగుపిస్తున్నారేవిటి? ఒంట్లో బాగో లేదా?" ప్రశ్నించాడొక మిత్రుడు.

"బహుశా ఇంట్లో బాగులేదేమో" పరిహాసధో రణిలో అన్నాడు మరో సహోద్యోగి.

అందరూ పకాల్న నవ్వేరు.

"అయ్యుండొచ్చు... కొత్తగా పెళ్ళిచేసుకున్నా డు కదా?" మరొకతను సమర్థించాడు.

వాళ్లంతా ఎందుకలా అంటున్నారో అర్థంగాక ఆశ్చర్యపోయాడు.

"ఇంతకీ ఏమయింది. నేను బాగానే వున్నానే! నాకు ఒంట్లోనూ బాగుంది, ఇంట్లోనూ బాగుంది..." అన్నాడు కాస్త సీరియస్‌గా. మొదటిది నిజమైనా రెండోది నిజంకాదని వాళ్ళకె వ్వరికీ తెలీదు.

వీళ్ళ నవ్వులు విని ఆఫీసు సూప రింటెండెంటు రామారావు అక్కడికొచ్చాడు.

"వాటీజ్ ద మేటర్? ఎందుకా నవ్వులు?" గద్దించాడు.

నిజమే మరి- ఆఫీసులో క్రమశిక్షణ చూ సేది ఆయనేగా!

"చూడండి సార్ నిక్షేపంలా వున్న నన్ను పట్టుకుని, నా ఆరోగ్యం బాగులేదంటున్నారు వీళ్ళు" అన్నాడు సన్నగా నవ్వుతూ.

రామారావు రామరాజుకేసి తేరిపారజూశా డు.

"రాజూ... ఒక్క విషయం చెప్పనా?" అన్నా డు.

"చెప్పండి సార్..."

"ఎప్పుడూ ట్రిమ్‌గా హుషారుగా కనిపించే నువ్వు, ఈరోజు చాలా డల్‌గా కనిపిస్తున్నావు- అందుకే వాళ్ళకా అనుమానం వచ్చింది"

"అంతే అంటారా"

"అంతే!"

"అయితే దానికి కారణం ఏవిటంటారు?"

"చెప్పేదా?"

"చెప్పండి సార్..." ఆసక్తిగా అన్నాడు రామ రాజు.

మిగిలినవాళ్ళంతా రామారావుకేసే కళ్లప్ప గించి చూస్తున్నారు ఆయనేం చెబుతాడోనని.

"రాజూ... నీకు రోజూ గడ్డంగీసుకునే అల వాటుందా?"

"ఔనుసార్! చాలారోజులుగా నాకా అలవా టయింది"

"నువ్వు గడ్డంగీసుకుని ఎన్ని రోజుల యింది?" అసలు రహస్యం కనిపెట్టేసినట్టుగా అన్నాడు రామారావు.

రామరాజుకి అర్థమయింది. ఓసారి గడ్డాన్ని చేత్తో తడుముకుని చూశాడు. బాగా పెరిగిన ట్టుంది.

"మూడు రోజులయింది సార్- గడ్డం గీసు కుని..." అన్నాడు మెల్లగా.

"అలవాటు ఎందుకు తప్పిందోయ్"

"బద్ధకంసార్! అంతే- మరేంలేదు"

రామారావు నవ్వేశాడు.

"చూశావా... నీ బద్ధకం ఎటువంటి ఇబ్బందిని తెచ్చిపెట్టిందో. అందుకే బద్ధకం అవాంఛనీయమంటారు. ఒక్క గడ్డం విష యంలోనేకాదు- ఏ విషయంలో తీసుకున్నా బద్ధకం మంచిదికాదు. ఆఫీసుపనిలో బద్ధ కంచూపించారనుకోండి వర్కుపెండింగులో వుండిపోతుంది. అది పూర్తిచేసుకునేసరికి తల ప్రాణం తోక్కి వస్తుంది. అందరూ విన్నారు కదా బద్ధకం లేకుండా ఆఫీసు పని చేసు కోండి" అంటూ చిన్నగా నవ్వుతూ రామరాజు భుజంతట్టాడు.

"మీ ఆవిడ పుట్టింటికెళ్లిందా ఏమిటి?" మెల్లగా అడిగాడు.

"ఔను సార్?"

"అదీ - అలాచెప్పు. నీ బద్ధకానికి అసలుకా రణం ఇదేనోయ్! వెంటనే మీ శ్రీమతికి ఉత్తరం రాసెయ్, రెక్కలుకట్టుకుని వచ్చేయ మని..." అని చెబుతూ వెళ్ళిపోయాడు అక్క ణ్ణించి రామారావు.

"మేం వూరికనే అనలేదోయ్ రామరాజూ! ఇప్పుడు అర్థమయిందికదా?" అన్నాడొక మిత్రుడు.

"ఆఁ.ఆఁ... అర్థమయింది. అలా సెలూన్‌కి వెళ్ళి ఇప్పుడే గడ్డంగీయించుకొచ్చేస్తా నుండండి..." అంటూ చరచరా బైటికి నడిచాడు.

సెలూన్‌లోకి అడుగుపెట్టాడు రామరాజు. అక్కడ షేవ్‌చేయించుకుంటున్నారు భైరవమూర్తి శ్రీపతీను. వాళ్ళు ఆఫీసులో ఎప్పుడు పనిచేస్తారో రాజుకి అర్థమైచావలేదు.

"ఏంరా రాజూ... నీకు సెలూన్‌కి రావడం అలవాటులేదుకదా, ఇలా వచ్చావేవింటి?" అన్నాడు భైరవమూర్తి, కుర్చీలోంచి లేస్తూ.

అదే కుర్చీలో రామరాజు కూచున్నాడు. "గడ్డం పెరిగినంతమాత్రాన నాకు ఆరోగ్యం బాగులేదంటే ఎలా?" విసుగ్గా అన్నాడు.

"ఎవరన్నారు?" చిరునవ్వుతో అడిగాడు భైరవమూర్తి.

"ఇంకెవరు- మన స్టాఫే..."

"విరహవేదనకి ఇదో చిహ్నమని చెప్పలేకపోయావా?"

"చాల్లేరా! వినక వినక నీ బోడిసలహాలే వినాలి..."

"ఔనూ... మీ ఆవిడ దగ్గర్నించి ఉత్తరాలేమైనా వచ్చాయా?"

"రాలేదురా! ఆమె వచ్చేస్తుందని రోజూ ఎదురుచూస్తున్నాను..."

"పాపం!"

"అదేవింట్రా- అలా అన్నావు?"

"ఇప్పుడొస్తుందన్న నమ్మకం నాకులేదు"

"నీకెలా తెలుసు?"

"నీతో పోట్లాడి వెళ్ళిందిగా?"

రామరాజు చిన్నబుచ్చుకున్నాడు. సెలూన్ వంటి ఒక పబ్లిక్‌స్థలంలో భైరవమూర్తి అలా అనడం, బాగులేదనిపించింది. ఇంక ప్రసంగాన్ని పెంచుకోకూడదనుకున్నాడు.

"అబ్బే... అదేం కాదులేరా! నువ్వెళ్ళు... నేను తర్వాత వస్తాను" అంటూ, అక్కడితో ఆ ప్రసంగానికి ఫుల్‌స్టాప్ పెట్టేశాడు రామరాజు.

బార్బర్ వచ్చి అడిగాడు-

"ఏవింటిసార్... షేవింగా ?" అని.

"ఔనోయ్..."

షేవ్‌చేయించుకుని, హుషారుగా ఆఫీసులోకి అడుగుపెట్టాడు రామరాజు.

రామరాజుని చూసి, మిత్రులంతా మురిసిపోయారు.

"ఇప్పుడు చూడవోయ్ ఎంత హుషారుగా అగుపిస్తున్నావో!" అన్నాడొక మిత్రుడు.

రామారావు మళ్ళీ అక్కడికి వచ్చాడు.

"ఇప్పుడు అర్థమయిందా రామరాజూ, రోజూ గడ్డంఎందుకు గీసుకుంటారో!" అన్నాడు రామారావు ఒక అడ్వర్‌టైజ్‌మెంటు చెబుతున్నట్టుగానే.

"అర్థమయిందిసార్! మరెప్పుడూ బద్ధకంవడి గడ్డంగీయడం మానేయనుసార్! బుద్ధొచ్చింది."

"మీ ఆవిడకి వుత్తరం రాశావా?"

"లేదుసార్! ఉత్తరం అయితే ఆలస్యమవుతుంది. టెలిగ్రామ్ ఇస్తాను సార్..."

"వద్దోయ్... టెలిగ్రామ్ ఎప్పుడూ ఇవ్వకు. మీ అత్తా మామగారలు వయసుమళ్ళినవాళ్ళు కదా! టెలిగ్రామ్ అన్నమాట వినగానే వాళ్ళు కంగారుపడిపోతారు. ఏ ఒక్కరి గుండెకాస్త బలహీనమైనదయినా... మరి నేను చెప్పలేనోయ్... అంచేత వుత్తరమే రాసి పడేయ్"

"అంతే అంటారా?"

"అంతేమరి!"

"ఇప్పుడె రాసేస్తానండీ!"

"అయినా నాకు తెలీక అడుగుతాను, ఎంత కొత్తగా పెళ్ళయినా కొద్దిరోజులకే ఇంత విరహమేవింటోయ్? నీబలహీనతని మీ ఆవిడ కనిపెట్టేసిందనుకో, ఇంక నీ ముక్కుకి తాడు బిగించి ఆడించేస్తుంది. అందుకే మగాళ్ళు ధీరుల్లా, వీరుల్లా గంభీరంగా వుండాలి. అప్పుడే భార్య 'భర్తచేతిలో కీలుబొమ్మ" చిన్న వుపన్యాసం దంచాడు రామారావు.

అంతలో ప్యూన్ వచ్చాడు రామారావుదగ్గరికి.

"సార్... ఫోనొచ్చింది"

"ఎక్కణ్ణించి?"

"అమ్మగారు ఫోన్లో వున్నారండీ..." అని ఫ్యూన్ అన్నాడో లేదో రామారావు పురకలువేస్తూ వెళ్ళిపోయాడు.

అక్కడున్న అందరూ నవ్వేరు.

"నవ్వకండి... రామారావుగారు చెప్పింది అక్షరాలా నిజం. కాని ఆచరణలో పెట్టడమే ఎవరికయినా కష్టం. అతను చెబుతున్నాడే గాని, ఆచరణలో పెట్టలేకపోయాడు పాపం! మనమూ అందుకు భిన్నంగా వున్నామని అనుకోవద్దు" అన్నాడు రామరాజు.

"ఇంతకీ రామరాజుగారూ మీరు ప్రాక్టీసుచేస్తోన్న నాటిక రిహార్సిల్సు ప్రస్తుతానికి ఆగిపోయినట్టు విన్నాను... ఎంతవరకూ నిజమండీ?" కొత్తగా వుద్యోగంలో చేరిన కుర్రాడు అడిగాడు.

"ప్రస్తుతానికి ఆగినమాట నిజమే! హీరోయిన్ డేట్స్ఇచ్చాక మళ్ళీ ప్రారంభిస్తామండీ!"

"మీనటన చూడాలని ఆసక్తిగా వుందండీ!"

"తప్పకండా చూద్దురుగాని... అంతేకాదు- మీకు ఆసక్తివుంటే మా సమాజంలో నటుడిగా చేరండి"

"థాంక్సండీ!" తృప్తిగా అన్నాడా కుర్రాడు.

తర్వాత, ఎవరి సీట్లోకి వాళ్ళు వెళ్ళిపోయారు.

★ ★ ★

సోమవారం సాయంత్రం, ఆఫీసు విడిచిపెట్టాక భైరవమూర్తి తమతో రమ్మని బలవంతంచేసినా, వెళ్ళడానికి ఇష్టంలేక ఇల్లు చేరుకున్నాడు రామరాజు. వస్తున్నపుడే ఓ హోటల్లో పరోటాలు కట్టించి తెచ్చుకున్నాడు.

ఆరాత్రికి వండుకునే ఓపికలేక పరోటాలు తినేసి, పాలుతాగి, మంచంమీద చేరబడ్డాడు రామరాజు. ఒకపట్టాన నిద్రపట్టడం లేదు. కన్నుమూస్తే చాలు— దీప్తి రూపమే గుర్తుకొస్తోంది. ఆమె వెళ్ళడానికి కారణం, నిజంగా తలిదండ్రులు జ్ఞప్తికి రావడమేనా లేక తన ప్రవర్తన ఆమెచేత అలాచేయించిందా?... అతనికెందుకో ఆరోజే ఆ అనుమానం స్ఫురించింది. తాను సెలవుదొరక్క రావడంలేదని వుత్తరం రాశాడు కూడాను! అయినా వచ్చేయక పోవడానికి కారణం ఏమిటి?... అతని వూహకేం అందలేదు.

'టంగ్-టంగ్' మంటూ గడియారం తొమ్మిదిగంటలు కొట్టింది.

ఇంటిముందు ఆటో ఆగిన చప్పుడయింది. తనింటికి ఇప్పుడెవరు వచ్చి వుంటారా అని, చప్పునలేచి కూచున్నాడు.

తలుపుతట్టిన చప్పుడు విని, వెళ్ళి తలుపు తెరిచాడు రామరాజు.

ఎదురుగా చిరునవ్వులు చిందిస్తూ నిల్చున్న దీప్తిని, ఆమెపక్కనే మరో అమ్మాయినీ చూసి నిర్ఘాంతపోయాడు. ఆ అమ్మాయిని ఎక్కడో, ఎప్పుడో చూసినట్టే గుర్తుందతనికి కాని, ఎవరో చప్పున జ్ఞప్తికిరావడంలేదు. ఈ ఆలోచనల్లో క్షణంపాటు, అలా నిల్చుండిపోయాడు.

"ఏమిటండీ- అలా అయోమయంగా చూస్తున్నారు?" నవ్వుతూ అంటూనే, లోపలికి నడిచింది దీప్తి.

"రావే శమంతా!" అంటూ తనవెంట లోపలికి తీసుకుపోయింది శమంతను.

"ఉత్తరంలేకుండా హఠాత్తుగా వచ్చేశావేమిటి? నసిగాడు" రామరాజు, గదిలో లైటువేస్తూ.

"వెళ్ళినపుడు మావాళ్ళకి వుత్తరం రాశానా ఏమిటండీ? అలాగే ఇప్పుడూను. అర్జంటుగా బైలుదేరడంవల్ల వుత్తరం రాయడానికి వ్యవధి లేకపోయింది. అన్నట్టు, ఈమెని గుర్తుపట్టారా?" శమంతను చూపుతూ ప్రశ్నించింది.

తలుపు గడియవేసి వచ్చిన రామరాజు శమంతకేసి ఓసారి చూశాడు.

"క్షణం క్రితంనుంచీ అదే ఆలోచిస్తున్నాను దీప్తీ! ఎక్కడో చూసినట్టుగానే గుర్తుంది. కాని ఎక్కడ చూశానో ఖచ్చితంగా తెల్చుకోలేకపోతున్నాను" బిడియపడుతూనే అన్నాడు.

"అన్యాయమండీ... ఆపాటి జ్ఞాపకశక్తి లేకపోతే ఎలా? ఔనూ- నాటకాల్లో మీ పోర్షన్లు ఎలా కంఠస్థం చేస్తున్నారండీ మరి?" నవ్వుతూ అంది.

"అది వేరులే దీప్తీ! అందులో ఏకాగ్రత వుంటుంది"

"దీన్ని మన పెళ్ళిలో చూశారండీ! శమంత

అని నా సన్నిహిత స్నేహితురాలు. మనకి బంధువు కూడాను. విజయవాడలో మా ఇంటికి కాస్తంత దూరంలోనే వుంటున్నారు. మన వివాహానికి కొన్ని నెలలముందే పెళ్ళయింది దీనికి. హైదరాబాద్‌లో వీళ్ళాయనికి వుద్యోగం. మొన్ననీమధ్యే హైదరాబాద్‌నుంచి వచ్చింది. ఓసారి మనింటికి రమ్మంటేనూ ఎంతో మురిపించుకొని వచ్చిందీరోజు. మీ ఫ్రెండు భైరవమూర్తి లేడూ, అతనికి బాగా దగ్గరివాళ్ళు..." గుక్కతిప్పుకోకుండా అన్ని వివరాలతోసహా శమంతని పరిచయంచేసింది దీప్తి.

రామరాజుకి ఇప్పుడు గుర్తుకొచ్చింది. నన్నని దరహాసం అతని పెదాలపై నాట్యంచేసింది.

"ఔనవును... ఇప్పుడు గుర్తుకొచ్చిందిలే దీప్తీ!" అంటూ శమంతకేసి చూసి-

"మీరు మా ఇంటిని పావనం చెయ్యడం చాలా సంతోషంగా వుందండి శమంతగారూ! భైరవమూర్తి నాకు ప్రాణమిత్రుడు" అన్నాడు.

శమంతకి ఓ చిన్న అవకాశం చిక్కినట్టనిపించింది. దాన్ని జారవిడుచుకోలేదామె.

"భైరవమూర్తి మీకు ప్రాణస్నేహితుడే కావొచ్చునండీ రామరాజుగారూ! కాని మా కుటుంబాల్లో అతనిపట్ల ఎవ్వరికీ సద్భావంలేదు. నిజానికి అతని భార్య ప్రేమ మాకు సన్నిహితబంధువు. ఆమెపరంగానే ఈయన బంధుత్వం. అతను నిలకడలేని మనిషేకాదు- నమ్మదగ్గవాడు కాదు. అతనితో మీకు సన్నిహిత స్నేహం ఏర్పడిందంటే ఆశ్చర్యంగానేవుందండీ!" అంటూ తన అభిప్రాయాన్ని వ్యక్తంచేసింది శమంత.

రామరాజు మొహం అప్రయత్నంగా వెలవెలబోయింది. ఆమె వెలిబుచ్చిన అభిప్రాయాన్ని ఎలా ఖండించాలో అర్థంకాలేదతనికి. అందుకే క్షణంసేపు మౌనం దాల్చాడు. తన సన్నిహిత స్నేహితుణ్ణి ఆమె అలా నిందించినందుకు ఒకవిధంగా అవమానించినందుకు అతని హృదయం రగిలింది. కాని ఏంచెయ్యగలడు? ఉద్రేకపడి ఆమెను తిట్టడానికిగాని, అవమానించడానికిగాని ఆమెపై తనకున్న అధికారం ఏవిటి? ఆమె తన అర్థాంగికాదు కదా... ఇలా ఆలోచనలు సాగినయ్ అతని మస్తిష్కంలో.

దీప్తి ఆసక్తిగా భర్తకేసి చూస్తోంది. శమంత మాటలకి ఆయన కోపగించుకుంటాడేమోనని ఆమె భావించింది. అయితే అలా జరగకపోయేసరికి విస్తుపోయింది. బహుశా శమంత పరాయివ్యక్తి కావడంవల్లనే నిగ్రహించుకున్నారేమోనని నిర్ధారణ చేసుకుంది.

"వంట ప్రారంభించు దీప్తీ! మీరిద్దరూ భోంచేయలేదుకదూ?" టాపిక్ మారుస్తూ అన్నాడు రామరాజు.

"ఇప్పుడేం వద్దులెండి. మాతోపాటు తెచ్చుకున్న టిఫిను బండిలోనే తీసుకున్నాం. ఆకలిగా లేదు కూడాను" అంది శమంత కలిగించుకుంటూ.

"సరే... మీ ఇష్టం దీప్తీ! మీరిద్దరూ ఈ గదిలో పడుకోండి... నేను పక్కగదిలోకి పోతాను" అంటూ పక్కగదిలోకి వెళ్ళిపోయాడు రామరాజు.

దీప్తి ఓసారి గదంతా కలయజూసింది. రెండురోజుల్నుంచి ఆ గది తుడిచినట్టే లేదనిపించిందామెకి. సామానంతా తీరులోలేదు.

"ఆడది ఇంట్లో లేకపోతే ఆ ఇల్లు ఎంత ఛండాలంగా తయారవుతుందో చెప్పడానికి ప్రస్తుతం మా ఇల్లే వుదాహరణగా తీసుకోవచ్చునే శమంతా!"

శమంత నవ్వేసింది.

"అది సహజమే! మీ ఇల్లేకాదు ఏ ఇల్లయినా అంతే!" బడలికగా మంచంమీద ఒరిగిపోతూ అంది శమంత.

ట్యూబ్‌లైటు ఆఫ్‌చేసి బెడ్‌లైటు వేసి వస్తూ శమంత పక్కనే మంచమ్మీద చేరబడింది దీప్తి.

శమంత మెదడు రేపటి కార్యక్రమం గురించే ఆలోచిస్తోంది.

* * *

తెల్లవారింది.

దీప్తికి మెలుకువ వచ్చేసింది. శమంత దుప్పటి ముసుగులో సుఖనిద్రలో వుండగా ఆమెని మేల్కొలపాలనిపించలేదు.

చప్పునలేచి కాలకృత్యాలు తీర్చుకుని గది తుడిచి సామాను తీరులో సర్దింది దీప్తి.

భర్త అప్పుడే లేవరని దీప్తికి తెలును. అందుకే పక్కగదిలోకి వెళ్ళే ప్రయత్నం చెయ్య లేదు.

"శమంతా... బాగా పొద్దెక్కిందే- లే..."



అంది.

శమంత లేచి గడియారంవేపు పరికించింది.

ఆరున్నర దాటింది.

"నువ్వు లేచినపుడే నన్నూ లేపలేకపోయావే?" మంచం దిగుతూ అంది శమంత.

"హాయిగా నిద్రపోతున్నావు... నిన్నెందుకు ఇబ్బందిపెట్టడమని మానేశాను"

"మంచిదానివే! మీ ఆయన లేచారా?"

"లేదులే... ఇంత పెందరాళే లేవడం ఆయనకి అలవాటులేదు"

"అయినా ఏం బావుంటుందని? ఆయన మేల్కొనకముందే స్నానం చేసెయ్యాలి" అంటూ బ్రష్‌తీసుకుని బాత్‌రూమ్‌కేసి నడిచింది శమంత.

దీప్తి నవ్వుకుంది.

శమంత దంతధావనం చేసుకుని వచ్చాక కాఫీ అందించింది దీప్తి.

"కాఫీ బ్రహ్మాండంగా వుందే దీప్తీ! స్నానం ముగించుకుని వచ్చేస్తానుండవే..." ఖాళీకప్పు దీప్తికి అందించేసి సూట్‌కేసులోంచి బట్టలు తీసుకుని స్నానానికి వెళ్ళిపోయింది శమంత.

రామరాజు లేచేసరికి పావుతక్కువ ఎనిమిది చూపెడుతోంది గడియారం. దీప్తి భర్తకి బెడ్‌కాఫీ ఇచ్చింది.

"తొందరగా మొహం కడుకొన్ని కూరగాయలు తీసుకురండి" అంది.

"అలాగే!"

రామరాజు తొందరగా కాలకృత్యాలు తీర్చుకుని వచ్చేశాడు.

దీప్తి సంచీ తెచ్చి అందించింది.

"అన్నయ్యగారూ- ఓ చిన్న రిక్వెస్టు" అంది శమంత.

"చెప్పండి..."

"మీరు మరేం అనుకోకపోతే భైరవమూర్తిగారికి, అతని భార్య ప్రేమకి నేను వచ్చినట్టు చెప్పండి. సాయంత్రం అయిదింటికి ఇక్కడికి రమ్మన్నానని కూడా చెప్పండి"

"ఓస్... ఇంతేనా? ఇప్పుడే చెప్పేస్తాలెండి. మార్కెట్టుకి వెళ్ళే తోవలోనే వుంది వాళ్ళిల్లు"

"థాంక్సండీ!"

"దీనికోసం థాంక్స్ ఎందుకులెండి"

రామరాజు మార్కెట్టుకి వెళ్ళాడు.

"నువ్వు రమ్మని కబురు పంపిస్తున్నావుగాని భైరవమూర్తి వస్తాడంటావా?" సందేహిస్తూ అడిగింది దీప్తి.

"నాకూ నమ్మకంలేదే! అయినా మన ప్రయత్నం మనం చెయ్యాలికదా? అతడు రాకపోయినా ప్రేమ తప్పకుండా వస్తుంది. ఆ నమ్మకం వుంది. ఆమె వస్తేచాలు... నా ప్రయత్నం ఫలించినట్టే" అంది శమంత.

"ఔనూ... రాత్రి మా ఆయనసమక్షంలో భైరవమూర్తి గురించి నిర్భయంగా అలా చెప్పావేవిటి? ఆయనకి ఆ స్నేహితుడంటే ప్రాణసమానం. నీ అభిప్రాయానికి కోపగించుకుంటారేమోనని భయపడ్డానే"

శమంత చిన్నగా నవ్వింది.

"అది నా స్వంత అభిప్రాయమే! మీ ఆయనకి నేనేం అర్థాంగిని గనకనా, నా చెంప ఛెళ్ళుమనిపించడానికి?" నవ్వుతూ అంది.

దీప్తి నవ్వకుండా వుండలేకపోయింది.

టిఫెనుచేసి ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటున్నారు.

రామరాజు మార్కెట్‌నుంచి తిరిగొచ్చాడు. "దీప్తీ... సంచి తీసుకెళ్లు" అంటూ సోఫాలో కూలబడ్డాడు.

"కాఫీ తెచ్చి ఇస్తానుండండి..." సంచి తీసుకుని లోపలికి వెళ్ళి, కాఫీ కప్పుతో తిరిగివచ్చింది దీప్తి. భర్తకి అందించింది. "భైరవమూర్తిగారింటికి వెళ్లారా అన్నయ్యగారూ?" ప్రశ్నించింది శమంత.

"వెళ్లానండీ... మీరు వచ్చినట్టు చెబితే ప్రేమగారెంతో ఆనందించారు. ఆమె సాయంత్రం తప్పకుండా వస్తానంది. కాని భైరవమూర్తి మాత్రం ఏదో అర్జంటు పనుందంటూ తప్పించుకున్నాడు" చెప్పాడు రామరాజు.

శమంత ఓ నిశ్వాసం వదిలింది. "అతనంతేలెండి— నాకు తెలుసు. సాయంత్రం అవ్వగానే ఏదో పార్టీ వుండాలి. అందుకే అతను ఎక్కడికీ రాలేడు"

రామరాజు గుండెల్లో అదృశ్యమైన అంకుశమేదో తగిలినట్టయింది. ఆమె తన స్నేహితుణ్ని ఏ దృక్పథంలో చూస్తోందో అతనికిప్పుడు బాగా అర్థమయింది. క్రితంరాత్రి మూర్తి గురించి ఆమె వెలిబుచ్చిన అభిప్రాయం మరోసారి అతని చెవుల్లో గింగురుపెట్టింది. అంతే! ఆ విషయంలో మరేమీ మాట్లాడలేకపోయాడు.

"దీప్తీ... స్నానానికి నీళ్లు తోడిపెట్టు. భోజనంచేసి కాస్త పెందరాళే వెళతాను ఆఫీసుకి" అంటూ పక్కగదిలోకి వెళ్లబోయాడు రామరాజు.

"అన్నయ్యగారూ— సాయంత్రం మీరు ఎన్నింటికి వస్తారూ?" అంది శమంత.

"ఇంటికి వచ్చేసరికి ఆరుగంటలవుతుందండీ" ఆగి అన్నాడు.

"ఈ ఒక్కరోజు కాస్త పెందరాళేరాలేరా?"

"ఎందుకండీ?"

"ప్రత్యేకించి పెద్ద పనేంలేదులెండి. ఏదో కాస్త వుబుసుపోకకి. అయిదుగంటలకంతా వచ్చేస్తే చాలు... ప్లీజ్..." ప్రాధేయపడుతున్నట్టే అందామె.

రామరాజు ఇరకాటంలో పడ్డాడు. రాలేనంటే తాను కూడా ఏదో పార్టీకి వెళ్తున్నాడేమోనని అనుమానిస్తుందన్న భయం అతణ్ని ఓ పక్క పట్టిపీకింది.

భైరవమూర్తిపై ఏర్పరచుకున్న భావనే తనపై ఏర్పరచుకుంటే...? అతని గుండె ఝల్లుమంది. అసలు ఆమె ఎందుకు రమ్మంటున్నదో అతని వూహకి అందలేదు. అయినా రాకతప్పదు అనుకున్నాడు.

"ఏమిటండీ అంత ఆలోచన? శమంత మరీ ఇదిగా చెబుతూవుంటే కాదనకూడదండీ! ఈ ఒక్కరోజుకీ కాస్త పెందరాళే వస్తే కొంపేం మునిగిపోదులెండి" స్నేహితురాల్ని బలపరుస్తూ అంది దీప్తి.

రామరాజుకి గత్యంతరం అగుపించలేదు. మరీ మొండిగా తను ప్రవర్తించి, ఆమె అభ్యర్థనని తోసిపుచ్చడం అసభ్యంగా, వుంటుందేమోనని అభిప్రాయపడ్డాడు.

"సరేలెండి శమంతగారూ! మీరు ఇంతగా చెబుతూవుంటే ఇంకేం చెయ్యను. అయిదింటికి వచ్చేస్తాల్లెండి"

"థాంక్స్ అన్నయ్యగారూ! మీరు మంచి నటులని విన్నాను. ప్రస్తావన మార్చింది శమంత.

స్నేహితురాలు ఆ ప్రస్తావన ఎందుకు తీసుకొచ్చిందో అర్థం కాలేదు దీప్తికి. స్నేహితురాలి సునిశితమైన తెలివితేటలపై ఆమెకి గొప్ప నమ్మకం వుంది. అందుకే అక్కడ వుండకుండా వంటగదికేసి నడిచింది దీప్తి.

తన నటన గురించి ఎవరయినా ప్రస్తావించితే చాలు పొంగిపోతాడు రామరాజు. శమంతకి బహుశా దీప్తే చెప్పివుండొచ్చుననుకున్నాడు.

"ఏదోలెండి— మా నాటకసమాజంలో వున్న నటులందరికంటె కాస్త బాగా నటిస్తానని అందరూ అంటూవుంటారండీ! అంతకుమించి గొప్ప నటుణ్నేమీ కాదులెండి. నటనన్నది ఓ మహాసముద్రంలాంటిది. ఎంత దిగినా ఇంకా లోతు వుందనే అనిపిస్తుంది. నేను నేర్చుకోవలసింది చాలా వుందండీ" వినమ్రంగా చెప్పాడు రామరాజు.

రామరాజు నిరాడంబరత, నిగర్వం శమంతను ముగ్ధురాల్ని చేసింది. ఇటువంటి వ్యక్తి తన మంచీచెడుల్ని ఎందుకు బేరీజు వేసుకోలేకపోతున్నాడో ఆమె వూహకి అందని విషయమయింది.

"తమ గురించి తామే గొప్పలు చెప్పుకోకపోవడం ఉత్తమ వ్యక్తుల లక్షణం. మీ మనస్తత్వాన్ని నేను మనసారా అభినందిస్తున్నాను రామరాజుగారూ సాధారణంగా మీరు ఎటువంటి పాత్రలు ధరిస్తూవుంటారండీ?" అంది శమంత.

"మీరు జర్నలిజం కోర్సు చదివారా ఏమిటండీ?" నవ్వుతూ ప్రశ్నించాడు రామరాజు, ఆమె ప్రశ్నించే ధోరణి గమనించి.

శమంత నవ్వుకుంది. "అబ్బే... అటువంటిదేమీ లేదండీ! అయితే కాలేజీలో చదువుకునే రోజుల్లో నాటకాలపట్ల అభిరుచి వుండేది. విరివిగా చూస్తూవుండేదాన్ని. ఇంతకీ మీరు నా ప్రశ్నకి జవాబు చెప్పారుకాదు?" ముసిముసిగా నవ్వుతూనే ప్రశ్నించింది.

"కామెడీ పాత్రలు, సాత్విక పాత్రలంటేనే నాకు ఇష్టమండీ. అయితే ఇటీవల నాయకపాత్రలు ధరిస్తూవుండటంవల్ల అధికంగా సాత్వికపాత్రలే ధరిస్తున్నాను"

"అయితే మీ హృదయం సున్నితమైనదే. కాఠిన్యత, కరుకుదనం మీ హృదయంలో చోటు చేసుకోడానికి ఆస్కారంలేదు సహజంగా"

శమంత పరిజ్ఞానానికి రామరాజు ఆశ్చర్యపోయాడు. మనస్తత్వ పరిశీలనలో కూడా ఆమెకి అనుభవం వుందేమోననుకున్నాడు.

"మీ పరిశీలనా దృక్పథం నన్నాశ్చర్యపరుస్తోందండీ శమంతగారూ! సైకాలజీ మీ సబ్జక్టా?"

శమంత నవ్వకుండా వుండలేకపోయింది. తన గురించి రామరాజు గొప్పగా వూహించుకుంటున్నారేమోననిపించింది.

"అదేంకాదులెండి. పుస్తకాలు తెగచదువుతాను. ఆ అనుభవమే నాకు ఎన్నో విషయాల్ని నేర్పింది. అంతేగాని నేనేం సైకాలజీ చదవలేదండీ అన్నయ్యగారూ! మీ సుతిమెత్తని మనస్తత్వం మా దీప్తిని సుఖసంతోషాలతో నింపుతుందనడంలో ఆశ్చర్యం వుండదండీ. మా దీప్తి ఎంతో అదృష్టవంతురాలు" అంది సౌమ్యంగా.

రామరాజు గిల్టీగా ఫీలయ్యాడేమోగాని చప్పున మాట్లాడలేకపోయాడు. ఆ మధ్య దీప్తిని కసురుకుని చెంపదెబ్బ కొట్టిన సంఘటన అతనికి గుర్తుకొచ్చి భుజాలు తడుముకున్నాడు. కొంపదీసి దీప్తి ఆ విషయాన్ని స్నేహితురాలితో చెప్పిందేమో? అందుకే శమంత వ్యంగ్యధోరణిలో మర్మగర్భితంగా మాట్లాడుతున్నదేమోనన్న సందేహం ఇతనిలో అంతర్గతంగా మెదిలింది. కాస్తంత కంగారుపడినా తమాయించుకున్నాడు.

"దీప్తిని అర్ధాంగిగా పొందినందుకు నేనూ అదృష్టవంతుణ్ణేనండీ" తన మనసులోని

మాట బైటపెట్టాడు.

దీప్తి వంటగదిలోంచి వచ్చింది.

"మీరింకా మాట్లాడుతూనే వున్నారా? వేళవుతోంది. స్నానానికి లేవండి... నీళ్లుతోడి పెట్టాను" అంది.

రామరాజు గోడగడియారం వంకచూసి గతుక్కుమన్నాడు.

"వేళవుతోంది... వస్తానండీ శమంతగారూ" అంటూ తన గదిలోకి వెళ్లి బట్టలు మార్చుకుని, టవలు తీసుకుని బాత్‌రూమ్‌కేసి చరచరా నడిచాడు.

శమంత, దీప్తి పరస్పరం చూసుకుని చిరునవ్వులు ఒలకబోసుకున్నారు.



మాటిచ్చినట్టే అయిందుబావుకి ఆఫీసు నుంచి వచ్చేశాడు రామరాజు. మామూలుగానే మల్లెపూల పొట్లం భార్యకందించాడు.

దీప్తి పొట్లంవిప్పి రెండుదండలు చూసిందందులో.

"మర్చిపోకుండా మనకిద్దరికీ తెచ్చారే శమంతా" ముసిముసిగా నవ్వుతూ అంటూ ఓ చెండుని శమంతకిచ్చింది.

వాళ్లిద్దరూ వాటిని తల్లో తురుముకున్నారు.

"అనుకున్నట్లుగానే వచ్చేశారు... చాలా థాంక్స్ అన్నయ్యగారూ" అంది శమంత.

"ఓ... దానికేంలెండి— ఇంకా ప్రేమగారు రాలేదా?"

"వస్తే దాన్ని మేం ఎక్కడో దాచేశామనుకున్నారా ఏమిటండీ?" నవ్వుతూ అంది దీప్తి.

శమంత, రామరాజుకూడా ఆమె నవ్వుతో నవ్వులు కలిపేశారు.

సరిగ్గా అదేసమయంలో వీధిలో ఆటో ఆగిన చప్పుడు విన్పించింది.

"బహుశా ప్రేమగారే వచ్చివుంటారు..." అన్నాడు రామరాజు.

దీప్తి వెళ్ళి తలుపుతెరిచి చూసింది.

"నీకోసమే ఎదురుచూస్తున్నాం. రా, ప్రేమా..." అంటూ ఆహ్వానించింది దీప్తి.

ప్రేమ లోపలికొచ్చింది.

శమంతను చూడగానే కౌగలించుకున్నంత పనిచేసింది ప్రేమ.

రామరాజు వాళ్ళకి కాస్తంత దూరంలో వాలుకుర్చీలో కూచున్నాడు. ఆ ముగ్గురు మగువల సమక్షంలో తాను ఒంటరిగా అలా కూచోవడం, అతనికి ఎంతో ఇబ్బందిగావుంది కాని, తప్పలేదు. ఓ పుస్తకం తిరగేస్తూ కూచున్నాడు.

"ఏంటే శమంతా... చడీచప్పుడులేకుండా వచ్చేశావు?" ప్రశ్నించింది ప్రేమ.

"వారంరోజులక్రితం దీప్తి విజయవాడ వచ్చిందే! నేనూ అత్తారింటి నుంచి వచ్చివుండటం కాకతాళీయంగా జరిగింది. ఇదేమో మీవూరు రమ్మని వూరికే మంకుపట్టుపట్టింది. మరేంచెయ్యను? పనిలో పని నిన్నూ ఓసారి చూసిపోదామని, ఇలా వచ్చేశాను" మందహాసంతో అంది శమంత.

"మరి కొయ్యకు లేవే! నన్ను చూసిపోదామని వచ్చినదానివి, ఇక్కడ తిష్ఠవేశావేం?" సరదాగానే అడిగింది ప్రేమ.

"నాకూడా దీప్తి వుందికదే మరి? అందుకే, ఇక్కడికి వచ్చేశాను. ఎక్కడైతేనేం లేవే? మనమంతా ఒకటేగా? ఆ అనుబంధం ఎప్పుడూ వుంటుంది" చాకచక్యంగా తప్పించుకుంది శమంత.

"నువ్వు గొప్ప మాటకారివని తెలుసులేవే" నవ్వేసింది ప్రేమ.

"ఆ టాపిక్‌ని అక్కడితో ఆపండిగాని, ప్రేమా... నువ్వేం తీసుకుంటావు? కాఫీనా లేక హార్లిక్సా?" అడిగింది దీప్తి.

"ఇంటికొచ్చిన అతిథులకు ఏదో ఒకటి పడేయకుండా, ఇందులో అభిప్రాయేమిటి? నాకు ఏదైనా ఫరవాలేదు" అంటూ, కాస్తంత దూరంలో వాలుకుర్చీలో కూచున్న రామరాజు

wn...ఏ నోట విన్నా...Talk of the town...ఏ నోట విన్నా...Talk of the town



కేసి చూసి, ఆశ్చర్యపోయింది ప్రేమ.

"అన్నయ్యగారూ... చాలా ఆశ్చర్యంగా వుందే? సాయంత్రంపూట బుద్ధిమంతుడిలా ఇంట్లోనే వుండిపోయారేంటి?" చిన్నగా మంద హాసంచేస్తూ ప్రశ్నించింది ప్రేమ.

రామరాజు ఇబ్బందిగా చూసి, ఏదో సమాధానం చెప్పాలనుకున్నంతలో శమంత అందుకుంది—

"నేనే వుండమన్నాన్లేవే! లేకపోతే మగాళ్ళ కాళ్ళు సాయంత్రంపూట ఇంటిదగ్గర నిలుస్తాయా?"

"ఎందుకు? మన ముగ్గురు మగువలమధ్య ఆయనెందుకే? అలా తిరిగి రానీయ్... ఆయనుంటే మనం మాట్లాడుకుందుకు స్వేచ్ఛ వుండదు"

"మీ ఆయన్నీ రమ్మని కబురుపంపించానే! ఆయన రాలేదేం?" అంది శమంత.

రామరాజు మౌనంగా పుస్తకంలో మొహందాచుకుని, వాళ్ళ సంభాషణ వింటున్నాడు.

"మావారికి అర్జంటు పనేదోవుందట. అందుకే రాలేనని చెప్పారు. మరేమీ అనుకోవద్దని కూడా చెప్పారు" అంది ప్రేమ.

"పోనీలే! నువ్వొచ్చావుకదా చాలు." అంది శమంత.

దీప్తి కాఫీ తెచ్చి ముగ్గురుకీ ఇచ్చింది. తనూ ఓ కప్పుతీసుకుంది.

"దీప్తీ... నువ్వూ కూచోవే!" అంది శమంత.

దీప్తి శమంత పక్కనే కూచుంది.

ముగ్గురూ కాఫీ తీసుకుని, ఖాళీకప్పుల్ని టీపాయ్‌మీద పెట్టేశారు. రామరాజు కాఫీ తీసుకున్నాక, దీప్తి వెళ్ళి ఆ ఖాళీకప్పుని తీసుకుని టీపాయ్‌మీద పెట్టింది.

"ఇప్పుడు చెప్పవే శమంతా... ఏమిటి విశేషాలు?" ప్రేమ ప్రశ్న.

"స్వవిషయాలు తర్వాత మాట్లాడుకుందాం ప్రేమా! ఇప్పుడో సమస్యా పరిష్కారం కావాలి"

రామరాజు చదువుతోన్న పుస్తకాన్నిపక్కన పెట్టేసి, ఆసక్తిగా సంభాషణ వింటున్నాడు.

"సమస్యా? ఏమిటే అది?" విస్తుబోతూ అడిగింది ప్రేమ.

"స్త్రీ అభ్యుదయం గురించి, స్త్రీ స్వాతంత్ర్యం గురించి మాట్లాడిన వ్యక్తులే స్త్రీలను కించపరుస్తున్నారు. వారి మానాభిమానాలను దోచుకోవాలని ప్రయత్నిస్తున్నారు. ఇది, ఈనాటి పరిస్థితి అని ఒప్పుకుంటావా?" సూటిగా ప్రేమ మొహంలోకి చూస్తూ ప్రశ్నించింది శమంత.

హఠాత్తుగా ఈ ప్రశ్న ఎందుకువేసిందో ప్రేమకి అర్థంకాలేదు.

ఆ ప్రసక్తి తీసుకురావడంలో, శమంత అభిప్రాయం ఏమైవుంటుందో, రామరాజు వూహకీ అందలేదు.

"అందర్నీ ఆకోవకి చేర్చడం సబబుగా వుండదేమోనే శమంతా! మంచివాళ్ళూ వున్నారు!" నెమ్మదిగా అంది ప్రేమ.

"ఉన్నారు.నేనూ కాదనను. కాని... మంచివాళ్ళలా కనిపించే కొందరు పయోముఖ విష కుంభాల్లా వుంటూ, తమ నిజస్వరూపాన్ని అంత సులువుగా బైటపడనివ్వరు..."

"ఔను! అటువంటి వ్యక్తులూ వున్నారు. అది కొత్తేంకాదుకదా?" "అందులో కొందరు ఎటువంటివాళ్ళున్నారంటే, ఏ స్త్రీ అయితే వాళ్ళ ఆటల్ని సాగనివ్వదో ఆమెని పరోక్షంగా మానసిక వ్యధకు గురిచేసి, తమ కక్షతీర్చుకుంటారు. లేదా... ఆమెని చిత్రహింసకు పాల్జేసి యమలోకానికి పంపించేస్తారు ఔనా?"

"ఇందులో కొత్తేముందే? అక్కడక్కడా ఇటువంటి సంఘటనలు జరుగుతున్నవేగా! ఇంతకీ అసలు సమస్య ఏమిటో చెప్పావుకాదే?" అసహనంతో అడిగింది ప్రేమ.

నిజానికి శమంత చెబుతోన్న మాటల్లో, తలాతోకా అందడంలేదు ప్రేమకి. అందుకే ఆమెలో సహనం పట్టుతప్పింది.

"కాస్త ఓపిక పట్టమ్మా మరి! నేనిప్పుడు చెప్పబోయే సమస్య ఒక రంగస్థల నాటకమనుకుంటే, ఇక్కడున్న మన నలుగురం ప్రత్యక్షంగానో, పరోక్షంగానో అందులోని కొన్ని పాత్రధారులం! కొన్ని పాత్రలు ఇక్కడ లేవు" చిన్నగా నవ్వుతూ అంది శమంత.

శమంత ఏం చెప్పబోతూ వుందో రామరాజుకీ అంతుబట్టలేదు. అందుకే అతనిలో ఆశ్చర్యం, అసహనం చోటుచేసుకున్నాయి. కాని

బైటపెట్టలేదు.

ప్రేమకి మరీ విసుగుపుట్టింది.

"ఔనూ... ఈమధ్య నువ్వుగాని నవలలు రాయడం ప్రారంభించావా ఏవిటి! వుపోద్ఘాతాలు సస్పెన్సులో చెబుతున్నావు?" చిలిపిగా అంది ప్రేమ.

శమంత చిన్నగా నవ్వింది.

"పూర్తిగా వినకుండా మధ్యలో ఇట్లా ప్రశ్నలువేస్తే ఎట్లాగే? విషయం వివరంగా చెప్పడానికి, నవలనే రాయనవసరంలేదు. కాస్త ఓపిక పట్టి వినుమరి!"

"సరే... చెప్పు" గడ్డంమీద చెయ్యి ఆనించి, బుద్ధిగా కూచుంది ప్రేమ.

"విషయాన్ని తెలుసుకున్నాక మనలో ఎవ్వరమూ ఆవేశం తెచ్చుకోకూడదు; బాధపడకూడదు; అవమానింపబడ్డామన్న భావనని రానీయకూడదు... ఓ కథలా వినండి. దృశ్యాల్ని సినిమా చూస్తున్నట్టుగా అనుభూతిని పొందండి— అర్థమయిందా?"

"అర్థమయింది లేవే... ఇంక ప్రారంభించు. సస్పెన్సులోపెట్టి చంపేస్తున్నావు. ఊఁ... కానీయ్..." విసుగ్గా అంది ప్రేమ.

"అన్నయ్యగారూ, మీరూ వింటున్నారు కదా?" రామరాజుకేసిచూస్తూ అంది శమంత— వెన్నుతడుతున్నట్టుగా.

శమంత అభిమతం ఏవిటో, ఆమె ఏం చెప్పనున్నదో అంతా అనూహ్యంగావుంది రామరాజుకి.

"వింటున్నానండీ!" అన్నాడు

"ఇప్పుడు నేను చెప్పబోతున్న విషయం నూరుపైసల నిజం. ఇందులో రవ్వంత అబద్ధంగాని, అభూతకల్పనగాని లేదు. చెప్పాల్సిన అగత్యం వచ్చిందిగాబట్టి చెబుతున్నాను" అంటూ శమంత ప్రారంభించేసరికి, తలనొప్పి వస్తున్నట్టుగా తలపట్టుకుంది ప్రేమ.

దీప్తి నవ్వేసింది. శమంతకీ నవ్వొచ్చింది. "తలపట్టుకోకే ప్రేమా! ఇదిగో' అసలు కథలోకి వురుకుతున్నాను" చిరునవ్వుతో అంది శమంత.

"అబ్బబ్బ... ఏవిటే శమంతా- ఇదిగో చెబుతున్నానంటూనే వుపోద్ఘాతం వదల్లేదు. చెప్పేదేదో, చప్పున చెప్పకూడదూ?" విసుగ్గా అంది ప్రేమ.

శమంత ఇంక జాప్యంచెయ్యలేదు. "కొన్ని నెలలక్రితం మా ఇంట్లోనే ఓ చిన్న సంఘటన జరిగింది. అదీ నా వివాహం జరుగుతున్న రోజునే! దీప్తికి ఇంకా పెళ్ళికాలేదు. బంధువులొక్కొక్కరూ వస్తున్నారు. మా అమ్మ ఇంటిపనుల్లో నిమగ్నమయింది. దీప్తి నా దగ్గరే కూచుంది. ఇద్దరమూ కబుర్లు చెప్పుకుంటున్నాం. నువ్వు మా ఇంటికిరాకముందే మీ ఆయన వచ్చాడు- కాస్సేపట్లో నువ్వూ వస్తున్నావని చెప్పడానికి. అప్పుడే దీప్తిని చూడ్డం తటస్థించింది ఆయన. అదే అతను మొట్టమొదటిసారి దీప్తిని చూడ్డం. ఆమె ఎవరో అతనికి తెలీదుకదా- అందుకే ఆమె ఎవరని నన్నడిగాడు. వాళ్ళిద్దరికీ పరిచయం చేశాను. దీప్తికి అతనితో పరిచయంచెయ్యడం ఇష్టంలేకపోయినా, తప్పనిసరి అయిందిమరి..." అంటూ క్షణంపాటు ఆగింది శమంత.

రామరాజు చెవులు రిక్కించుకుని మరీ వింటున్నాడు.

"తర్వాత...?" ఆసక్తిగా అడిగింది ప్రేమ.

"తర్వాత నువ్వు వచ్చావు. మనం కాస్సేపు మాట్లాడుకున్నతర్వాత అమ్మ పిలవగా నువ్వు లోపలికి వెళ్ళిపోయావు. ఏవో పనుల్లోపడ్డావు. అప్పుడే చీకటిపడుతోంది. డాబామీదున్న నా చీర తియ్యడానికి దీప్తి డాబామీదికి వెళ్ళింది. అదేఅదనుగా తీసుకున్న భైరవమూర్తిగారు సరాసరి డాబామీదికి వెళ్ళినట్టున్నారు. దీప్తిని ఏమన్నాడోమరి-చెళ్ళున లెంపకాయ తిన్నాడు. సరిగ్గా అదేసమయంలో డాబామీదికి వెళ్తోన్న నేను ఈ దృశ్యాన్ని కళ్ళారా చూసి, విస్తుపోయాను. భైరవమూర్తిగారు, ఏదో తప్పుచేశారని వూహించుకుందుకు, నాకు అట్టే సమయం పట్టలేదు. ఆ తరుణంలో దీప్తి కనబర్చిన ధైర్యాన్ని చొరవని మెచ్చుకున్నాను. ఆ సంఘటనకి నేను ప్రత్యక్షసాక్షిగా నిలబడ్డంతో మీ ఆయనలో అవమానంతోపాటు ఆక్రోశం ఇనుమడించింది. అభిమానం దెబ్బతిన్నది. అతను కళ్ళనించి నిప్పులు కక్కుతూ, దీప్తిపై కక్షతీర్చుకుంటానని నా సమక్షంలోనే ప్రతిజ్ఞచేశాడు. అంతే! అక్కణ్ణించి కిందికి వచ్చేసి, ఏదో

అర్జంటుపనుందని నీతో అబద్ధంచెప్పి, మీవూరు వచ్చేశాడు. నీకూ గుర్తుండేవుంటుందీవిషయం. కాని నిజం నాకూ, దీప్తికే తెలుసు. అనవసర రసాభాస ఎందుకని, మేమిద్దరం మౌనం దాల్చాం. నిజంగా చాలా డ్రెమెటిక్‌గా వుందికదూ సంఘటన!'' అంటూ ఆగింది శమంత.

ప్రేమ మొహం పాలిపోయింది. భర్త నైజం ఆమెకి బాగా తెలుసు. అతని బలహీనతలు ఏమిటో ఆమెకితెలుసు. అందుకే శమంత చెప్పిందాన్ని ఖండించలేకపోయింది. ఎంతో గౌరవప్రదంగా బతుకుతున్న తాను, భర్తమూలంగా ఈనాడు ఇలా అవమానానికి గురిఅయినందుకు, లోగడ ఎంతగానో కుమిలిపోయింది. తనభర్త దీప్తిచేత చెంపదెబ్బతిన్నాడా! శమంత చెబుతూవుంటే, ఆమె ప్రతిమాటా ఓ సమ్మెటపెట్టులా, ఆమె గుండెలపై బాధించాయి. భర్తపై అంతులేని వుక్రోషం పెల్లుబికింది. కాని, ఏంచెయ్యగలదు! ఆయన కోపిష్టి! విచక్షణాజ్ఞానరహితుడు, మొండివాడు! అందుకే పెదవి విప్పకుండా, మౌనంగా కోపాన్ని దిగమింగుకుంది. ఫాలభాగంపైనున్న స్వేదబిందువుల్ని చీరచెంగుతో ఒత్తుకుని మొహం దించుకుంది.

రామరాజు చెవులు రిక్కించి మరీ వింటున్నాడు. నిజానికి ఈ సంబంధం ఏర్పాటు చేసింది భైరవమూర్తి దంపతులేనని రామరాజుకి తెలుసు. అంటే ఇటువంటి కక్ష ఏదో మనసులో పదిలపర్చుకుని, దీప్తిని తనకి అర్థాంగిగా ఏర్పాటుచేశాడేమో భైరవమూర్తి?...చిన్న అనుమానం రామరాజులో మెరుపులా మెరిసింది. ప్రేమకి ఏవీ తెలీకపోవచ్చు...అనుకున్నాడు. తమ వివాహం జరిగినప్పట్నుంచీ, దీప్తి భైరవమూర్తిని ఎందుకు అసహ్యించుకుంటోందో, ఏహ్యభావంతో చూస్తోందో అతనికిప్పుడు అవగతమయింది. భైరవమూర్తి ఇంత దుర్మార్గుడని, కపటవ్యక్తిఅని ఈరోజు వరకూ అతనికి తెలీనేతెలీదు.

రామరాజు మస్తిష్కం పనిచేస్తూనేవుంది.

శమంత ప్రేమకేసి చూసింది. ఆమె పరిస్థితి అర్థంచేసుకుంది.

"అలా మౌనం వహించావేమిటే ప్రేమా? నేనుచెప్పినదాంట్లో కొంతయినా నీకు గుర్తుండే వుంటుంది...''

"ఔను శమంతా! కొంత గుర్తుంది. మా ఆయన హఠాత్తుగా నాదగ్గరికివచ్చి అర్జంటుగా పనుందంటూ విశాఖపట్నం ప్రయాణమయ్యారు. అది నిజమనే నమ్మేను గాని, మొహం చెల్లక వెళ్ళిపోయారని, ఇంత నాటకం జరిగిందనీ, నేను ఎలా వూహిస్తాను చెప్పు? తర్వాత ఏమయింది?'' ఆసక్తిగా ప్రశ్నించింది ప్రేమ.

"ఆ సంఘటన జరిగినకొన్నాళ్ళకి దీప్తికి వివాహం రామరాజు గారితో జరిగింది. ఈ వివాహం జరగడంలో, చాలావరకు నీ సహకారంవుంది. రామరాజుగారు మీ ఆయనకి సన్నిహిత స్నేహితుడుకావడం కాకతాళీయమే అయ్యుండొచ్చు... కాని, అది దీప్తికి శాపమయింది''

"శాపమయిందా? అదెలా?'' ఆశ్చర్యంగా అడిగింది ప్రేమ.

"ఔనే ప్రేమా! భైరవమూర్తిగారు ఆనాడు దీప్తిచేత అవమానింపబడినరోజు చేసిన ప్రతిజ్ఞ మర్చిపోలేదు. ఆమెపై కక్షతీర్చుకోవాలన్న కాంక్ష అతని గుండెల్లో రగులుతూనేవుంది. అయితే దీప్తి మనస్తత్వాన్ని ఓసారి చవిచూసి వున్నవాడుగనక, కనీసం ఆమె నీడనుసహితం తాకడానికి సాహసించలేకపోయారనుకుంటాను. అందుకే దీప్తిని మానసికంగా క్షోభపెట్టాలని నిర్ణయించుకున్నట్టుంది. ఆమె కన్నీరుపెట్టుకుంటే, కుమిలిపోతూవుంటే చూసి సంతోషించాలన్నదే అతని ధ్యేయమైనట్లుంది. ప్లానుప్రకారం ఆమె సంసారజీవితంలో విషబిందువులు ఒలికించారాయన పరోక్షంగా''ఆగి బరువుగా ఓ నిట్టూర్పు విడిచింది శమంత.

ప్రేమకి అంతా అయోమయంగా వుంది. "ఏమిటే నువ్వంటున్నది? మా ఆయన దీప్తి సంసార జీవితంలో విషబిందువుల్ని చిలికారా?'' ప్రేమ, కాస్తంత కోపంతోనే ప్రశ్నించింది. భర్తని మరీ అంతనీచంగా స్పృషించడాన్ని సహించలేకపోయిందామె.

రామరాజు ఓ ప్రేక్షకుడిలా అంతా గమనిస్తున్నాడు.

"ఆవేశపడకు ప్రేమా! అసలు విషయానికి

వస్తున్నాను కదా? ఒకరికి ఉపకారం చెయ్యా
లంటే యెంతో కష్టంగాని అపకారం చెయ్యద
ల్చుకుంటే సవాలక్ష మార్గాలు కనిపిస్తాయి. మీ
ఆయనకి, అందుబాటులో వున్న మార్గాన్ని
పట్టుకున్నాడాయన. ఏ దురలవాటూలేని
రామరాజుగారిని నాటకరంగం ఆలంబనగా
చేసుకుని, రానున్న ఉజ్వల భవిష్యత్తుని ఎరగా
చూపి, పార్టీలకంటూ తీసుకుపోయి క్రమంగా
మధువును అలవాటుచేశాడు. ఆ వ్యసనానికి
ఒకసారి బానిస అయినవ్యక్తి, ఆ బానిసత్వపు
సంకెళ్ళనించి విముక్తికావడం సాధారణంగా
అసాధ్యం. రామరాజుగారు అందుకు అతీతు
లు కాలేకపోయారు. దాంతో దీప్తి సంసారజీవి
తంలో సుఖశాంతులు మృగ్యమైనాయి. చెప్ప
కూడదుగాని, ఒక సందర్భంలో రామరాజుగా
రు దీప్తిపై చేయిచేసుకున్నారుకూడాను! భైరవ
మూర్తిగారు వూహించినట్టే, దీప్తి మానసికక్షో
భకు గురయింది. మౌనంగా ఏడ్చింది. తన
దురదృష్టాన్ని తిట్టుకుంది. వైవాహికజీవితంలో
అడుగుపెట్టిన ప్రారంభదశలోనే ఈ మనస్తాపా
న్ని, అశాంతిని భరించలేకపోయింది దీప్తి.
తన సంసారంలో రేకెత్తిన ఈతుఫానుకు భైరవ
మూర్తిగారే కారకులని ఆమెకి తెలుసు. కాని ఆ
నిజాన్ని భర్తకు ఎలాచెబుతుంది? చెప్పినా
అందుక్కారణం సహేతుకంగా వుండాలికదా?
రామరాజుగారు నమ్మకపోతే...?ఏం చెయ్యాలో
తోచలేదు దీప్తికి...'' క్షణం ఆగి, వూపిరి పీల్చు
కుంది, శమంత.

ఆ గదిలో నిశ్శబ్దం ఆవరించుకుంది. మళ్ళీ
ప్రారంభించింది.

''ఈ పరిస్థితిలో విద్యావిహీనురాలైతే ఏంచే
సేదో చెప్పలేంగానీ! దీప్తి విద్యావంతురాలుగా
బట్టి, మరీ బేలగా విలపిస్తూ కూచోకుండా
ఏదోమిషతో విజయవాడ వచ్చేసింది. అదృష్ట
వశాత్తూ అప్పటికి నేనూ వచ్చివుండటం, ఆమె
పాలిట వరమై, సాంత్వనం కలిగింది. దీప్తి
తన మనసులో రగులుతున్న ఆవేదనని తలి
దండ్రులతో చెప్పలేక, నాతో చెప్పింది. ఒక స్త్రీ
జీవితం ఇటువంటి సంఘటనలతో నలిగిపో
వడం, వ్యధాభరితమవ్వడం ఏస్త్రీకూడా
సహించలేదు... సహించకూడదుకూడాను. ఒక
స్త్రీగా నాహృదయం ద్రవించిపోయింది. దీప్తికి
చేయూతనిచ్చి, ఆమె సంసారాన్ని చక్కదిద్దాల
న్న ఆకాంక్ష నన్ను వెన్నుతట్టింది. దీప్తి స్వ
యంగా చెప్పుకోలేని ఈ వ్యధాభరిత కథను
నీతోనూ, రామరాజుగారితోనూ ఆయన సమ
క్షంలో వెల్లడించాలనే, నేనిక్కడికి వచ్చాను.
దురదృష్టవశాత్తూ మీ ఆయన రాలేదు. ఇటు
వంటి సమావేశం ఏదో జరుగుతుందని
శంకించే మీ ఆయన రాలేదని నా అభి
ప్రాయం. ఇదీసమస్య! ఈ సమస్యను ఎలా
పరిష్కరిస్తారో మీరే యోచించండి. ఆడుతూ
పాడుతూ సెలయేరులా గలగలాసాగాల్సిన కొ
త్తకాపురం, ఆదిలోనే అపశ్రుతులు పాడకూడ
దని నా తాపత్రయం. అందుకే నా ఈ ప్రయ
త్నం...'' అంటూ సుదీర్ఘమైన ఆ కథను ఆపే
సింది శమంత.

అంతా విపులంగా విన్న రామరాజు ము
హంలో రంగులు మారినయ్. తాను వింటు
న్నది కలకాదుకదా అనిపించింది. ప్రాణస్నే
హితుడిగా తాను అభిమానిస్తూ, గౌరవిస్తోన్న
భైరవమూర్తి నిజస్వరూపం ఇదా? -- అన్న ప్రశ్న
ఆక్షణంలో అతని మస్తిష్కంలో మెదిలింది. ఆ
భైరవమూర్తి ఇంతగా నమ్మకద్రోహం చేస్తాడా,
అయితే స్నేహానికి అర్థమేముంటుంది?...
అనుకున్నాడు.

ప్రేమ మొహం వివర్ణమయింది. అవమా
నపు పల్చటిపొర, ఆమె మొహంలో తారా
డింది. అంతరంగంలో ఆమె అనుభవిస్తోన్న
ఆవేదన అనూహ్యం. తన సమక్షంలోనే భర్తను
దోషిగా నిందిస్తూ వున్నా ఆయన ప్రవర్తన,
నైజం తెలిసిన తాను అవాక్కయి వూరుకోవా
ల్సివచ్చినందుకు ఎంతో కుమిలిపోయింది.
చీర చెంగుతో, ఓసారి మొహాన్ని ఒత్తుకుంది.
ఎన్నడూ వూహించని క్లిష్టపరిస్థితిని ప్రస్తుతం
ఎదుర్కొంటోందామె. తనకంటె వయసులో
చిన్నదయిన దీప్తి ముందు తనో చిన్న బొమ్మలా
వూహించుకుంది. భర్త, ఆయన వెధవ ప్రవర్త
నతో తననలా దిగజార్చినందుకు ఒక పక్క
కోపం, మరోపక్క బాధ మిళితమై ఆమెను
వివశను చేస్తున్నాయి. దీప్తికేసి కళ్ళెత్తి చూడ
లేకపోయింది. తప్పుచేసింది భర్తయితే, పరో
క్షంగా శిక్ష అనుభవిస్తోంది భార్య!

''దీప్తీ... మా ఆయన ప్రవర్తనకి నేను సిగ్గు
పడుతున్నాను. ఆయనలాంటి చపలచిత్తుడి
కి, కామాంధుడికి భార్యనైనందుకు మనసులో

ఎంతగా కుమిలిపోతున్నానో, మీకెవ్వరికీ అర్థంకాదు. అది కేవలం నా దురదృష్టం! ఆయన్ని క్షమించమని ఆయన తరపున నేను అర్థిస్తున్నాను. అంతకంటే నేనేం చెయ్యగలను చెప్పు? అయితే మా ఆయనే మీవారిని మధువు వ్యసనానికి బానిసచేసి, ఆవిధంగా నీపై కక్షతీర్చుకుంటున్నారనడానికి నిదర్శనమేమిటి?'' అంటూ రామరాజుకేసి తిరిగింది ప్రేమ.

''అన్నయ్యగారూ... మీరలా మౌనందాల్చారేం? మావారి పైవచ్చిన అభియోగం విన్నారు కదా? ఎంతవరకూ అది నిజం? మావారు వ్యసనపరులని నాకు తెలుసు. నాకేకాదు – చాలామందికి తెలుసు. కాని మిమ్మల్ని బుద్ధిపూర్వకంగా దీప్తిపై కక్షసాధించాలని ఈ రొంపిలోకి దింపారంటారా? మీ సంసారంలో చిచ్చు రేపాలని ప్రయత్నించారంటారా?'' సూటిగా ప్రశ్నించింది. ఈ అభియోగం నుంచయినా భర్తని దూరం చెయ్యాలని భార్యగా ఆమె తాపత్రయపడుతోంది.

రామరాజు ఆలోచనల్లో పడ్డాడు. సంఘటనలన్నీ ఒక్కొక్కటీ అతని కళ్ళముందు మెదిలినయ్. దీప్తిని వివాహంచేసుకోమని సలహాయిచ్చి నచ్చజెప్పింది భైరవమూర్తే. ఆపైన ప్రేమ పట్టుదల! అతడు, దీప్తిపై కక్ష సాధించాలనే తమ వివాహం ఏర్పాటుచేసి ఆపైన తనని క్రమంగా వ్యసనపరుడిగా మార్చాలని ప్రయత్నించాడని, ఇప్పుడనిపిస్తోంది రామరాజుకి.

రామరాజు ఇప్పుడీ అభిప్రాయానికి రావడానికి కారణం లేకపోలేదు. గత నాలుగైదేళ్ళనించీ సన్నిహిత స్నేహితులుగా వుంటూ వచ్చినా, ఏనాడూ తనని అతనితోవకి తిప్పుకోడానికి ప్రయత్నించలేదు భైరవమూర్తి. ఎన్నడూ లేనిది తనకి వివాహమయ్యాకనే ఏదో సాకుతో పార్టీలకంటూ తీసుకుపోయి క్రమంగా బీరు, బ్రాందీ, విస్కీలు స్వంతడబ్బుపెట్టి ఇప్పించడం మొదలుపెట్టాడు. భైరవమూర్తిలో వచ్చిన ఈ పరిణామం వెనక ఇంతకథ వుందని అతని ఆలోచనల్లో ఇంత కపటం, కక్ష దాగివున్నాయని తనకి మాత్రం ఏంతెలుసు. అప్పట్లో తనకి అటువంటి సందేహమే కలగలేదు. అన్నీ ఒక్కసారి తల్చుకుని బేరీజువేసుకుంటే భైరవమూర్తి బుద్ధిపూర్వకంగానే తనని మద్యానికి బానిసచెయ్యాలని, తద్వారా దీప్తిపై కక్ష సాధించాలని ప్రయత్నించినట్టు భావించాడు రామరాజు.

ఇవన్నీ ఆలోచిస్తూ వుంటే రామరాజు వొళ్ళు గగుర్పొడిచింది. హృదయంలోంచి వుక్రోషం పెల్లుబికింది. అప్రయత్నంగా అతని కళ్ళల్లో ఎర్రని జీరలేర్పడ్డాయి. ప్రాణస్నేహితుడిగా వుంటూ భైరవమూర్తి ఎంత ద్రోహానికి తలపెట్టాడు?.... ఆలోచనలనించి ఇంకా తేరుకోనేలేదు రామరాజు. అంతలోనే శమంత కలిగించుకుంది – ''ఆయనేం చెబుతారే ప్రేమా? ఖచ్చితమైన నిదర్శనం వుంది గనకనే ఇంత నిష్కర్షగా, నిర్మొహమాటంగా బైటపెట్టగలిగాన్నేను. ఈ అనుమానం మొదట్లో దీప్తికీ రాలేదు. కాని....'' అంటూ ఆగింది శమంత.

''కాని.... ఏమిటోచెప్పు...'' ఆసక్తిగా అడిగింది ప్రేమ.

''రెండురోజుల క్రితం మీఆయన విజయవాడ వెళ్ళారా?'' ప్రేమ మొహంలోకి సూటిగా చూస్తూ ప్రశ్నించింది శమంత.

''ఔను.... వెళ్ళారు. ఏదో ఆఫీసు పనిమీద వెళ్లారు''

''ఆఫీసు పనిమీదా?'' విస్తుపోయాడు రామరాజు.

''ఔను – అన్నయ్యగారూ! అలాగనే చెప్పారు''

''అది అబద్ధం. ఆఫీసు పనేలేదు''

ప్రేమలో అసహనం ఇనుమడించింది. ''ఏదో ఒవాటి..... విజయవాడ వెళ్ళారు – అయితే?''

''ఆయన విజయవాడ వెళ్ళడం ఆఫీసు పనిమీదకాదు. కేవలం దీప్తిని కలుసుకునేందుకే. మా ఇంటికొచ్చి దీప్తి గురించిన వివరాలు అడిగారు. ఎప్పుడొస్తుందని ప్రశ్నించారు. మర్నాడు సాయంత్రం వస్తుందని చెప్పాను. మళ్ళీ ఆయన ఏం అనుకున్నారో యేమో మర్నాడు ఉదయం దీప్తి ఇంటికిగా మొను బయల్దేరారోయేమో – దీప్తి ఓ బట్టలకొట్లో నుంచి బైటికొస్తుంటే చూసి, చప్పున వచ్చి పలకరించారట భైరవమూర్తిగారు. చకితయ్యైన దీప్తి ఏమంటుంది పాపం. మాట్లాడక తప్పలే

దామెకి. అంతటితో వూరుకోలేదాయన. ఆమె పై తాను ఎలా పరోక్షంగా కక్షతీర్చుకుంటున్నదీ విపులంగా చెప్పి, ఎగతాళి చేశాట్ట. తన ప్రతిజ్ఞ ఎలా నెరవేర్చుకుంటున్నాడో గుర్తుచేశాట్ట'' చెప్పింది శమంత.

ప్రేమ నిరుత్సాహపడిపోయింది. ''ఔనా దీప్తి?'' దీప్తికేసి పరికిస్తూ ప్రశ్నించింది ప్రేమ.

రామరాజు ఆసక్తిగా చెవులు రిక్కించి వింటున్నాడు. తనకి తెలీని విషయాలు చాలా వున్నాయనిపించిందతనికి.

దీప్తి ఆవేదనాపూరితంగా ఓ నిశ్వాసం వదిలింది. ఆమె కళ్ళు చెమర్చినయ్.

''ఔను ప్రేమా.... మనిద్దరం బాగా స్నేహితులమయ్యాంగానీ మీ ఆయనతో నేనెప్పుడూ ఏకాంతంగా మాట్లాడి ఎరుగను. అసలు ఆయనతో మాట్లాడ్డమంటేనే నాకు వొళ్ళుమండేది. ఆరోజు నేను బట్టలషాపులోంచి బైటికి వచ్చానో లేదో ఆయన చప్పున వచ్చి నన్ను పలకరించారు. నేనూ ముభావంగా సమాధానం చెప్పి వెళ్ళిపోబోయాను. కాని ఆయన కలిగించుకుని మళ్ళీ చెప్పడం ప్రారంభించారు. ఆనాడు నాచేత అవమానింపబడ్డాక ఆయన చేసిన ప్రతిజ్ఞ గుర్తుచేశారు. నా సంసారజీవితంలో సుఖశాంతులు లోపించి నేను మానసికంగా కృంగిపోయి, కుమిలిపోతూవుంటే ఆయన చూసి ఆనందిస్తారట. అప్పుడే అతనిలో రగులుతోన్న పగ చల్లారుతుందట.... అప్పుడే అతని హృదయం పూరడిల్లుతుందట. పరోక్షంగా నన్ను దెబ్బతియ్యడానికే మావారిని వ్యసనానికి బానిసచేశారట.... అతను విజయవాడ రావడం కూడా నా కన్నీరు చూడ్డానికేనట.... ఎంత సబబుగా వుందో ఆలోచించు ప్రేమా! ఎంతో ఆనందంగా, అనురాగమయంగా సాగాల్సిన మా సంసారజీవితం భైరవమూర్తిగారు ఆశించినట్టుగానే ఒడిదుడుకులకు లోనయింది. మావారికి ఎన్నోసార్లు చెప్పాను – భైరవమూర్తిగారితో స్నేహాన్ని తగ్గించుకోమని. కాని ఆయనకి నాపై కోపం వచ్చేది. ఓ సందర్భంలో మావారి చేతి దెబ్బకూడా చవిచూశాను ...'' కళ్ళొత్తుకుంటూ మళ్ళీ ప్రారంభించింది దీప్తి.

''నేను ఏంచెప్పినా ఆ స్నేహితుడిపట్లగల ప్రగాఢ అభిమానంవల్ల మావారు నన్ను తప్పుగా అర్థంచేసుకుంటున్నారని అనిపించింది. నిజాన్ని గ్రహించడానికే ప్రయత్నించడం లేదు''

మరోసారి కళ్ళొత్తుకుంది దీప్తి.

ప్రేమ షాక్ తిన్నది. అవమానభారంతో, అవనితముఖి అయింది. క్షణంసేపు ఆమె నోట మాటరాలేదు. భైరవమూర్తి భార్యగా, అక్కడున్న ముగ్గురి ముందు, నేరం చెయ్యని దోషిలా నిల్చోవడం, తలకొట్టేసినంత పనయిందామెకి. తననిచూసి ఆ ముగ్గురూ ఏహ్యాభావంతో కేరింతలు కొడుతూ నవ్వుతూ ఉన్నట్టే భ్రాంతికి లోనయిందాక్షణంలో. అప్రయత్నంగా, ఆమె నయనాలనుంచి అశ్రువులు ధారాపాతంగా చెక్కిళ్ళపైకి జాలువారుతున్నయ్. చీరచెంగుతో కళ్ళొత్తుకుంది. ఎంత ఆపుకోవాలనుకున్నా దుఃఖాన్ని ఆపుకోలేకపోతోంది.

ప్రేమని చూసి జాలిపడింది, శమంత– ఆమెకీ బాధనిపించింది. ప్రేమని ఆప్యాయంగా నిమిరింది. ''క్షమించవే ప్రేమా! దీప్తి సంసారాన్ని చక్కదిద్దడానికి, ఇంతకంటె వేరే గత్యంతరం లేకపోయింది. నీ హృదయం గాయపడింది. నిజమే! కాని, ఇందులో నీ తప్పేమీ లేదుకదా! నువ్వేం బాధపడకు. మగవాళ్ళ అహంకారానికి మగువలే ఎప్పుడూ గురవుతూ ఉంటారు. భర్తచేసిన వెధవపనుల పర్యవసానం అప్పుడప్పుడూ భార్య భరించాల్సిందేమరి! భార్య అన్నపదానికి అదేకదా నిర్వచనం!'' అంది శమంత ఓదార్పు ధోరణిలో.

రామరాజుకి శమంత మాటలు చుర్రుమనిపించాయి. అతని హృదయాన్ని ఎవరో కెలికినట్టయింది. పరోక్షంగా ఆమె విసుర్లు తనకీ ఆపాదిస్తున్నట్టనిపించింది. మొహం దించుకున్నాడు.

శమంత ఈసారి రామరాజుకేసి తిరిగింది.

''ఏమండీ అన్నయ్యగారూ... తప్పుచేసినవారిలా అలా మొహం దించుకున్నారేంటి! ఇప్పటికయినా మా దీప్తిని అర్థంచేసుకున్నారనుకుంటాను. కేవలం మగాళ్ళమనే ధీమాతో మీ

అభిప్రాయాలు, మీ నమ్మకాలతో మొండిపట్టు పట్టుక్కూర్చుంటే లాభం లేదండీ. ఇదిగో ఇటు వంటి అవకతవకలే వస్తూ ఉంటాయి. మీలో నూ మంచీచెడూ గ్రహించగలిగే వివక్షత ఉండాలి. ఎవరు మిత్రులో, ఎవరు శత్రువులో తెలుసుకోగలిగే విజ్ఞత ఉండాలి. మగాడికి అందరికంటె సన్నిహిత వ్యక్తి, శ్రేయోభిలాషి భార్యేనండీ! ఈ నిజాన్ని చాలా మంది గ్ర హించరు. భార్య అభిప్రాయాల్ని సహృద యంతో అవగాహన చేసుకోవాలండీ! వాటికి విలువివ్వాలి. అప్పుడే, సంసారం స్వర్గతుల్య మౌతుంది. మీకు నీతులు చెప్పేపాటిదాన్ని కానండీ! అలా నన్ను అపార్థంచేసుకోకండి. ఇది కేవలం నా అభ్యర్థనగానే గుర్తించండి. దీప్తి పరిస్థితి దృష్ట్యా ఇవన్నీ చెప్పాల్సి వచ్చింది. మీకు ఏపాటి కష్టం కలిగించినా క్షమించమని కోరుకుంటున్నాను'' మెల్లగా మందహాసం చేస్తూనే అంది శమంత.

రామరాజు సాంతం అవగాహన చేసుకున్నా డు. ఇందులో పూర్తి బాధ్యత తనదేనని పించింది. భారంగా ఓ నిట్టూర్పు విడిచాడు.

''క్షమించమని కోరి నన్ను కించపర్చకండి శమంతగారూ! తప్పునాదే! నా వ్యక్తిత్వాన్ని వదులుకోవడం వల్లనే, ఇన్ని అనర్థాలూ సంభ వించాయి. మీరన్నట్టు నా మంచి చెడ్డల్ని గ్రహించుకోవల్సిన బాధ్యత నాదేకదా! ఆ బాధ్యతని నేను విస్మరించానేమోననిపిస్తోంది. అనిపించడమేవిఁటి... నిజంగానే విస్మరించా ను. ఫలితంగా సుఖశాంతులతో సాఫీగా సాగా ల్సిన నా సంసారజీవితంలో, చేజేతులా అప శ్రుతుల్ని సృష్టించుకున్నాను. అర్థాంగి దీప్తి మనోవ్యధకు, వ్యాకులతకు, కారకుడనయ్యా ను. అందుకు నేనెంతో చింతిస్తున్నానండీ! చొరవతో, సత్వరమే ఈ మా సమస్యను పరి ష్కారం చేసిన మిమ్మల్ని ఎలా అభి నందించాలో అర్థంకావడంలేదండీ! ఇకపైన ఇటువంటి పొరపాటు జరక్కుండా జాగ్రత్తపడ తాను'' అన్నాడు రామరాజు.

శమంత చిరునవ్వు నవ్వింది. ''ఆపాటి హామీ ఇచ్చారు... చాలా సంతోషం! నాబాధ్య తని సక్రమంగా నిర్వర్తించుకున్నానన్న సంతృ ప్తి నాలో నిండింది'' అంది శమంత.

శమంత ప్రయత్నాన్ని మనసులోనే ప్రేమ హర్షించకుండా ఉండలేకపోయింది.

ప్రేమ లేచినుంచుంది. ''శమంతా... మరి నేను వెళ్ళొస్తానే! మా ఇంటికిరావా?'' అంది స్నేహపూర్వకంగా.

శమంత చిన్నగా నవ్వుతూ ప్రేమ చేతిని తన చేతిలోకి తీసుకుంది.

''వ్యవధిలేదే ప్రేమా! రేపు వెళ్ళిపోతాను. మరేం అనుకోవద్దు. ఈ పర్యాయం ప్రత్యేకించి మీ ఇంటికే వస్తాన్లే''

''సరే... చూద్దాం- నీ మాటని ఎంత వరకూ నిలబెట్టుకుంటావో. ఈసారి వచ్చినపుడు మీ ఆయన్ని కూడా తీసుకురా? మీ అమ్మానాన్నకి నా నమస్కారములు చెప్పు''

''అలాగే!''

''వస్తాను దీప్తీ!'' అంది ప్రేమ.

''ఈరోజు నుంచి నిన్ను వదిన అనే పిలుస్తా ను ప్రేమా! భోంచేసి వెళ్ళకూడదూ వదినా? ఆలస్యమైనా మీ అన్నయ్యగారు తోడొస్తారు?'' అంది దీప్తి.

''ఇప్పటికే ఆలస్యమయింది దీప్తి! భోజనా నికి ఉండలేదని మరేం అనుకోకు...'' అంటూ రామరాజు కేసి చూసి ''వస్తాను అన్నయ్యగా రూ!'' అంది ప్రేమ.

''మంచిదండీ! పదండి... మీకో ఆటో ఏర్పా టుచేసి వచ్చేస్తాను''

రామరాజు ప్రేమతోపాటు రోడ్డు మీద కా స్తంత దూరం నడిచాడు. ఇద్దరూ మౌనంగానే నడిచారు.

ఓ ఖాళీ ఆటో అగుపించగానే ప్రేమని అందులో పంపించేశాడు. రామరాజు.

★ ★ ★

దీప్తి శమంత రెండు చేతులూ పట్టుకుంది.

''నువ్వు చేసిన ఈ మేలు నేనీ జన్మలో మర్చిపోలేనే శమంతా?'' అంది కృతజ్ఞతాభా వంతో. ఆమె కళ్ళల్లో ఆనందభాష్పాలు ము త్యాల్లా మెరుస్తున్నాయ్.

''దానికేముంది లేవే దీప్తి! స్నేహితురా లిగా, బంధువుగా, ముఖ్యంగా సాటిస్త్రీగా నాకు చేతనైన సహాయంచేశాను. అది నా కర్తవ్యంగా, బాధ్యతగా భావించాను. ఈ విధంగా నీ సంసా

రాన్ని చక్కదిద్దినందుకు, నాకెంతో తృప్తిగా ఉంది. ఇది వ్యక్తిగత సమస్యకాదు. అందరికీ సంబంధించిన సమస్య. ఈరోజు నీ జీవితంలో జరిగింది. మరోరోజు నా జీవితంలో జరగవచ్చు... ఎవరి జీవితంలోనైనా జరగొచ్చు. దాన్ని విత్తులోనే నాశనంచెయ్యాలి. నిజాల్ని నిర్భయంగా బైటపెట్టాలి'' చిన్నగా నవ్వుతూ అంది శమంత.

అప్పుడే ఇంట్లో అడుగుబెట్టిన రామరాజు, ద్వారం దగ్గరనుంచుని ఇద్దరు చెప్పిన మాటలూ విన్నాడు.

''శమంతగారూ... దీప్తి చెప్పిందాంట్లో అతిశయోక్తిలేదండీ! మీ మేలు మరిచిపోలేనిది. దీప్తి ఒక్కత్తే కాదు- నేనూ మర్చిపోలేను. మీరు చొరవ తీసుకుని ఇక్కడికి రాకపోతే, ఈ సమావేశం ఏర్పాటుచేసి ఉండకపోతే, నాకు ఇన్ని నిజాలు తెలిసి ఉండేవి కావండీ! భైరవమూర్తి నా ప్రాణమిత్రుడనే ఇన్నాళ్ళూ భావించాను గాని, స్నేహమనే బాంధవ్యానికి కళంకం తెచ్చిపెట్టే నయవంచకుడనుకోలేదు. వాడి కక్షతీర్చుకోడానికి నన్నూ నా సంసారాన్ని నాశనం చెయ్యడానికి తలబెట్టిన స్నేహితుడు, స్నేహితుడు కానేకాడు... పరమశత్రువు'' ఉక్రోషంతో అన్నాడు రామరాజు.

రామరాజు మొహం జేవురించింది. కళ్ళు ఎర్రబడినాయ్. నాసికాగ్రం కంపిస్తోంది. మనిషి బిగుసుకుపోయాడు.

అతని ఆవేశం చూసి శమంత ఎంతో ఆనందించింది. అతనిలోని వ్యక్తిత్వం, నిద్రలేచినట్టనిపించింది. సన్నగా మందహాసం చేసింది.

''అన్నయ్యగారూ... ఇప్పటికయినా నిజాన్ని తెలుసుకున్నందుకు ఆనందంగానే వుందిగాని ఆవేశం ఎప్పుడూ వాంఛనీయం కాదండీ! ఆవేశం సమస్యల్ని పరిష్కరించలేదు. పైగా విచక్షణాజ్ఞానాన్ని పోగొడుతుంది. అంచేత ఓర్పు చాలా అవసరం. భైరవమూర్తి దుర్మార్గుడని, పయోముఖవిషకుంభంలాంటివాడని ఇప్పుడు మీరు గ్రహించారుకదా! అతనితో శత్రువుగా గాకుండా, మిత్రుడిగానే వుంటూ విచక్షణతో మసలండి. అతణ్ణి మీరెప్పుడూ ఇంక నమ్మకండి- ఇదే నా సలహా. మీకంటె వయసులో చిన్నదాన్నే అయినా ఈ సలహాని ఇవ్వకుండా వుండలేకపోతున్నాను. నన్ను అర్థం చేసుకోండి''

రామరాజులోని ఆవేశం మంచుముక్కలా క్రమంగా కరిగిపోయింది. శమంతలోని ప్రాపంచిక పరిజ్ఞానానికి అచ్చెరువందాడు. ఆమె సమయస్ఫూర్తిని, తెలివితేటలని మనసులోనే అభినందించుకున్నాడు.

''మీ సలహాని తప్పకుండా పాటిస్తానండీ శమంతగారూ! మీరన్నట్టు భైరవమూర్తిని ఇప్పుడు పూర్తిగా అర్థంచేసుకున్నాను. వాడితో నాకు శత్రుత్వమూ వుండదు. స్నేహమూ వుండదు, అటువంటివాణ్ణి తప్పించుకుతిరగడమే వుత్తమం''

''మీ నిర్ణయానికి చాలా సంతోషిస్తున్నాను అన్నయ్యగారూ! మా దీప్తి నాకంటే తెలివైనదే గాని నాలాంటి చొరవలేదు దానికి. ఆ చొరవే వుంటే ఈ సమస్య అప్పుడే పరిష్కారమయ్యేది''

రామరాజు భార్యకేసి చూశాడు. దీప్తి బేలగా అతనికేసి చూస్తూ వుండిపోయింది.

''దీప్తీ... నీ భర్తను గాబట్టి నన్ను క్షమించమని నిన్ను కోరనుగాని జరిగిందాన్ని సహృదయంతో మర్చిపోమని కోరుతున్నాను. మళ్ళీ ఇటువంటి పొరపాట్లు జరగవని మనసా, వాచా హామీ ఇస్తున్నాను- అదీ నీ స్నేహితురాలి సమక్షంలోనే'' అన్నాడు సౌమ్యంగా.

దీప్తి మొహం వికసించింది. తృప్తితో ముసిముసిగా నవ్వుకుంది. ఈ క్షణంకోసమే ఎదురుచూస్తోందామె. అనిర్వచనీయమైన ఆనందం ఆమె కళ్ళల్లో వెల్లివిరిసింది. ఆ ఆనందాతిరేకంతో చప్పున మాట్లాడలేకపోయింది.

''నాకింక కావల్సిందేవిటండీ!'' అంది మురిపెంగా.

''జరిగిందంతా ఓ కలలా భావించి మర్చిపో దీప్తీ!''

''అలాగేనండీ!''

''చూడు దీప్తీ... వంట త్వరగా ముగించు- భోజనాలయ్యాక సినిమాకి వెళ్దాం'' అన్నాడు రామరాజు.

''ఇప్పుడెందుకులెండి అన్నయ్యగారూ?

బడలికగా వుంది. విశ్రాంతి తీసుకుందాం'' అంది శమంత.

''అబ్బే... అలా కుదరదు చెల్లెమ్మా! మీ కంపెనీ మళ్ళీ మాకు ఎప్పుడు దొరుకుతుందని! ఈ అన్నయ్యమాట కాదనకండి'' ఒత్తిడిచేశాడు రామరాజు.

''ఔనే శమంతా! మళ్ళీ మనం ఎప్పుడు కల్సుకుంటామో ఏమో! అందరం కలిసి సినీమాకి వెళ్ళే అవకాశం మళ్ళీ రాదుకదా! అందుకని పోదాం పదవే శమంతా!'' భర్తని బలపరుస్తూ అంది దీప్తి.

శమంత కాదనలేకపోయింది. దీప్తి దంపతుల మనస్సు కష్టపెట్టడం ఇష్టంలేకపోయింది.

''సరేలేవే... మీరు అంతగా పట్టుబడుతూ వుంటే ఏం చెయ్యను? త్వరగా వంటకానీయ్ అయితే''

దీప్తి, శమంత వంటగదివేపు నడిచారు. వాళ్ళిద్దరూ వంటపనిలో నిమగ్నులయ్యారు.

రామరాజు రేడియో వింటూ కూచున్నాడు.

భోజనాలయ్యాక ముగ్గురూ కలిసి సినిమాకి వెళ్ళారు.

★ ★ ★

మర్నాడు శమంత విజయవాడ వెళ్ళిపోయింది. రామరాజు, దీప్తి స్టేషనుకి వెళ్ళి శమంతని సాగనంపి వచ్చారు.

''హమ్మయ్య... గాలివాన వెలిసినట్టయిందండీ!'' ఇల్లు చేరుకున్నాక సోఫాలో కూచుంటూ అంది దీప్తి.

రామరాజు ఆమెపక్కనే కూలబడ్డాడు.

''నిజమే దీప్తీ! ఇప్పుడు ప్రశాంతంగా వుంది''

''ఈవేళ ఆఫీసుకి వెళ్తారా?'' ప్రశ్నించింది దీప్తి.

''ఎందుకు వెళ్ళనూ? దర్జాగా అలా కూచుండి పోయావేంటి దీప్తీ? తొందరగా వంటకానివ్వు''

''ఓకే... ఓ అరగంటలో అయిపోతుంది'' అక్కణ్ణించి వెళ్ళిపోయింది.

రామరాజు దినపత్రిక చదువుతూ కూచున్నాడు.

అరగంట దాటేసరికి దీప్తి వచ్చింది.

''వంట రెడీసార్! భోజనానికి రండి'' అంది నవ్వుకుంటూ.

ఆశ్చర్యపోయాడు రామరాజు.

''ఏవిటీ? అప్పుడే వంట రెడీ అయిందా? ఆశ్చర్యంగా వుందే! ఎలా సాధ్యపడింది దీప్తీ?'' ఆమెకేసి చూస్తూ అన్నాడు.

''ఏముందండీ? రెండు పొయ్యిల్నీ వుపయోగించాను. ప్రయత్నిస్తే అసాధ్యమన్నది ఏదీలేదండీ!'' రెండు చేతులూ వెనక్కిపెట్టుకుని వయ్యారంగా అంది.

''గుడ్! వడ్డించు... వస్తున్నాను'' అంటూ వెళ్ళి భోజనం చేసి వచ్చేశాడు.

''వస్తాను దీప్తీ!'' అంటూ ఆఫీసుకి బయల్దేరాడు రామరాజు.

''పెందరాళే వచ్చేయండి. రిహార్సిల్సు లేవు కదా?'' అంది దీప్తి.

''అలాగే దీప్తీ!'' ముందుకు సాగిపోయాడు.

దీప్తి హుషారుగా కూనిరాగాలు తీసుకుంటూ ఇంట్లోపలికొచ్చి తలుపు వేసింది.

రామరాజు సరిగ్గా సమయానికే ఆఫీసుకి వెళ్ళాడు. మరీ ఉత్సాహంగా, అందంగా అగుపిస్తున్నాడారోజు.

''ఇవ్వాళ చాలా అందంగా, హుషారుగా అగుపిస్తున్నావేయ్ రాజూ!'' ఒక మిత్రుడు అభినందించాడు.

రామరాజు గడ్డాన్ని ఓసారి చేత్తో తడుముకున్నాడు. నున్నగా అద్దంలా వుంది. ముసిముసిగా నవ్వుకున్నాడు.

''షేవ్ చేసుకున్నానుకదా...'' నవ్వుతూనే చెప్పాడు.

అంతలో రామారావు అక్కడికి వచ్చాడు.

''అదొక్కటే కారణంకాదు... మీ ఆవిడ వచ్చేసిందికదోయ్?'' అన్నాడు నవ్వుతూ.

''ఔనండీ... వచ్చేసింది.''

''అదీ ముఖ్యకారణం!'' నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు రామారావు.

అందరూ ఒక్కసారి నవ్వేశారు.

రామరాజు తన సీటునుండి లేచి భైరవమూర్తి సెక్షనుకి వెళ్ళాడు. ప్రేమద్వారా విష

యాలన్నీ విన్నాక భైరవమూర్తిలో ఎటువంటి మార్పు వచ్చివుంటుందో తెలుసుకోవాలన్న తా పత్రయంతో వెళ్ళాడు.

కాని భైరవమూర్తి అగుపించలేదు. ఆశ్చర్య పోయాడు. పక్కసీట్లోవున్న రామానుజంని అడి గాడు.

"అదేమిటండీ... రామరాజుగారూ మీకు తెలీదా?" ఆశ్చర్యంతో ప్రశ్నవేశాడాయన.

కంగారుపడ్డాడు రామరాజు.

"ఏమిటండీ? ఏమయింది?" ఆతృతగా అడిగాడు.

"కారణం ఏమిటో తెలీదుగానండీ, నెలరో జుల కోసం సెలవు దరఖాస్తు పంపించేసి, అర్జంటుగా ఊరెళ్ళాడటండీ?" చెప్పాడు రామానుజం.

"అప్లికేషను ఇంటి దగ్గర్నించే పంపించాడా?"

"ఔనండీ! ఔనూ... మీరిద్దరూ అంత సన్ని హిత స్నేహితులుకదా, మీకీ విషయం తెలీ దంటే ఆశ్చర్యంగా ఉందే?" అన్నాడు రామా నుజం.

లోలోన నవ్వుకున్నాడు రామరాజు. కారణం ఏమని చెబుతాడు వాళ్ళకి.

"దానికేముందిలెండి" అనేసి అక్కణ్ణించి జారుకున్నాడు రామరాజు.

భైరవమూర్తి ఎందుకంత హఠాత్తుగా అన్ని రోజులు సెలవుపెట్టాడో, ఎందుకు ఊరువిడిచి వెళ్ళాడో, ఆఫీసులో ఎవ్వరికీ తెలీదు ఒక్క రామరాజుకి తప్పించి. రామరాజు కారణాన్ని ఊహించాడంతే! అయినా సరే-- ఆ విషయా న్ని ఆఫీసులో ఎవరికీ చెప్పలేదు. చెప్పి భైరవ మూర్తిని నవ్వులపాలు చెయ్యడమేకాదు- తనూ నవ్వులపాలు కావల్సివస్తుందని మౌనందాల్చా డు.

ఆ సాయంత్రం మామూలు సమయానికే ఇంటికొచ్చేశాడు రామరాజు.

దీప్తి ఎంతగానో మురిసిపోయింది.

"ఈ విషయం విన్నావా?" సోఫాలో కూచుంటూ అన్నాడు రామరాజు.

"ఏమిటండీ?"

"భైరవమూర్తి నెలరోజులు సెలవుపెట్టి, భార్యతోసహా ఎక్కడికో వెళ్ళిపోయాడట..."

"మొహం చెల్లక వెళ్ళిపోయి ఉంటాడు లెండి. పాపం అతని మూలంగా అర్ధాంగి అయిన పాపానికి ప్రేమ అవమానాన్ని 'రించాల్సివస్తోంది"

"భార్యగా ఆమెకి తప్పదుకదా దీప్తీ! 'చెరప కురా చెడేవు' అని ఊరికే అనలేదు. మన సంసారంలో చిచ్చు పెట్టాలని ప్రయత్నించా డు భైరవమూర్తి. కాని ఏమయింది! వాడికే ఎదురుదెబ్బ తగిలింది" అన్నాడు రామరాజు.

"దుర్బుద్ధి తాత్కాలికంగా విజయం సాధించినా, అంతిమ విజయం సాధించలేదు. ఎదురుదెబ్బ తిని నాశనమవుతుంది. ఈ సత్యాన్ని ఎవరూ గ్రహించరు" అంది దీప్తి.

భార్య మాటలకు ఆశ్చర్యపోయాడు రామ రాజు.

"శమంత సాహచర్యంతో నీకూ మాటకారి తనం అబ్బినట్టుంది దీప్తీ" నవ్వుతూ అన్నా డు.

దీప్తి ముసిముసిగా నవ్వుకుంది.

"మీకు తెలీదండీ... వక్తృత్వ పోటీల్లో నాకె న్నో బహుమతులువచ్చాయండీ".

"అలా చెప్పు..."

"ఇంతకీ మీ రిహార్సిల్సు ఎంతవరకూ వచ్చాయండీ?" అంది దీప్తి.

"ప్రస్తుతానికి రిహార్సిల్సు ఆపేశాం. అదీ గాక నేను భైరవమూర్తి సమాజంనించి తప్పు కుంటున్నాను. మరో సమాజంలో చేరుతున్నా ను దీప్తీ"

ఈ వార్త దీప్తిని ఆనందంలో ముంచెత్తింది.

"చాలా సంతోషమండీ... భైరవమూర్తితో సన్నిహిత సంబంధాలు వదులుకోవడమే మంచిది. అదే చేశారు. నాకెంతో ఆనందంగా ఉంది" అంది.

"ఇప్పటికయినా నిశ్చింతంగా నిద్రపో దీప్తీ" అన్నాడు నవ్వుతూ

దీప్తి తృప్తిగా ఓనిశ్వాసం వదిలి, సన్నని మందహాసం చేసింది.

ఆమె మందస్మిత వదనాన్ని చూస్తూ అలా ఉండిపోయాడు రామరాజు. ★

# మీ బిడ్డల భవిష్యత్తును గురించికాక మీ ఆరాటం వేరేముంటుంది!



# మార్గదర్శి

మీ బిడ్డల భవిష్యత్తు తీర్చిదిద్దడానికి తలపెట్టే ప్రయత్నంలో ఆచితూచి అడుగువేయాలి. అందుకు లాభప్రదమైన సంస్థలో మీ డబ్బు పెట్టుబడి పెట్టండి. మీరు నిశ్చింతగా ఎంచుకోదగ్గ సంస్థ మార్గదర్శి ఒక్కటే.

మీ డబ్బుకు సురక్షిత దుర్గం మార్గదర్శి. ఎన్నో ఏళ్ళుగా తన ఎనలేని సేవలతో వేనవేల సభ్యులలో కలిగించిన అనంతమైన సంతృప్తి, అచంచల విశ్వాసం మార్గదర్శి నిజాయితీకి నిబద్ధతకు నిదర్శనం. ఆర్థిక పాటవంగల సభ్యుల్ని చేర్చుకోవటంలో మార్గదర్శి చూపే శ్రద్ధ సభ్యుల ప్రయోజనాలకు శ్రీరామరక్ష. సభ్యులందరి అభ్యుదయానికే ఈ అవిరళ కృషి.

ఈ అనన్య ప్రతిష్ఠ ఆర్జించడానికి మార్గదర్శి ఇరవైనాలుగు సంవత్సరాలు పరిశ్రమించి ఈనాడు యావద్దేశంలో అగ్రగామి చిట్‌ఫండ్ సంస్థగా పురోగమిస్తున్నది. అంచెలంచెలుగా ఎదుగుతూ మార్గదర్శి వార్షిక వ్యాపారం ఇప్పుడు రు.60 కోట్లు దాటింది. మీ వివిధ అవసరాలకు అనుగుణంగా రకరకాల మొత్తాలలో ఎన్నెన్నో చిట్‌లు మార్గదర్శి మీ కోసం సిద్ధం చేసింది.

ప్రస్తుత పథకం

| చందా | నెలలు | మొత్తం | సభ్యులు |
|---|---|---|---|
| 400 | 25 | 10,000 | 25 |
| 1000 | 25 | 25,000 | 25 |
| 2000 | 25 | 50,000 | 25 |
| 200 | 50 | 10,000 | 50 |
| 400 | 50 | 20,000 | 50 |
| 500 | 50 | 25,000 | 50 |
| 1000 | 50 | 50,000 | 50 |
| 2000 | 50 | 1,00,000 | 50 |
| 4000 | 50 | 2,00,000 | 50 |
| 5000 | 50 | 2,50,000 | 50 |

బ్రాంచీలు :

- బషీర్‌బాగ్, హైదరాబాద్.
- లకిడికాపూల్, హైదరాబాద్.
- చిక్కడపల్లి, హైదరాబాద్.
- అమీర్‌పేట్, హైదరాబాద్.
- ఎమ్.జి.రోడ్, సికింద్రాబాద్.
- ఎ.ఎమ్.సి.కాంప్లెక్స్, విజయవాడ.
- బందర్‌రోడ్, లక్ష్మీపేట్, విజయవాడ.
- జగదాంబ జంక్షన్, విశాఖపట్నం.
- స్టేషన్‌రోడ్, గుంటూరు.
- జె.పి.యన్.రోడ్, వరంగల్.
- టి.నగర్ రాజమండ్రి.
- సుభాష్‌రోడ్, కాకినాడ.
- శిఫా రోడ్, కర్నూలు.
- వైరారోడ్, ఖమ్మం.
- నరసింహారావుపేట, ఏలూరు.
- ఆర్.ఆర్.స్ట్రీట్, నెల్లూరు.

**డబ్బుకోసమేనా మీ చింత !**
**మార్గదర్శి ఉన్నది మీ చెంత !!**

**మార్గదర్శి చిట్‌ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్**

రిజిష్టర్డ్ మరియు సెంట్రల్ ఆఫీసు:
ఆబిడ్ సెంటర్, హైదరాబాద్ - 500 001.




ఈ శీర్షిక ద్వారా ప్రతి నెలా 'చతుర' లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరటావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించినవాటిలో మొదటి మూడింటికి రు.100/-, రు. 75/-, రు. 50/- చొప్పున; మరో మూడింటికి రు. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనా శక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

'చతుర'లో ప్రచురించే చిత్రాలు, ఫొటోలు, చతుర ప్రపంచం, కథలు, ఫీచర్ల వంటి ఇతర అంశాల పట్లకూడా పాఠకులు తమ అభిప్రాయాలను విడిగా రాసి పంపగోరుతున్నాం. ఉపయోగకరమైన అభిప్రాయాలు వచ్చిన సందర్భాల్లో ప్రత్యేకంగా బహుమతులు ఇవ్వదలిచాం.

## కూపన్

### నవంబర్ 'చతుర' నవల కక్ష

సమీక్షకుని పేరు: ..................................................

చిరునామా: ..................................................

..................................................

..................................................

..................................................



# అందరినీ అలరించే అత్తర్లు

మల్లెపూల తోటల్లో సువాసనల విరులు!
వల్లీయుల పాటల్లో అనుభూతుల ఝరులు!

పెళ్ళిపేరంటాలు, విందువినోదాలు మొదలైన శుభకార్యాల పేరు వినగానే పరిమళభరితమైన అక్కడి పరిసరాలు తలపుకొస్తాయ్! ఘుమఘుమలాడే వంటకాలు నోరూరించినా అంతకన్నాముందు' సుగంధభరిత వాతావరణమే ఆహ్వానించి మత్తెక్కిస్తుంది. మనసును ఉల్లాసభరితంచేస్తుంది. ఏవో లోకాల్లోకి తేలిపోతున్న అనుభూతిని కలిగిస్తుంది. చిన్నలు, పెద్దలు, ఆడ, మగ - అందరూ ఎంతో ఇష్టంగా తమ దుస్తులకో, మేనికో అద్దుకున్న అత్తర్లే ఈ సువాసనలకి మూలం.

ఈ ఆధునికయుగంలోనే అత్తర్లుపూసుకునే అదృష్టం మనకే దక్కిందనుకుంటే పొరపాటే. వీటిని ప్రాచీనకాలంనుండీ యావత్ ప్రపంచం వాడుతోంది. కాళిదాసు తన కావ్యాల్లోని శకుంతలవంటి నాయికలు అత్తర్లు వాడినట్లు రాశాడు. అంటే ఆకాలానికే మనదేశంలో అత్తర్లవాడకం వుందని తెలుస్తోందన్నమాటే.

ముస్లిములు అత్తర్లవాడకానికి ఎంతో ప్రాధాన్యతనిస్తారు. వారి మతప్రవక్త మహమ్మద్‌కి సెంట్లంటే ఎంతోఇష్టం. అందుకే అత్తర్లువాడి మతప్రవక్తకి చేరువకాగలమనీ, ఆయన్ని వశపర్చుకోగలమనీ వారి నమ్మకం. తమ ప్రవక్తనే ఆకర్షించిన అత్తర్లంటే వారికెంతో అభిమానం.

మొగల్‌పాలకులంతా అత్తర్లను విరివిగా వాడేవారు. జహంగీర్‌పాదుషా మెప్పు పొందేందుకు ఎందరెందరో వ్యాపారస్థులు దూరతీరాలనించి ఖరీదైన, నాణ్యమైన అత్తర్లు తమతమ దేశాలనుండితెచ్చి ఆయనకి కానుకలుగా సమర్పించుకునేవారు. అబూఫజల్ తన'ఐనీఅగ్బరీ'లో చక్రవర్తులంతా అత్తర్లని అమితంగావాడేవారని రాశాడు. సభాభవనా



అత్తర్లకు ఆశ్రయమిస్తాం!
అత్తలనైనా మెప్పిస్తాం!!

దేవతలకి కానుకలుగా అర్పించేవారు, మృతదేహాలకి అలదేవారు. అత్తర్లపరిమళానికి ముగ్ధులయిన ధనికులు వాటిని వాడటం ప్రారంభించటంతో అది నెమ్మదిగా సామాన్యవర్గాల ప్రజలకు సైతం పాకిపోయింది. అందరూ తమదుస్తులకు అత్తర్లు పులుముకోవటం పరిపాటిగా మారింది. బాబిలోనియన్లు అత్తర్లను మక్కువతో వాడేవారని తెలుస్తోంది. రోమనులు పరిమళద్రవ్యాల్ని ఇళ్ళల్లో విరజిమ్ముకుని, సెంట్‌నూనెలతో మేనికి మర్దనాచేసుకునేవారు. క్రైస్తవుల పవిత్ర గ్రంథమైన బైబిల్‌లో కూడా అత్తర్లప్రస్తావన



పూవులమై పరిమళించేము!
తావులమై అందరినలరించేము!!

లూ, న్యాయస్థానాలూ, దైవమందిరాలూ అగరుధూపాలతో నిండి మత్తుకలిగించేవి.

గ్రీకులు, రోమనులు కూడా అత్తర్లంటే మోజుపడేవారు. నీటిలో గులాబీ నీటిని కలుపుకొని స్నానానికి ఉపయోగించుకునేవారు. ట్రామ్‌కి చెందిన హెలెన్ తనొకర్తే రహస్యంగా అత్తర్లని వాడుకునేది. అంటే తనువాడే బ్రాండు పరిమళం మరొకరిదగ్గర రావటం ఆమెకినచ్చేది కాదేమో! చైనీయులు అత్తర్లని దుస్తులకి రాసుకుంటే, ఈజిప్టులో అత్తర్లని



గాజు కూజాల్లో విరజాజి రసం!
నిరు పేదలకూ, రారాజులకూ ప్రియం ప్రియం!!



మా జీవితకాలం అతిస్వల్పం!
అయినా ముగ్ధమనోహర స్నిగ్ధత్వం అనల్పం!!

తరచుగా వస్తుంటుంది. సుగంధపరిమళాలు విరజిమ్మే అగరొత్తులు పూజావేళల్లో వెలిగించటం అంతటావున్నదే!

మనదేశంలోని బెంగాలీలు అత్తరులో చిన్న దూది ఉండనుముంచి చెవుల్లో పెట్టుకుంటారు. కొన్ని పత్రికలు ప్రత్యేకసంచికల కాగితాలకు పరిమళద్రవ్యాల్ని పులమటంతో చదువరులకు పేజీతిప్పగానే కమ్మని పరిమళం సోకుతుంది.

మధ్యయుగంలో అరబ్బులు గులాబీపూల నుండి అత్తర్లను తయారుచేసుకునేవారు. ఇందుకోసం 14వ శతాబ్దంలోనే ఎకరాలకొద్దీ



రవళించిన జావళీలు!
శిరసెత్తిన ఈ లిల్లీలు!!



సుమసుగంధమే ఒడలెల్ల మరిగి!
సీసాల్లో ఒదిగెను నిలువెల్ల కరిగి!!



గులాబీతోటలను పెంచేవారు. ఆ పువ్వుల్ని కేవలం అత్తర్లతయారీ కోసమే వినియోగించుకునేవారు. 1370లో హంగేరీరాణి ఎలిజబెత్ హయాంలో ఆల్కహాలులో సుగంధద్రవ్యాలు కలిపి చేసిన వన్నీటిని 'హంగేరీవాటర్' అనేవారు. ఆతరువాత ఇటలీలోకూడా అత్తర్లతయారీ ప్రారంభమైంది. 17,18శతాబ్దాల్లో అత్తర్లఫ్యాక్టరీలు ప్రారంభించారు. పారిస్ ఈ పరిశ్రమలకు కేంద్రమైంది. ఖరీదెక్కువచేసే మేలిరకం అత్తర్లూ, చవగ్గాదొరికే నాసిరకం అత్తర్లూ తయారై మార్కెట్లో విడుదలయ్యాయి.

'హైడ్రోడిస్టిలేషన్' ద్వారా అత్తర్లు తయారుచేయటం ఒక పద్ధతి. ఈవిధానంలో పూవుల




సుండిగానీ, మొక్కలనుండిగానీ, వేళ్ళనుండి గానీ రసాన్ని సేకరించి గంధపునూనెలో కలుపుతారు. స్వతహాగా గంధపునూనె సుగంధవంతంగా వుంటుంది. దానికి ఈరసం కలిస్తే మరింత పరిమళవంతం అవుతుంది. మంచి రంగు రావటానికి 'పటిక' కలుపుతారు. ఈపద్ధతిద్వారా అత్తరుతయారీకి ఒక పెద్ద రాగిపాత్రలో నీళ్ళుపోసి అందులో నలభైకిలోగ్రాముల పూలరసంగానీ, వేళ్ళరసంగానీ కలుపుతారు. పొయ్యివెలిగించి కర్రలతో, పిడకలతో వేడిచేస్తారు. ఆ రాగిపాత్రకు దానికి అమర్చిన ఒక గొట్టంద్వారా మిశ్రమంతాలూకు ఆవిర్లు కండెన్సర్‌లోకి ప్రవహిస్తాయి. పొయ్యివెలిగించక ముందే రాగిపాత్రకు ఒక గొట్టంద్వారా కండెన్సర్‌ని కలిపివుంచుతారు. కండెన్సర్‌ని చల్లని నీటిలో వుంచి అడుగుభాగాన గంధపునూనెను పోస్తారు. ఆవిర్లు కండెన్సర్‌లోకి చేరి అడుగునున్న గంధపునూనెలో కలుస్తాయి. ఇదేపద్ధతిలో డిస్టిలేషన్ చాలాసార్లు కొనసాగిస్తారు. ఆ తరువాత మంటలార్పి కండెన్సర్‌లోని అత్తరును పంపుకుంటారు. రాగిపాత్రలో మిగిలిన మిశ్రమాన్ని' గులాబీనీరు' అంటారు.

40కిలోగ్రాముల గులాబీపూల నుండి 5 గ్రాముల అత్తరు లభిస్తుంది. ఒక కిలో అత్తరు వెల 70 వేలనుండి లక్షరూపాయలదాకా పలుకుతుంది.

అత్తర్ల తయారీకి గులాబీ, మల్లె, చమేలీ, బాబే, కియోరా, చంపాపుష్పాల్ని ఉపయోగిస్తారు. ఒరిస్సాలోని గంజాంలోనూ, ఉత్తరప్రదేశ్ లోని కొన్ని ప్రాంతాల్లోనూ కియోరా పుష్పాలు అత్యధికంగా విరబూస్తాయి.

గులాబీ పూలు అలీగఢ్, కానౌజ్, గాజీపూర్, ఎటాహ్, జౌన్‌పూర్, బాలియా జిల్లాల్లో ఎక్కువగా పూస్తాయి. 'కుష్'ని కట్టి వేళ్లనుంచి తీస్తారు. ఈ అత్తరు మంచి పరిమళంతో ఘుమఘుమలాడుతుంది.

ఒక్కొక్క వ్యక్తికి ఒక్కొక్కరకమైన సువాసననిస్తూ, ఒక్కొక్కచర్మానికి ఒక్కొక్కరకమైన మార్పును చూపిస్తూ ప్రభావితం చేస్తుంది పాట్‌పౌరి అత్తరు మజ్‌ముఁవా. 'హిన్నా' గులాబీలు ఈ అత్తరు తయారీలో ఉపయోగపడతాయి.

గంధపునూనెలో సెలెరీ, సాస్ప్ అజ్వైయిన్ గింజలు కలుపుతారు. వివిధరకాల ఔషధుల మొక్కలు హిన్నాకి ముడిసరుకులు. కస్తూరి, పునుగు, జవ్వాది పరిమళ ద్రవ్యాల్ని కూడా అత్తర్లలో మిశ్రమం చేస్తారు. అలోయెవుడ్ లేక అగరు కిలో ఇరవైవేల రూపాయల ధర వుంటుంది. ఇది ఎక్కువగా పశ్చిమఆసియాలో వాడకంలో వుంది. అరబ్బుషేక్‌లు విమానాలు దిగి నేరుగా బొంబాయిలోని అత్తరు దుకాణాలకే వేంచేస్తారట! ఎక్కువ మోతాదులో, కావలసినన్ని నాణ్యమైన అత్తర్లు బొంబాయినగరంలోనే లభించటం విశేషం.

అస్సాంలోని హెజాయి అడవుల్లో పరిమళవంతమైన చెక్కనిచ్చే చెట్లు దట్టంగా పెరుగుతాయి. దేశ విభజన పూర్వం సెల్‌హెత్ నుంచి అత్తరు డిస్టిల్ చేయడానికి వచ్చిన నిపుణులు ఇక ఇదే వృత్తిలో కొనసాగుతూ అస్సాంలో స్థిరనివాసం ఏర్పర్చుకున్నారు. వీళ్లలో కొందరు గంధంచెక్క నుంచి తాజా నూనెను కుండల్లోకి డిస్టిల్ చేస్తారు.

పాన్లు దాచుకునే పెట్టెను పాన్‌దాన్ అన్నట్లే



ప్రకృతి పూసిన వసంతాన్ని నేను!
కవులు మెచ్చేటి మోహనరాగాన్ని నేను!!



అభిమానుల సేవల్లో!
పరిమళాల పరవళ్లలో!!

అత్తరును నిలవచేసుకునే చిన్నచిన్న పాత్రలుంచే స్టాండును, పెట్టెను అత్తరుదాన్ అంటారు కొన్నివర్గాల ప్రజలు. ఇవి ఎంతో అందంగా నగిషీలు చెక్కబడివుంటాయి. 'రోజ్ వాటర్'గా ప్రసిద్ధమైన "గులాబీ నీరు" చల్లడానికి సన్నని పొడవైన కాడగల పాత్రల్ని వాడతారు. ఇలాంటి పాత్రలన్నిటిపైనా తీగలు అల్లుకున్న డిజైన్లను అందంగా శిల్పీకరిస్తారు. అవెంతో ఆకర్షణీయంగా వుండి చూపరులను వెంటనే ఆకట్టుకుంటాయి. 'ఫాయా'లని పిలిచే దూది వుండల్ని అత్తరులో ముంచి వాడుకుంటారు. అలంకరణ పెట్టెల్లో వీటిని బంగారు రేకుల మధ్య అమర్చటం విశేషం. పూర్వం దంతంతోచేసిన పాత్రలు మామిడిపళ్ల ఆకారంలో రాజగృహాల్లో పీఠం వేసుకునేవి. రాణుల అంతఃపురాల్లో, ఏకాంతమందిరాల్లో, అలంకరణ సామగ్రులమధ్య విశేషించి కనిపించేవి. అత్తరుదాన్ల నగిషీ పనితనం, అత్తరు విలువ కలిసి అంతపురాంగనల అభిరుచిని చెప్పకచెప్పేవి. అత్తరుదాన్లలో రకరకాల అత్తరులుండేవి. డ్రెస్సింగ్ టేబుళ్లపైన అత్తరుదాన్లను ఉంచటం నాగరికతగా భావించేవారు. ఆకర్షణీయంగా, కన్నుచెదిరే నిపుణతతో లక్క పెట్టెలను తయారుచేసి అత్తర్లూ, సుగంధద్రవ్యాలుగల చిన్నచిన్న సీసాల్ని అందులో అమర్చుకోవటం ఆనవాయితీ.

చిన్నచిన్న 'అత్తరు' సీసాల్ని అందమైన పెట్టెల్లోపెట్టుకొని వీధులవెంట తిరిగి అమ్ముకునే వ్యాపారస్తులు కొందరు ఒక దశాబ్దం క్రితంవరకూ కనిపించేవారు. ప్రస్తుతం పోకేసుల్లో, అందమైన మఖ్మల్ గుడ్డల్లో ఉంచి అమ్మటం ఫాషనైంది. ముస్లిం దేశాల్లో మాత్రం ఇప్పటికీ నిత్యం వీధుల్లో అత్తర్లు అమ్ముతుంటారు. కలకత్తాలో ప్రతి శుక్రవారం మసీదులవద్ద అత్తర్లమ్మే వ్యాపారులు కొలువు తీరుతారు. వీరివద్ద నుంచి మధ్యతరగతి ప్రజలు వేలంవెర్రిగా కొంటారు.

బెంగాల్‌లోనే తన జీవితమంతా గడిపిన కరమతుల్లాఖాన్ అనే వ్యాపారి బ్యాంకులు

అరవిరిసిన రోజా గంధం!
అత్తరుగా అమరిన చందం!!



కోర్టు వుద్యోగస్తులు, వ్యాపారస్తులు మొదలు కొని రిక్షా కార్మికుల వరకు తన కొనుగోలుదార్లే నంటాడు.

కలకత్తాలోనే కాలూటోలా, నయీబజార్ మార్కెట్లలో వందేళ్లక్రితం వెలసిన అత్తరు దుకాణాలు ఇప్పటికీ దివ్యంగా వ్యాపారం సాగిస్తున్నాయి. తరతరాలుగా ఆయా కుటుంబాల వారసులు అత్తర్లతో వ్యాపారాలు చేసుకుంటూనే గడుపుతున్నారు. షోకేసులలో బంగారువర్ణపు తలనూనెలూ, అత్తర్లూ కనిపించి చూపరులను ఇట్టే ఆకర్షిస్తాయి. ఈ దుకాణాల్లోనే నవవధువులకు కావలసిన 'సుహాగ్' అత్తరు లభిస్తుంది. దీన్నే 'ల్యూరిడ్' అని కూడా పిలుస్తారు.

**15, 20** ఏళ్లక్రితం అత్తరు పరిశ్రమ గంధపుచెక్కనూనె ధర చుక్కల్ని తాకటంతో కొంచెం దెబ్బతిన్నా అత్తర్లకి డిమాండ్ తరగలేదు. ధరఎక్కువైనా వెచ్చించి కొనే రసికులు కోకొల్లలు.

మిఠాయి ల్లాంటి తినుబండారాలలో టానిక్కులలో, షర్బతుల్లో సువాసన కోసమై అత్తరును వాడుతుంటారు.

తనను పులుముకున్న వ్యక్తికీ, అతని చుట్టూరా వున్న పరిసరాలకూ, జనానికీ సుగంధభరిత పరిమళాన్ని పంచి, చెమటకంపును పారదోలి క్షణకాలం హృదయాన్ని మత్తెక్కించి పరవశింపచేసే 'అత్తరు' లాగే మనిషి కూడా తను కూర్చున్న పరిసరాలకి 'మానవతా, మమతల' సౌరభాల్ని పంచి అందరికీ హాయినీ, ఆహ్లాదాన్నీ అందించాలని కోరుకుందాం.

—జ్యోతిరాణి

# రచయితలకు సూచనలు



ప్రచురించే ప్రతి నవలకు రు. 2000/-
పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతిభా
వంతులైన రచయితలకు నెలనెలా నవలల
పోటీయే. వైవిధ్యపూరిత ఇతివృత్తాలతో, ఆసక్తికర
రచనా సంవిధానంతో పాఠకులను ఆకట్టుకోగల
నవలలకు వేదిక 'చతుర'.

★ ''చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలుకాక
కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. ''చతుర''లో అచ్చులో ఒక
పేజీలో సుమారుగా 300 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచ
టంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా,
మొత్తంమీద 30 వేల పదాలకు తక్కువగాకుండా ఉండాలి. వ్రాతపతిలో వారి వారి
దస్తూరినిబట్టి,ఒక పేజీకి ఎన్ని పదాలు వస్తున్నాయనేదానినిబట్టి మొత్తం నవల పేజీలకు
ప్లాన్‌వేసుకోవటం అవసరం.

''చతుర'' కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవు

★ ఈ ప్రకారం ''చతుర'' కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవు
నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో,
తాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో,
అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికగాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగుపోస్టేజీని
జతపరచాలి. వ్రాత ప్రతులు పోస్టులోగానీ, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా
బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ
విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్

# చతుర

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482.




"అక్కా... ఏం తెచ్చానో చూడు" పిలిచాడతను.

అక్కముఖం చాటంతయింది.

"మల్లెలు తెచ్చావు. గుమ్మడిపండు తెచ్చావు. బంగారంముద్ద తెచ్చావు. ముత్యాలమూట తెచ్చావు" అంటూ దేవుడే వరమిచ్చినట్లు పొంగిపోయింది.

అతనివెంట వచ్చిన పిల్ల సిగ్గుపడిపోయింది.

బుగ్గలు కెంపులయ్యాయి. ఆ సౌందర్యరాశి కళ్లు మిలమిల మెరిశాయి.

"ఎలా చూసుకుంటావో మరి?" అన్నాడతను.

"బంగారంలా చూసుకోనూ... నువ్వు వేరే చెప్పాలా!" అన్నదామె.

కాని, కిసుక్కుమన్నాయి చుట్టూఉన్న గొంతులు! ఎముకల గూళ్లే చీరలు కట్టుకుని నిల్చున్నట్లున్నాయా గొంతుకుల తాలూకు ఆకారాలు.

ఎవరా మనుములు? ఎవరీ తమ్ముడు, ఆఅక్కా? అక్కడికి ఎలావచ్చిందా సౌందర్యరాశి?

చదవండి జి. వేగావతి నవల అగ్నివసంతం

డిసెంబర్ **చతుర** అందించే కానుక!

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad-500 016, TEL: 229428
CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad-500 482.

# మీ పాపాయికి
# అందించండి సెరిలాక్ లాభం



## తొలిసారిగా ఘన పదార్థాలను ఇస్తూ

4 నెలల నుంచి మీ పాపాయికి, పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి. సెరిలాక్ లాభాన్ని అందించండి.

పోషకాహార లాభం : సెరిలాక్ ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు, ప్రొటీన్లు, కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజాలు అన్నీ వున్నాయి. అన్నీ సమ పాళల్లో వున్నాయి.

రుచి లాభం : పాపాయిలకు సెరిలాక్ రుచి ఇష్టం.

సమయం ఆదా లాభం : సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ, పంచదార, వున్నాయి. దానిని వెచ్చటి నీటితో కలిపితే చాలు.

ఎంపిక లాభం : ఎంచుకునేందుకు మూడు రకాల సెరిలాక్ వుంది.

మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకూ, తయారుచేయటంలో పరిశుభ్రతను పాటించేందుకూ, డబ్బా మీది సూచనలను జాగ్రత్తగా పాటించండి.




6 మాసాల నించి

4 మాసాల నించి

6 మాసాల నించి

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి: సెరిలాక్
పోస్ట్ బాక్స్ నెం 3
న్యూ ఢిల్లీ 110 008

Nestlé

**సెరిలాక్ రక్షణ: పోషకాహారంతో పరిపూర్ణం-ఎంతో రుచికరం**

R K SWAMY/FSL/5112 TEL

CHATURA Telugu Monthly, Hyderabad-500 004.

H/ HD /402

పదరంగం

చిత్రపదరంగం

శీర్షికల విజయం తర్వాత ఇప్పుడు వస్తోంది...

# 'సితార' సినిమా క్విజ్

శీర్షికనిర్వహణ: పాలకోడేటి

నవంబరు మొదటివారంనుంచే ప్రారంభం



★ సినిమాలగురించి ఎన్నెన్నో ప్రశ్నలతో వారంవారం క్విజ్!

★ చిత్రరంగంతో 'సితార' పాఠకులకున్న పరిచయం చాలు- శీర్షికలో పాల్గొనటానికి, బహుమతులు గెలుచుకొనటానికి!!




★ పన్నెండు వారాలపాటు వారంవారం బహుమతులు

★ ప్రతీవారం 'సితార'లో విజేతలపేర్లు

★ ప్రతీవారం ఇద్దరు లక్కీరీడర్స్ ఎంపిక

★ హైదరాబాద్‌లో సెమిఫైనల్స్, ఫైనల్స్

★ దూరదర్శన్‌లో ఫైనల్స్ ప్రసారం

ఇది గతంలో ఏ పత్రికాచేయని అపూర్వప్రయోగం!

దూరదర్శన్ తెరమీద మీరు కనిపించగల అదృష్టయోగం!!